# చెమటకాయల బాధనుండి ఉపశమనానికి టాల్కం పౌడర్ కాదు నైసిల్ కావాలి!

## నైసిల్ వాడండి

**చెమటకాయల బాధనుండి శీఘ్ర ఉపశమనం పొందండి**






నైసిల్ చెమటకాయల బాధనుండి ప్రతిదశలోనూ ఉపశమనాన్నిచ్చేందుకై ప్రత్యేకించి రూపొందించబడిన ఔషధయుక్త పౌడర్. టాల్కం పౌడర్లవలెకాక ఇది క్రిమిచర్యను అరికట్టి బాధ శ్రుతిమించకుండ చేస్తుంది.

1. అతిగా వచ్చే చెమటను ఆపుతుంది. 2. చెమటను పీలుస్తుంది. 3. దుర్గంధకారక క్రిములను ధ్వంసం చేస్తుంది. 4. శరీరానికి హాయినిస్తుంది.

మంచి ఆరోగ్యానికి మూలస్థానం

**గ్లాక్సో**

GLL/8808

# చతుర

సంపుటి : 9 మే 1986 సంచిక : 4


## ఈ నెల సమగ్ర నవల

"మనిషి జీవితానికి ఏమైనా అర్థం వుందా? ఉంటే ఏమిటది? అర్థవంతమైన జీవితం అంటే ఎలావుంటుంది? ఏవో కొన్ని అభిరుచుల్ని, ఆశయాల్ని పెంచుకుని జీవించటమేనా జీవితమంటే? అంతకుమించి ఏమీలేదా? లేకుంటే తనను కాల్చే ఈ అశాంతి ఏమిటి?" ఈ ప్రశ్నలకు జవాబులు అన్వేషిస్తుండే ప్రొఫెసర్ రావుకి సన్నిహితులు రామనాథం మాష్టారు, సహోద్యోగిని మాధురీదేవి, మిత్రుడు కరుణాకరం.

"నిన్ను చూస్తుంటే మనుషుల పట్ల నశించిపోయిన విశ్వాసం తిరిగి తలెత్తుతోంది. మనిషికీ మనిషికీ మధ్య మమత నశించిన నాడు మానవజీవితం వ్యర్థం! నీవంటి శిష్యుడున్నందుకు ఎంత ఆనందంగా వుందో చెప్పలేను'' అంటారు రామనాథం మాష్టారు.

"నేటి సమాజంలో నావంటి స్త్రీల పరిస్థితిని అవకాశంగా తీసుకుని తమ స్వార్థానికి వినియోగించుకోవాలని చూసే అవకాశవాదులే ఎక్కువ. అలాంటివారు నా జీవితంలో కూడా ఇద్దరు ముగ్గురు తటస్థపడకపోలేదు. అందుకే ఎంత బాధ అయినా గాని ఒంటరితనాన్ని భరించక తప్పటంలేదు" అని తన నిస్సహాయ పరిస్థితిని చెప్పుకుంటుంది మాధురీదేవి.

"నా భార్య స్వభావం అదోరకం. ఎదగని మనసు. స్వార్థం పాలు ఎక్కువ. ఈ సంగతి గ్రహించేటప్పటికే అంతా అయిపోయింది. ఇప్పుడు కేవలం ఆ బంధానికి తలఒగ్గి వుండటం తప్ప ఆనందం అనేది ఏకోశానా లేకుండాపోయింది'' అని తన అశాంతి గురించి వివరిస్తాడు కరుణాకరం.

ఆయా విలక్షణ పాత్రల సమ్మేళనమే

**ఎస్. ఎస్. లక్ష్మి**

**మనోవిశ్లేషణాత్మక రచన!**

# జీవన మథనం

**ఇది 'చతుర' పాఠకులకు అందిస్తున్న 100వ సమగ్ర నవల!**



# ప్రపంచం

## బాకీ తీర్చిన నవల

ఆలివర్ గోల్డ్‌స్మిత్ ఆంగ్ల సాహిత్యంలో ఎంతో కీర్తి ప్రతిష్టలున్న సాహిత్యకారుడే అయినా జీవితంలో ఎక్కువకాలం పేదరికంతోనే బాధపడ్డాడు. ఓసారి ఆలివర్ కట్టవలసిన ఇంటి అద్దె బాకీ పెరిగిపోతే, ఇంటిగలామె విసిగిపోయి, అతను బయటకు తిరగకుండా గదికి తాళంవేసేసింది.

దిక్కుతోచని ఆలివర్ తన గాఢ స్నేహితుడూ, రచయిత అయిన డాక్టర్ జాన్‌సన్‌కి 'ఇబ్బందుల్లో వున్నాను. వెంటనే కలవ'మని కబురుపెట్టాడు. అప్పట్లో జాన్సన్ కూడా ఆర్థిక సమస్యలతో సతమతమవుతుండేవాడు. అందువల్ల అతను మిత్రుడికి ఆర్థిక ఇబ్బంది కలిగివుంటుందని గ్రహించి కబురుతెచ్చిన మనిషికి తన దగ్గిరున్న 2 షిల్లింగులూ

పబ్లిషర్

ఇచ్చి పంపాడు.

తర్వాత జాన్సన్ మిత్రుడిని కలిసేందుకు హడావుడిగా వెళ్ళేటప్పటికి ఆలివర్ ఇంటిదగ్గర ఓ ఆశ్చర్యకరమైన దృశ్యం కంటపడింది. జాన్సన్ ఇచ్చిన డబ్బులు ఖర్చుపెట్టి ఆలివర్ తన ఇంటిగలామెతో కులాసాగా కూర్చుని మద్యం సేవిస్తున్నాడు. జాన్సన్ అతన్ని పక్కకు పిలిచి 'సమస్య' గురించి గుర్తుచేశాడు. ఆలివర్ కళ్లు మిటకరించాడేగాని ఏమీ మాట్లాడలేదు.

జాన్సన్ కాసేపు ఆలోచించి ఆలివర్ గదిలో చెల్లాచెదురుగా పడివున్న నవల వ్రాతప్రతుల్ని దొత్తిగా చేర్చి, వాటిని పట్టుకొని ఓ ప్రచురణ సంస్థకు వెళ్ళాడు. అక్కడి పబ్లిషర్ బేరమాడి నవలపై సర్వహక్కుల్నీ కేవలం 75 పౌండ్లకు కొన్నాడు. జాన్సన్ ఆ మొత్తంతో ఇంటి అద్దె బకాయిలు తీర్చి ఆలివర్‌ని రక్షించాడు.

జాన్సన్ కొద్దిమొత్తానికి అమ్మిన ఆ నవలే 'వికార్ ఆఫ్ ది వేక్ ఫీల్డ్'. అది ప్రచురించబడి ఎంతో ప్రసిద్ధమై ప్రపంచ సాహిత్యంలో అత్యుత్తమమైన రచనలలో ఒకటిగా నిలిచింది. జాన్సన్ ఆ నవలను పబ్లిషర్‌కి ఇవ్వకపోతే అది ఎప్పటికీ వెలుగు చూసేదికాదేమో! ఆ విధంగా ఓ గొప్ప పుస్తకాన్ని పాఠకులకి అందించిన ఘనత జాన్సన్‌కి దక్కింది!

## అభివాదం

భారతీయులలో పరిచయస్థులు, బంధుమిత్రులూ కలుసుకున్నపుడు ముందుగా చేతులుజోడించి లేదా కరచాలనంచేసి, తర్వాతే కుశలప్రశ్నలు, సంభాషణ మొదలు పెడతారు. నమస్కారం భారతీయ సంప్రదాయమైతే కరచాలనం బ్రిటీషువారినుంచి మనకు సంక్రమిం



చింది. బ్రిటీషువారి ఈ సంప్రదాయాన్ని అమెరికన్లు ఎగతాళి చేస్తారుగాని వారికీ ఎక్కువగా కరచాలనమే అలవాటు. వైట్‌హౌస్‌లో జరిగిన ఓ వేడుకలో అప్పటి అమెరికా అధ్యక్షుడు థియోడర్ రూజ్‌వెల్ట్ 8513 మందితో కరచాలనం చేసి ప్రపంచ రికార్డు సృష్టించాడు.

చైనా దేశీయులు కరచాలనం ఇతరులకు ఇబ్బంది కలిగిస్తుందనుకుంటారు. అందువేత అక్కడ ఇద్దరు కలుసుకున్నపుడు ఎవరికివారు తమ చేతుల్ని కలుపుకుని అభివాదం చేస్తారు. తర్వాత "కడుపారా తిన్నారా? జీర్ణశక్తి బాగానే వుందా!" అనే ప్రశ్నలతో సంభాషణ ప్రారంభిస్తారు. అలా ప్రశ్నించడం ఎంతో మర్యాదగా పరిగణిస్తారు.

కోస్టరికా ద్వీపంలో నివసించే లాటిన్ అమెరికన్లకి చెక్కిళ్ళను సుతారంగా స్పృశించి పలకరించటం అలవాటు. న్యూగినియా ద్వీపానికి చెందిన 'పాపువా' గిరిజనజాతిలో మిత్రుడు లేదా బంధువులకు వీడ్కోలు చెప్పవలసి వచ్చినపుడు మొహానికి బురదపూసుకుని బిగ్గరగా ఏడుస్తారు. వారు కనుమరుగు అయ్యేంత దాకా అలా అరుస్తూ,ఏడుస్తూనే వుంటారు. తర్వాత మొహాలు కడిగేసుకుని ఆటా పాటా మొదలుపెడతారు.

ఉత్తరాఫ్రికాలోని కొన్ని ప్రాంతాలలో నివసించే 'మూర్' అనే గిరిజన జాతి ప్రజలుచేసే అభివాదానికి వారి ఆచారాల గురించి ఏమీ తెలియనివారు హడలిపోతారు. 'మూర్' జాతివాళ్లు వేగంగా గుర్రపుస్వారీ చేస్తూ తమకోసం వచ్చేవాళ్ళకు ఎదురువెళతారు. ఆ వ్యక్తి సమీపానికి చేరుకోగానే హఠాత్తుగా గుర్రాన్ని ఆపి, దిగి, పిస్టల్‌తీసి వచ్చిన వారి నెత్తిమీదుగా గాలిలోకి పేలుస్తారు. వారి దృష్టిలో అది మర్యాద తెలుపుకోవడమన్నమాట. మధ్య ఆఫ్రికాకు చెందిన 'గంగ్గా' గిరిజన జాతివాళ్లు అభివాద సూచకంగా ఎడమకాలు ఎత్తుతారు. ఎదుటివాళ్లు ఆ కాలి చివరను తాకడంతో అభివాదం పూర్తవుతుంది.

జపానీయులు అభివాదం చేసేందుకు గౌరవసూచకంగా ముందుకువంగి నిలబడతారు. జపాన్‌లో ఏ సేల్స్‌మన్ అయినా సగటున రోజుకి 125సార్లు ఈ విధంగా అభివాదం చేస్తాడు. మరో తమాషా ఏమిటంటే-- జపానీయులు ఫోన్‌లో మాట్లాడేటపుడు కూడా ఈ విధంగా వంగుతారు. వారు 5 డిగ్రీల కోణంలో వంగటం మన 'గుడ్‌మార్నింగ్' చెప్పడానికి సమానం. 90 డిగ్రీల కోణంలో వంగితే అమిత గౌరవసూచకంగా భావిస్తారు.

అనేకమంది యూరోపియన్లు ముద్దు పెట్టుకుని అభివాదం తెలుపుకుంటారు. ఎదుటివారి సెక్స్, వయసుపై ముద్దిచ్చే చోటు, ఆ ముద్దులోని గాఢత్వం ఆధారపడి వుంటుంది. స్పానిష్‌వాళ్లు పలకరించుకోవడానికి బుగ్గలపై గిల్లుతారు. అందువల్ల బుగ్గలమీద గిల్లినగాట్లువుంటే వాళ్లు స్పెయిన్ దేశీయులుగా ఇట్టే గుర్తించవచ్చు.

## అధికస్య అధికం

అసాధ్యమైన, అనూహ్యమైన కార్యాల్ని సాధించకుండానే అత్యంత ప్రసిద్ధమైన గిన్నెస్ బుక్‌లోకి ఎక్కే అదృష్టాన్ని కొందరికి అస్వాభావికమైన వారి ఆకారమే తెచ్చిపెడుతుంది. ప్రస్తుతం ప్రపంచంలో అత్యంత పొడగరిగా గాబ్రియేల్ మొంజానే పేరు గిన్నెస్ బుక్‌లోకి




ఎక్కింది. ఆఫ్రికాలోని మొజాంబిక్ వాడైన 41 ఏళ్ళ మొంజానే ఎత్తు సెంటీమీటర్లలో 245.7-అంటే 8 అడుగుల 2అంగుళాల పైనే! 190 కిలోల బరువుగల అతను 50 సెంటీమీటర్ల పొడవుండే బూట్లు వేసుకుంటాడు.

మొంజానే 16 ఏళ్ళనుంచీ విపరీతంగా పొడుగు పెరగసాగాడు. ఒక ఏడాదిలో అయితే అతను 20 సెంటీమీటర్లు పొడుగయ్యాడు. ఓసారి మొంజానే టోక్యోలోని హోటల్లో బసచేసినప్పుడు హోటల్ వాళ్లు అతని కోసం ప్రత్యేకంగా 270 సెంటీమీటర్ల పొడుగున్న పడకను రూపొందించారు.



ప్రపంచంలో అతి ఎక్కువ బరువు గలవాడిగా ఆస్ట్రియాకు చెందిన 29 ఏళ్ళ ఆల్బర్ట్ పెర్నిచ్ కొత్తగా గిన్నెస్ బుక్ కి ఎక్కాడు. అతను ఎంత స్థూలకాయుడంటే- అతన్ని ఒకసారి విమానంలోంచి దింపడానికి బరువైన సామాన్ల కోసం వాడే క్రేన్ ను వుపయోగించాల్సి వచ్చింది.

# వయసులేని మనసు

బొంబాయి గ్రాంట్ రోడ్డులో వున్న క్వీన్ మేరీ స్కూల్ లో ఆర్ట్ టీచర్ తెహ్మి మెహతా కరాటేలో 'ఎల్లో బెల్ట్' సాధించడం ఎందరినో సంభ్రమచకితుల్ని చేసింది. దానికి కారణం ఆవిడ 69ఏళ్ళ వృద్ధురాలు కావడం! ఆవిడకు ఆర్ట్ టీచర్ గా మంచి పేరుండటంతో రిటైరవాల్సిన వయసులోకూడా స్కూలువారి అభ్యర్థనపై ఉద్యోగంలో కొనసాగుతోంది. "ఇంత వృద్ధాప్యంలో మీకు కరాటే నేర్చుకోవడంపై ఆసక్తి ఎలా కలిగింది?" అనడిగితే- "నా దృష్టిలో వృద్ధాప్యం అర్థంలేనిమాట. నాకు శారీరక బలం, జీవితంపట్ల ఆసక్తి ఇంకా అలాగే వున్నాయి" అంటుంది తెహ్మి మెహతా.

ఆవిడకు చిన్నప్పటినుంచీ వ్యాయామాలపట్ల ఆసక్తి వుండేది. ఏడేళ్ళ వయసులోనే వివిధరకాల వ్యాయామాలు చేయడం ప్రారంభించింది. కాని, కొన్నేళ్ళ తర్వాత ఇంటిపనులవల్ల కుదరక వ్యాయామం మానుకోవలసి వచ్చింది. దాని ఫలితంగా ఆవిడకు కీళ్ళనొప్పులు ప్రారంభమయాయి. దానికి నివారణ ఏమిటో తెలియకపోవడంతో ఆవిడ 57 ఏళ్లు వచ్చేదాకా ఆ బాధను భరించింది.












# ప్రియమైన పాఠకులకు...

జీవితాన్ని విశాలపరిధిలో ప్రతిఫలింపచేయగల అవకాశం 'నవల'కు ఉన్నంతగా మరే సాహిత్య ప్రక్రియకూ లేదు. అలాంటి 'నవల'కు ఒక ప్రత్యేక వేదికను రూపొందించి పాఠకులకు సన్నిహితంగా, అతి తక్కువ ధరలో తీసుకువెళ్లాలనే ఆలోచనలోంచి ఆవిర్భవించింది 'చతుర'.

పుస్తకరూపంలో కనీసం ఇరవై రూపాయలకు తక్కువలో దొరకని నవలను కేవలం రెండు రూపాయలకే, అది కూడా సచిత్రంగా, సర్వాంగసుందరంగా, తాజా తాజాగా అందజేయటం తన లక్ష్యంగా నిర్దేశించుకుంది 'చతుర'. ప్రచురించిన వారం రోజులలోగా లక్షలాది పాఠకులు తమ నవలలను చదివేసే అవకాశం లభ్యం కావటం ఇటు రచయితలకూ ఒక వరంలాంటిదే!

ఈ ప్రయోగం ఫలవంతమైందనటానికి వెల్లువుకుతున్న ప్రజాదరణే సాక్ష్యం. ఇందుకు ప్రధాన కారణం 'చతుర' తొలినుండి నవలల ఎన్నికలో కొన్ని నిర్దిష్ట సూత్రాలకు, విలువలకు కట్టుబడి ఉండటమే! పాఠకులను



















ఉత్తమాభిరుచుల దిశగా మళ్ళించి, ఆలోచింపజేయగల రచనలను అందించాలనేది తొలినుండి 'చతుర' లక్ష్యం. ఇంతవరకూ వెలువడిన 'చతుర' 100 సంచికలలోనూ ఆ స్థాయిని అందుకున్న నవలలనే ప్రచురించింది 'చతుర'.రచయితల పేరు ప్రఖ్యాతులకన్నా రచనలోని ఔన్నత్యానికే విలువనిచ్చింది 'చతుర'. ఎందరో కొత్త రచయితల తొలి నవలలు సైతం పాఠకుల ఆదరణను పొందటమే ఇందుకు రుజువు.

'శ్రోతలు కోరిన పాటలు'కాక శ్రోతలు వినితీరవలసినవనుకున్న పాటలను వారు వినేలా రూపొందించి వినిపించటం ఉత్తమాదర్శం. అందుకే సమర్థులయిన రచయితలను ఉత్సాహపరిచేందుకు పెద్దయెత్తున నవలల పోటీలనూ ప్రకటించింది 'చతుర'. ఫలితంగా పాఠకులు త్వరలో మరింత ఉత్తమశ్రేణినవలలను చదవనున్నారు. అటు రచయితలకూ, ఇటు పాఠకులకూ 'చతుర' 100వ సంచిక సందర్భంగా కల్పించిన ఒక అపూర్వావకాశం ఇది. దానిని సద్వినియోగం చేసుకోవటం మీ వంతు.

శుభాకాంక్షలతో

మీ

ఎడిటర్





ఓ రోజు, వున్నట్టుండి ఆవిడ వ్యాయామం హఠాత్తుగా మధ్యలో విరమించటం వల్లనే ఈ నొప్పులన్నీ అని గుర్తించింది. దాంతో ఆవిడ తిరిగి వ్యాయామాలు ప్రారంభించడంతో కీళ్ళ నొప్పులు మాయమై శరీరం ఆరోగ్యంగా, దృఢంగా అయింది.

62 ఏళ్ళ వయసులో తెహ్మి మెహతాకి కరాటే నేర్చుకోవాలనే ఆసక్తి కలిగింది. కరాటేను భారతదేశంలో ప్రవేశపెట్టిన వారిలో ఒకరైన విస్పీ కపాడియాను కలిసి తన అభిలాష గురించి చెప్పింది. కపాడియా వెంటనే ఆవిడను విద్యార్థిగా చేర్చుకున్నాడు. అతని వుద్దేశం, రెండు మూడు క్లాసుల తర్వాత ఆవిడకు కరాటేపై విసుగొచ్చి విరమించుకుంటుందని. కాని, తెహ్మి మెహతా ఇంటి పనులు యధావిధిగా చేస్తూనే పట్టుదలగా ఒక్కసారీ మానకుండా కరాటే క్లాసులకి హాజరై ఆ కృషి ఫలితంగా ఎల్లో బెల్ట్‌ను సాధించింది.

కరాటే నేర్చుకున్నాక తనలో భౌతికంగానూ, మానసికంగానూ ఎంతో మార్పు వచ్చిందని, ఆత్మవిశ్వాసం రెట్టింపయిందని చెబుతూ, ఆ విద్య ఓపికగా తనకు నేర్పిన విస్పీ కపాడియాను ఉత్తమగురువు, ఉపదేశకుడు, మనోహరమైన వ్యక్తిగా అభివర్ణిస్తుందావిడ. వృద్ధురాలు కావడంతో తెహ్మి మెహతా కుర్రాళ్ళంత వేగంగా చెప్పింది చేయలేకపోయేదట. అయినా అతను కోపగించుకోకుండా ఆవిడకు ఆత్మవిశ్వాసం పెరిగేట్టు ప్రోత్సాహకరంగా మాట్లాడేవాడట.

ఒకవంక ఉద్యోగ బాధ్యతలు నిర్వహిస్తూనే, నౌకర్లు లేకుండా ఇంటిపనంతా చేస్తూ, ఇంకా తీరిక దొరికితే విద్యార్థులకు పెయింటింగు, చిత్రలేఖనం నేర్పుతుండే తెహ్మి మెహతా, "ఇన్ని పనులు చేయాలంటే, ముందు ఆ వ్యక్తికి సంకల్పబలం కావాలి. ఏదైనా ఓ పని చేయాలని గట్టిగా నిర్ణయించుకుంటే దానికి వృద్ధాప్యం అడ్డంకి కాబోదు. కాని, చాలామందికి పనుల్నించి తప్పించుకోవడానికి వయసు మళ్ళిందనే కారణం సాకుగా దొరుకుతుంది" అంటుంది

## రేసు పావురాలు

పురాతనకాలంలో పెంపుడు పావురాలతో ఉత్తరాల బట్వాడా జరిగేదనే సంగతి అందరికీ తెలిసిందే! క్రీస్తుపూర్వం 43లో వాడుకలోకి వచ్చిన ఆ పావురాల టపా కొన్ని శతాబ్దాలపాటు కొనసాగి, ఆధునిక తపాలా సౌకర్యాన్ని కనిపెట్టాక అంతరించింది. అమితవేగంతో వందలకొలదీ





మైళ్లు ఎగిరే పావురాల సామర్థ్యాన్ని గమనించిన కొందరికి పావురాల రేసులు నిర్వహించే ఆలోచన కలిగింది. ఈ వినోదం గత శతాబ్దాంతానికి ఇంగ్లండ్, బెల్జియంలలో, జనాకర్షణ పెంచుకుని వివిధ దేశాలకు వ్యాపించింది.

పావురాల రేసులు ఎక్కువగా జరిగే బెల్జియంలో ప్రతి గ్రామంలోనూ ఓ పావురాల క్లబ్బు వుంటుంది. పావురాల రేసుల అంతర్జాతీయ సంస్థ ఎఫ్.సి.ఐ. బెల్జియం రాజధాని బ్రస్సెల్స్‌లో వుంది.

అది రెండేళ్ళకోసారి పావురపు రేసుల్లో అంతర్జాతీయ పోటీలు నిర్వహిస్తుంది. అందులో సభ్యత్వంగల ప్రతి దేశం అయిదు మగ, అయిదు ఆడ పావురాలను పోటీకి పంపిస్తుంది. పోటీలో మగ పావురాలకి 1000 కిలోమీటర్లు, ఆడపావురాలకి 750 కిలోమీటర్లు ఎగిరే పందాలు నిర్వహిస్తారు.

మన దేశంలో 1955లో మొట్టమొదటి పావురాల రేసును కలకత్తా రేసుపావురాల క్లబ్బు, బీహారులోని గయ నుంచికలకత్తాకు నిర్వహించింది. 1978లో ఆ క్లబ్బు కలకత్తా రేసు పావురాల అసోసియేషన్‌గా మారింది. అందులో సభ్యులయిన 30 మందిలో సగంమంది చైనీయులే! ఆ సంస్థ ప్రతి ఏటా ఆరు పోటీలను నిర్వహిస్తుంది. సంవత్సరంలోపు వయసు పావురాలకి గయ లేదా హజారీబాగ్‌నుంచి కలకత్తాకు ఎగిరే పోటీ; ఇంకా ఎక్కువ వయసు, అనుభవంగల పావురాలు పాల్గొనేందుకు ఢిల్లీ, మొగల్ సరాయ్, కాన్పూర్‌లనుంచి కలకత్తాకు ఎగిరే పోటీలుంటాయి.

అసోసియేషన్ సభ్యుల్లో ప్రతి ఒక్కరూ పావురాలను పెంచుతారు. వాళ్లు పావురాల్ని 8 రోజుల పిల్లగా వున్నపుడు తమ అసోసియేషన్ కార్యాలయానికి తెస్తారు. అక్కడ పావురం కోడ్ నెంబరు, దాని యజమాని పేరు, పావురం రంగు, అది ఆడా, మగా అనే వివరాలున్న ఉంగరాన్ని పావురం కాలికి పెడతారు. ఆ తర్వాత పావురానికి రేసుల్లో పాల్గొనేందుకు అవసరమైన శిక్షణ ప్రారంభిస్తారు. మొదట ఉదయమే 5 నుంచి 10 నిమిషాలపాటు ఎగిరేలా చేస్తారు. తర్వాతఅదిఎగిరే దూరాన్ని పెంచుకుంటూ వస్తారు. ఆపై అది తిరిగి బయలుదేరిన చోటుకి వచ్చి వాలేట్టు అలవాటు చేస్తారు.

డిసెంబరు, ఫిబ్రవరి నెలల మధ్యలో గాలి అంతగా వీచదుగనుక ఆ కాలం పావురపు రేసులకి అనుగుణంగా వుంటుంది. పోటీ మొదలయ్యే ప్రదేశానికి పావురాలను రైళ్ళలో పంపుతారు. అక్కడి స్టేషన్ మాష్టారు పావురాలను ఏ సమయంలో ఎగరేసిందీ అసోసియేషన్‌కి తెలియపరుస్తాడు. కలకత్తాలోని యజమానుల ఇళ్ళ దగ్గిర రేసులపోటీ జడ్జీలు వేచియుండి, పావురాలు సరిగ్గా ఏ సమయానికి అక్కడకు చేరుకున్నదీ నోట్ చేస్తారు. ఆ విధంగా ఏ పావురం వేగంగా వచ్చిందీ తెలుసుకుని గెలుపు నిర్ణయిస్తారు.

1982లో పోటీలో గెలుపొందిన పావురం కాన్పూరు, కలకత్తాల మధ్యగల వెయ్యి కిలోమీటర్ల దూరాన్ని 11 గంటల్లో చేరుకుంది. మరో పావురం నిమిషానికి 1500 మీటర్ల వేగంతో ఎగిరి, అలహాబాద్ నుంచి కలకత్తాకి అత్యధిక వేగంతో చేరుకుంది. అది భారతదేశంలో ఓ రికార్డు! ★



సూర్యుని వియోగాన్ని భరించలేని పడమటి ఆకాశం బాధతోనేమో ఎర్ర బారింది.

లోయకావలిగా సూర్యబింబం ఎర్రని కాంతిని ప్రసరిస్తూ వెలిగిపోతోంది.

మనోహరమైన ఆ దృశ్యం కళ్ళను చెదరగొడుతోంది.

లోయ పైభాగంలో రాతిపై కూర్చుని ఉన్నాడు రావు. దాదాపు పదిరోజులుగా ఆ సూర్యాస్తమయ దృశ్యాన్ని అలా చూస్తూనే ఉన్నాడు. అయినాగానీ, ప్రతి రోజూ ఏదో చిత్రమైన కొత్త అందం రావు కళ్ళకి కనిపిస్తూనే వుంది.

లోయలోని ప్రతి చెట్టు, ప్రతి రాయి బంగారురంగు కాంతితో వెలిగిపోతోంది.

కొండ వెనుకకు కనుమరుగైన సూర్యుని రూపం ఇప్పుడు సగభాగం మాత్రమే కనిపిస్తూ కొత్త కోణంలో అందాన్ని విరజిమ్ముతోంది. కాంతి క్షీణించేకొద్దీ లోయను చీకటి తెరలు ఆక్రమిస్తున్నాయి.

రావు లేచి నడక సాగించాడు.

తెల్లని లాల్చీ, కాళ్ళకు పల్చని చెప్పులు.

సూర్యాస్తమయ కాంతి నల్లని కను బొమ్మలపై, విశాల ఫాలంపై పడి వొంటి రంగుకి మెరుగులు పెడుతున్నది.

రావు కళ్లు పరిసరాలను తీక్షణంగా గమనిస్తున్నాయ్. లోయ అందాన్ని చూసేకొద్దీ అతని హృదయంలోఅంతులేని శాంతి నిండిపోతున్నది. ప్రకృతిలోని ప్రతి అణువు కూడా రావుని సదా విస్మయంలో ముంచెత్తుతూనేవుంటుంది.

ఘాట్ రోడ్ పై మెల్లగా అడుగులు వేస్తూ పరిసరఅందాన్ని తిలకిస్తున్న రావు చెవులకు ఏదో శబ్దం వినిపించి నట్లయి నడక ఆపి చెవులు రిక్కించాడు.

ప్రతి చేసిన వీణను వేళ్లు సుకుమా రంగా అంటీఅంటనట్లుగా తాకితే వినవచ్చే శబ్దతరంగాల వంటి సవ్వడి ఏదో తన కుడిపక్కగా, బండరాళ్ళకు దిగువగా వినిపించింది. ఆ ధ్వని పసిగట్టిన రావు అంతరంగంలో ఆనందం తుళ్ళిపడింది.

కుడిపక్కగా దిగువకు చెట్లను,రాళ్లను తప్పించుకుంటూ దిగటం ప్రారంభిం చాడు.

కొంతమేర దిగేసరికి కనిపించిన దృశ్యం హృదయాన్ని పులకింపచేసింది.

ఎదురుగా బండరాళ్ళను ఒరుసు కుంటూ గలగలవని పరిగెత్తే సెలయేరు. తెల్లని నురుగులు గక్కుతూ మెలికలు తిరుగుతూ మంచిముత్యాలవంటి నీటి తుంపరలను చిందిస్తూందది.

దాని సమీపంలోకి వెళ్ళాలనే ఉద్దే శంతో వడివడిగా ఎత్తుసుండి నీరు పడుతున్న బండరాయికి సమీపంగా వచ్చాడు. దోసిలినిండా నీరు నింపుకుని ముఖానికి అద్దుకున్నాడు.

ఏదో కీచుమని కేక....

తుళ్ళిపడి పక్కకు తిరిగి చూశాడు.

పక్కనున్న బండరాయిని చాటు చేసుకుని స్నానం చేస్తున్నదొక కోయ జాతి స్త్రీ! నగ్నశరీరం...

నిగనిగ మెరుస్తూ ఆరోగ్యం తొణికిస లాడే అవయవాలు!

నిండైన రూపం.

కళ్ళ ఎదుట కనిపిస్తున్న అందాన్ని తిలకిస్తూ ఒక్కక్షణం అచేతనుడై నిల బడ్డాడు.

సిగ్గు, భయంకలగలిసిన కళ్ళను పెద్దవి చేసి చూస్తున్న ఆ యువతి నోటివెంట ఏదో పదం...తాను ఎన్నడూ వినని




పదం వెలువడటంతో తేరుకుని వెనుదిరిగి గబగబా అడుగులు వేశాడు.

తిరిగి ఘాట్‌రోడ్‌పై నడక సాగించాడు.

ఎవరా స్త్రీ...?

నిజంగా అందమైన రూపం.

ఆమె పాదాల చెంత శిరస్సు వంచి నమస్కరించాలనిపించే అందం. సృష్టికి ప్రతిరూపం.

సౌందర్యానికి నిండైన నిర్వచనం.

ఆ స్త్రీ అందాన్ని మననంచేసుకుంటూ ఆమె రూపాన్ని తన హృదయంలో చిత్రించుకోనారంభించాడు.

అంతలో కొండపైభాగంనుండి రయ్యిమని దూసుకువచ్చి పక్కగా ఆగిందొక జీపు.

"హలో...రావ్! ఇక్కడున్నావా స్వామీ! నీకోసమే వెదుక్కుంటూ వస్తున్నాను" అన్నాడు స్టీరింగు ముందున్న మాధవ్.

ఉలిక్కిపడి పక్కకు తిరిగి చూశాడు రావు.

"ఏమిటలా చూస్తావు? ఈ లోకంలో లేవా ఏమిటి? నీ నడక, వాలకం చూసే అనుకున్నానులే...తమరు ప్రస్తుతం ఈ లోకవాసులు కారని. ఎక్కు ఎక్కు... అక్కడ టీ చల్లారిపోతున్నది''

మిత్రుని మాటలకు జవాబుగా చిరునవ్వు నవ్వి అటు తిరిగి వచ్చి జీపు ఎక్కి మాధవ్ పక్కగా కూర్చున్నాడు రావు.

"ఈవాళ పెందరాళే పనిముగించుకుని వచ్చి చూస్తే బంగళాలో నీవులేవు. అయినా ఈ సుందరసంధ్యా సమయంలో నీవంటి చిత్రకారుడు నాలుగు గోడల మధ్యా కూర్చుంటాడా? నాకలవాటేగా – నిన్ను వెతుక్కుంటూ రావటం" జీపు స్టార్టు చేస్తూ ఆ రొదలో కూడా మాట్లాడేస్తున్నాడు మాధవ్.

బంగళాకు వచ్చేటప్పటికి పనికుర్రాడు టీ, బిస్కట్లు టేబిలుపై సిద్ధం చేస్తున్నాడు.

"త్వరగారా! ఆత్మారాముడిని ఇలా క్షోభపెట్టడం న్యాయంగాలేదు" అంటూ బిస్కట్ల ప్లేటుపై దాడిచేశాడు మాధవ్.

మిత్రులిద్దరి మధ్యా కొంతసేపు మౌనం.

సాలోచనగా బిస్కట్టుముక్క కొరుకుతున్న రావుని చూస్తూ - "అన్నట్టు ఈరోజు ప్రకృతిలో ఏమన్నా కొత్త అందాన్ని పసిగట్టావా? నీ కుంచె రెండు మూడురోజులుగా విశ్రాంతి తీసుకుంటున్నట్టుందే?" అన్నాడు మాధవ్.

రావు తల వూపి ఊరుకున్నాడు.

''అయితే ఇంకేం! ఏ అందం చూసావో ఆ అందాన్ని బొమ్మగీసేయి! నేనెటూ నీలాగా ప్రకృతి ఆరాధకుణ్ని కానుగా. కనీసం ఆ బొమ్మ చూసైనా అందం అంటే ఏమిటో తెలుసుకుని ఆనందిస్తాను"

"నిజమే మాధవ్! నేను చూసింది కొత్త అందం కాదుగాని గొప్ప అందం. కొత్తకాదు అనిఎందుకన్నానంటే సృష్ట్యాది నుంచి స్త్రీ రూపంలో ఏదో ఒక గొప్ప అందం కనిపిస్తూ పురుషుడిని కదిలిస్తూనే ఉంది"

"ఏమిటి! వెరీగుడ్! స్త్రీ అందాన్నే చూశావన్నమాట.ఎవరబ్బా! ఈ కొండల్లో కనిపించిన అంత గొప్ప సౌందర్యమూర్తి మానవాంగనా? లేక కొంపతీసి ఏ వన దేవతన్నా సాక్షాత్కరించిందా?" హాస్యంగా అన్నాడు మాధవ్.

# "రీగల్ ఉంటే కలత లేదిక !"



## "సూపర్ కాంతులు వెదజల్ల నేను సూపర్ పవర్ రీగల్‌నే విశ్వసిస్తాను"



సూపర్ పొంగి
పొరలే నురుగు
సూపర్
ప్రకాశవంతమగు
ఉతుకు !

"ఎందుకంటే సూపర్ పవర్ రీగల్ పొంగి పొరలే నురుగు; బట్టలను గట్టిగా అంటిపెట్టుకొని ఉన్న మురికినికూడా నిర్మూలించి ప్రకాశవంతముగా ఉతక గలదు."

సూపర్ పవర్

# రీగల్

డిటర్జెంట్ సబ్బు




తయారీదార్లు
షా వాలెస్




మాత్రమే !

ACIL/0955/86 Tel

చిరునవ్వు నవ్వి మౌనం వహించాడు రావు.

"అన్నట్టు రేపు మా శ్రీమతి వస్తోం దోయ్! పిల్లలకు శలవలు ఇచ్చేసారు కదా"

"అలాగా. నేనింకా ఇక్కడే ఉంటే మీకేమైనా ఇబ్బంది..."

"నో నో... అదేంలేదు. అరుణకు నీ గురించి రాశాను. నేను డ్యూటీకి వెళ్ళి నప్పుడు నువ్వుంటేనే తనకి కాస్త కాలక్షేపం. లేకుంటే ఒక్కదానికీ ఈ అడవిలో ఏం తోస్తుంది? నువ్వుండి తీరా ల్సిందే... తప్పదు"

కాదనలేక నోరు మెదపలేదు రావు.

రావు, మాధవ్ స్వభావాల్లో భిన్నత్వం ఉన్నా అది వారి స్నేహానికి ఎన్నడూ ఆటంకం కాలేదు.

మాధవ్‌కి రావు అంటే గౌరవంతో కూడిన ఇష్టం.

మాధవ్‌లోని భోళాతనం, నిర్మలత్వం రావుకి ఎంతో ఇష్టం.

అటవీశాఖలో ఉద్యోగం చేస్తున్న మాధవ్ రావుకి కొన్ని రోజులు ఈ ప్రాంతాల్లో తనతో గడపమని జాబు రాయగా మిత్రుని మాట తీసివేయలేక ఇక్కడకు బయలుదేరి వచ్చాడు.

మాధవ్ డ్యూటీకి వెళ్ళగానే గీయాలని పించినపుడు రంగులు కలుపుకుని బొమ్మలు గీయడం, లేకుంటే బంగళా వరండాలో ఈజీ ఛైర్ వేసుకుని తెచ్చు కున్న పుస్తకాలు చదవటం, విసుగనిపిస్తే పుస్తకం మూసి దూరంగా కనిపిస్తున్న కొండల్ని, వాటిమీద గుంపులుగా సాగే మబ్బుల్ని చూస్తూ కూర్చోవటం రావుకి ఇష్టం.

ఇక్కడకు వచ్చినదగ్గర్నుండి ఆలోయ సౌందర్యాన్ని ఎంతగా చూసినా తనివి తీరటంలేదు. ఒక్కొక్క కోణంనుండి ఒక్కొక్క విధంగా దర్శనం ఇస్తున్న ప్రకృతి అందాల్ని భావుకుడైన రావు హృదయం భరించలేకపోతున్నది. కనిపిస్తున్న ఆ అందాల్ని ఎన్ని గంటలు చూసినా చాలటంలేదు. మాధవ్ రాక తిరిగి సాయంకాలం పొద్దుపోయాకే. 12 గంటలకు మాధవ్‌కు క్యారియరు వెళు తుంది. కుర్రాడు రాము తనకొక క్యారియరు తీసుకువచ్చి భోజనం సిద్ధం చేస్తాడు. కొంతసేపు నిద్ర.

తరువాత సంధ్య వాలుతుండగా లోయ లోనికి వాహ్యాళి!

ఇక్కడకు వచ్చినదగ్గర్నుంచీ ఇదీ రావు దినచర్య.

* * *

"పుస్తకం అలా తెరచిపట్టుకుని ఆలో చిస్తున్నారు ఏమిటి?" అరుణ మాటలకు రావు ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చి ఆమె దిస చూశాడు.

అప్పుడే స్నానంచేసి వచ్చిందేమో మంచులో తడిసిన నందివర్ధనం పువ్వులా ఉంది ఆమె రూపం. తెలుపు ఆర్గండీ శారీ, అదే రంగు బ్లౌజు.

"రండి... కూర్చోండి" పక్కగా వున్న ఛైర్ ఆమె ముందుకు నెట్టాడు.

"ఏమిటా పుస్తకం?"

"ఇది సైకాలజీకి సంబంధించిన గ్రంథం. మానవ మనస్తత్వాన్ని అధ్య యనం చేసేకొలదీ చాలా చిత్రంగా అని పిస్తుందండీ?"

"మీరు సైకాలజీ ప్రొఫెసరు కదా! మీరు రోజూ చెప్పే పాఠాలు అవేగా!"

"అవును. నిగూఢమైన మనిషి స్వభా వాన్ని అర్థంచేసుకోవటం ఎంతో కష్టం.

పరిస్థితినిబట్టి మనిషి ఎప్పుడు ఎలా ప్రవర్తిస్తాడో అతనికే తెలియదు"

ట్రేలో రెండు కప్పుల వేడి టీ తీసుకు వచ్చాడు రాము.

కప్పు చేతిలోనికి తీసుకుని ముందుగా రావుకి ఒకటిచ్చి తనొకటి తీసుకుంది అరుణ.

టీ తాగుతూ కొంత సేపు ఇద్దరూ మౌనం వహించారు.

"మనిషికి తన ప్రవర్తన అదుపు చేసుకునే శక్తి లేదంటారా?'' కప్పు కింద పెడుతూ అంది అరుణ.

"ఉంది. కానీ అది అందరి విషయంలో సాధ్యంకాదు. అదుపు చేయగలవారు కూడా ఒక్కొక్కసారి పొరపాట్లు చేయవచ్చు"

"స్వాభావికమైన లోటుపాట్లను సవరించుకునే అవకాశం లేదా?"

"ఉంది. అయితే ముందు తన స్వభావంలో వున్న లోపాలను అంగీకరించే ఉదారత మనిషికి వుండాలికదా! వాటిని గుర్తించి అంగీకరించిన నాడు మనిషి తనను తాను సంస్కరించుకోగలడు."

"వారసత్వంగా సంక్రమించే లక్షణాలను, అలవాట్లనుకూడా మనిషి మార్చుకోగలడంటారా?"

"ప్రయత్నిస్తే మార్చుకోగలడు. బహుశా సాధనద్వారా మనిషికి సాధ్యం కానిదంటూ ఏమీ ఉండదేమో!"

బంగళాముందు పిల్లలు రంగురంగుల బెలూన్లతో ఆడుకుంటున్నారు. రివ్వున వీచిన గాలికి బెలూన్ అందనంత ఎత్తుకు ఎగిరి గాలిలో పల్టీలు కొడుతూ వెళుతోంది.

బెలూన్ కనిపించకుండా పోయేటప్పటికి నిక్కమోహంతో రవి తల్లి దగ్గరకు పరుగెత్తుకు వచ్చాడు.

"మమ్మీ... మమ్మీ! నా బెలూన్..." ఏడుపు కంఠంతో తల్లిని కుదిపేస్తున్నాడు.

"పోనీలే రవీ! మనం ఇంకొక కొత్త బెలూన్ కొనుక్కుందాం'' సముదాయింపు ధోరణిలో అంది అరుణ.

"ఊహూ.. నాకొద్దు, నాకదే కావాలి" మొరాయింపుగా అన్నాడు రవి.

''అదెక్కడ దొరుకుతుంది రవీ! నాన్నగారు రాగానే మనం అంతకంటే పెద్ద బెలూన్ కొనుక్కుందాముగా!"

''మమ్మీ...మమ్మీ!"రివ్వున పరుగెత్తుకొచ్చింది పదమూడు సంవత్సరాల గీత.

''ఏమిటమ్మా, ఏమైంది?" కూతురి హడావుడిచూసి చిరునవ్వుతో అంది అరుణ.

"ఆ చెట్లదగ్గర ఎన్ని సీతాకోక చిలుకలు ఉన్నాయో తెలుసా? అబ్బా... ఎన్ని రంగులో! రా మమ్మీ... చూద్దాం" తల్లి చేతులు పట్టుకుని లాగుతూ అంది గీత.

"అబ్బ! ఉండమ్మా! నేను రానుగానీ, తమ్ముడిని తీసుకునివెళ్ళి చూపించు"

రవి, గీత ఇద్దరూ అటువేపుగా పరుగెత్తుకుని వెళ్ళారు.

అరుణ పిల్లలతో సౌమ్యంగా వ్యవహరించేతీరుకి ముచ్చటపడి చూస్తున్నాడు రావు. పిల్లలు వెళ్ళగానే కొన్నిక్షణాలు నిశ్శబ్దం అలముకుంది.

ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ, "మిమ్మల్ని ఒక ప్రశ్న అడగాలనుకుంటున్నాను. అడగటం అప్రస్తుతమే అయినా కుతూహలం మానవ సహజంకదా! అయినా మీరు అపార్థం చేసుకోరనేనమ్మకంతో.." వినువుగా అంది అరుణ.

కళ్ళెత్తి అరుణ ముఖంలోకి చూశాడు రావు.




సంస్కారం కొట్టొచ్చినట్లు కన్పిస్తోంది ఆ ముఖంలో. వచ్చిన దగ్గర్నుండి ఆమె ప్రవర్తనలో కనిపిస్తున్న సరళతను, గాంభీర్యాన్ని రావు గమనిస్తూనేవున్నాడు.

అరుణతో మాట్లాడుతూవుంటే కాలం ఇట్టే గడిచిపోతూంది. ఆమె రాకపూర్వం మాధవ్ వెళ్ళగానే ఒంటరిగా కాలం గడిపేవాడు.

ఆమెతో ఏ విషయం చర్చించినాగానీ అందులో విజ్ఞానం, ఉల్లాసం సమపాళ్ళలో ఉంటాయి. ఇంత చక్కటి సంస్కారవతిని భార్యగా పొందినందుకు మిత్రుణ్ని మనసులోనే అభినందించాడు రావు.

"ఏదో ఆలోచనలో పడ్డట్టున్నారే? పోనీలెండి మరోసారి అడుగుతాను"

"లేదు లేదు... అడగండి"

"మిమ్మల్ని ఇది రెండసారిచూడటం. మొదట మా వివాహానికి మీరు వచ్చినపుడు చూసాను. పరిచయం పెరిగింది ఈసారే. ఆ పరిచయంతోనే అడుగుతున్నాను ... మన్నించండి. రెండుసార్లు మిమ్మల్ని ఒంటరిగానే చూశాను. మీరు మీ శ్రీమతితో కలసివస్తే బాగుండేదేమో"

చిన్నగా నవ్వాడు రావు. "ఇందులో అపార్థం చేసుకునేదేముంది? మామూలు ప్రశ్నే ఇది. అందరి ఆడవాళ్ళ మాదిరిగానే మీరూ అడిగారు"

ఈ మాటలకు సిగ్గుతో అరుణ ముఖం కొంచెం ఎర్రబడింది.

"చూడండి అరుణా! మీ కుతూహలం నేను అర్థంచేసుకోగలను. ఆమెకు అంటే నా శ్రీమతికి ఇటువంటి ప్రదేశాలకు రావటం ఇష్టముండదు.... అంటే, ఈ కొండలు, లోయలు ఆమె స్వభావానికి సరిపడవు. మీకు తెలుసుకదా... మానవ స్వభావాల్లో ఉండే వైవిధ్యం"

రావు కంఠంలో లీలగా ఏదో నైరాశ్యపు ధ్వని.

చిత్రంగా రావు ముఖంలోకి చూస్తూ కూర్చుంది అరుణ.

అతని మాటలకు ఏమీ బదులు పలకలేకపోయింది. తను వచ్చిందగ్గర్నుండీ గమనిస్తూనే ఉంది. రావులో ఏదో ఉదాసీనత, నిర్లిప్తత నిండుకొని ఉండటం.

అతని మాటలలో ఎంతో సభ్యత ఉట్టిపడుతుంటుంది. ఇక్కడకు వచ్చిన తరువాత అతనుగీసిన ప్రకృతిచిత్రాలను చూస్తుంటే అతను గొప్ప కళాకారుడుగా అనిపించాడు. ఆ బొమ్మలలో అతను వాడిన రంగులు, కొత్త కోణాలనుండి ప్రకృతి అందాలను దర్శింపజేసిన తీరు ఎంతో ఆహ్లాదకరంగా ఉన్నాయి. అతను చదువుతుండే పుస్తకాలను చూసి ఆశ్చర్యపోయింది. అతని ఉన్నతమైన అభిరుచులపట్ల, అతని నడవడిపట్ల తనకు తెలియకుండానే గౌరవం పెరుగుతోంది. భర్తకు రావు అంటే అంత ఇష్టందేనికో తనకు ఇప్పుడిప్పుడే అర్థం అవుతోంది. పిల్లలు ఇద్దరూ గోలగోలగా అరుచుకుంటూ పరుగెత్తుకు వచ్చేసరికి ఇద్దరి ఆలోచనలకు భంగం కలిగింది.

"మమ్మీ...మమ్మీ!కొండపైకి వెళదాం రామమ్మీ!" అరుణ చేతులు పట్టుకు లాగుతూ అంది గీత.

"అలాగే... వెళదాం పదండి" అని రావువంక తిరిగి, "మీరూ బైలుదేరండి. అలా కొండపైకి నడుద్దాం" అంది.

జవాబుగా ఛైర్‌లోంచి లేచి ముందుకి అడుగులువేశాడు రావు. పిల్లలు ఇద్దరూ చెట్టాపట్టాలేసుకుని ముందు



నడుస్తుంటే పెద్దవాళ్ళిద్దరూ వారి వెనుకగా నడవసాగారు.

మెలికలు తిరిగిన ఎత్తైన ఆ ఘాట్ రోడ్ భువినుండి గగనానికి వేయబడ్డ పాలరాతి మార్గంలా ఉంది.

అడుగులు మెల్లగా పడుతున్నాయి.

ఆలోచనలు మనసుని తినేస్తున్నాయి.

ఆ వేసవి సాయంత్రం వీస్తున్నగాలి వారి శరీరాలను చల్లగా స్పృశించి, ఆప్యాయంగా పలుకరించిపోతున్నది.

గిరిజన స్త్రీ పురుషుల జంట ఒకటి తలపై కట్టెలమోపులతో వారికెదురు వచ్చింది.

రకరకాల పూసలతో తయారుచేసిన ఆభరణాలు ధరించిన ఆ స్త్రీ రూపం చూడటానికి ఆసక్తికరంగా ఉంది.

నగ్నంగా వున్న భుజాలు, వీపు ఆ నీరెండలో నిగనిగ మెరిసిపోతున్నాయి. వక్షంపై ఏ ఆచ్ఛాదనలేని ఆమె తలపై బరువు ఎత్తుకుని నడుస్తుంటే ఆ అవయవాలలో ఒక విధమైన లయ, తూగు మిళితమై చూపటానికి కనువిందుగా ఉంది.

నాగరిక ప్రపంచపు కుళ్ళు, కల్మషం సోకని స్వచ్ఛతకు ప్రతిరూపంగా వారి వదనాల్లో ఏదో పవిత్రత, అమాయకత గోచరిస్తున్నాయి.

వారి వంక చూస్తూ ఉండిపోయారు రావు, అరుణ.

చుట్టూవున్న కొండలను పరికిస్తూ నడుస్తున్నాడు రావు. పేర్లు తెలిసినవి,




తెలియనివి, ఎన్నడూ చూడనివి ఎన్నో రకాల వృక్షాలు నిటారుగా నిలబడి వీస్తున్న గాలికి వింత చప్పుడును సృష్టిస్తున్నాయి. నింగినంటటానికై పోటీ పడుతున్నవా అన్నట్లుంది వాటి తీరు. మెడసారించి చూసినా కంటికి అందనంత ఎత్తుకి ఏపుగా ఎదిగిన వృక్షాలు అవి.

వాటి కుడిపక్కగా రోడ్డు మలుపులో ఏటవాలుగా ఉన్న కొండపై నలుగురు గిరిజనులు పారవంటి పనిముట్లతో కొండ అంచుభాగాన్ని సాగుచేస్తున్నారు.

వారిలో ఒక స్త్రీ, పురుషుడు, మిగిలిన వారిద్దరూ పిల్లలు. బహుశా వారిది ఒకే కుటుంబం అయివుండవచ్చు.

తమ వయస్సు పిల్లలు కనపడే సరికి రవి, గీత ఆగిపోయి వారు చేస్తున్న పనిని ఆసక్తిగా తిలకిస్తున్నారు.

వారి శరీరాలపై చిన్న గోచీవంటి

వస్త్రుంతప్ప మరే ఆచ్ఛాదనాలేదు. తీవ్ర మైన ఆ గ్రీష్మతాపానికి వారి శరీరం మరీ నలుపురంగుకి తిరిగి పెట్లిపోయి పొడలు పొడలుగా ఉంది. చేస్తున్న పనివలన వారి శరీరంనుండి చెమట ధారలుగా కారుతోంది. వయస్సు పది - పన్నెండు సంవత్సరాలకన్నా మించి ఉండదు.

"హాయిగా ఏ చీకూచింతా లేకుండా ఆడుతూ పాడుతూ గడపవలసిన ఆ వయస్సులోనే వారు జీవన పోరాటానికి ఆయత్తులయ్యారన్న మాట" అనుకుంది అరుణ.

వయస్సుతో, వంట్లో శక్తితో సంబంధం లేకుండా వారు శ్రమించక తప్పదు. లేకుంటే కాలే కడుపులో కాళ్ళు ముడుచుకు పడుకుని ఆకలి రక్కసికి ఆహుతి కావలసిందే.

ఆ కొండ అంచు సాగుచేసి గింజలు పండించకపోతే వారి కడుపులు నిండవు. కడుపుమంట చల్లార్చుకోవటానికి ఆ కుటుంబమంతా అలా శ్రమపడక తప్పదు.

రవి, గీత వారిని చూస్తూ వారు చేస్తున్న పని గురించి తల్లిని ప్రశ్నలు వేస్తున్నారు. అరుణ వారికి అర్థమయ్యే రీతిలో సమాధానాలు చెబుతోంది.

అక్కడినుండి మెల్లగా నడక సాగించారు.

"వీరు పడుతున్న కష్టాన్ని చూస్తుంటే మనసు ద్రవించిపోతోంది" అరుణ కంఠంలో ఆర్ద్రత.

మందహాసం చేశాడురావు.

"మన దేశంలో వీరి సంఖ్య లెక్కకు మిక్కుటంగానే ఉంది. అయినాగానీ వీరికోసం చేస్తున్నది చాలా తక్కువనే చెప్పాలి"

"శ్రమజీవులను చూసి జాలిపడటం తప్ప వారికోసం మనంగా ఏమీ చేయలేకపోతున్నాము. వీరి జీవన పరిస్థితి ఏనాటికైనా మెరుగుపడుతుందంటారా?"

"అరుణాదేవీ ..." స్ఫుటంగా పలికింది రావు కంఠం. "ఆర్థికంగా లోకంలో ఉన్నవి రెండే వర్గాలు. ఉన్నవారు, లేనివారు. లేనివారి పరిస్థితి మెరుగుపడాలంటే ఉన్నవారిలో స్వార్థబుద్ధి నశించాలి. మనిషి స్వార్థాన్ని జయించటం అంత తేలికైన పనికాదు. స్వార్థపరుడైన వాడు తన బాగే తప్ప ఇతరుల బాగును పట్టించుకోడు. లేనివారు చైతన్యం పొంది స్వార్థపరుల ఆట కట్టించిన ఉదాహరణలు కూడా కొన్ని దేశాల్లో ఉన్నాయి. కాని మన దేశంలో అటువంటి చైతన్యం రావాలంటే చాలా అడ్డంకులు ఉన్నాయి"

"ఏమిటా అడ్డంకులు?"

"మనది తరతరాలుగా ఆధ్యాత్మిక దేశం. కర్మ సిద్ధాంతం మన దేశ ప్రజల హృదయాల్లో వేళ్ళూనుకునిపోయింది. దీనితో లేనివాడు తన లేమికి మూలం ఏమిటో తెలుసుకోవటానికి ప్రయత్నించకుండా 'ఖర్మ' అనీ, తనకు ఇంతే ప్రాప్తం అనీ సరిపెట్టుకుంటున్నాడు. దీనివలన తనకు కలిగే అపార నష్టం అతనికి తెలియదు. దేశ పౌరుడిగా దేశ సంపదలో తనకూ భాగం ఉందనీ, కనీస జీవితావసరాల కోసం తాను జీవిస్తున్న సమాజాన్ని, ప్రభుత్వాన్ని నిలదీసి ప్రశ్నించే హక్కు తనకు ఉందనే విషయం గుర్తించలేకపోతున్నాడు. ఇలా అనేక కారణాలు మన ప్రజల చైతన్యానికి ఆటంకం కలిగిస్తున్నాయి"

"అంటే ఇక్కడ మతం మనిషికి అడ్డుగోడ అయిందంటారా?"

"అవును. మనలో జీర్ణించుకుని




పోయిన మతవాసనలు మన సామాజిక జీవనాన్ని అస్తవ్యస్తం చేశాయి"

"మరి, ఆర్థిక సమానత సాధించిన దేశాల్లో ఈ మతం లేదంటారా?"

"ఉంది. కాని అక్కడ మతం వ్యక్తికే పరిమితం. ఆ పరిధిని మించి సామాజిక జీవనంలో మతజోక్యం లేదు. మనదేశంలో అలాకాక మతం అనేదిమన ఊపిరిలో ఒక భాగం అయిపోయింది"

"ఏదైనా కష్టం ఎదురైనప్పుడు దానిని తట్టుకోలేని మనిషి మానసిక స్వస్థత కోసం తనకు మించిన శక్తిని ఆలంబనంగా చేసుకుంటాడని నా విశ్వాసం. ఏ ఆలంబనా లేకుండా మనిషి జీవించ గలదంటారా?"

"మీరు చెప్పింది నిజమే కావచ్చు. మానసిక ఆలంబన మనిషికి అవసరమే... కాదనను. తనకు అతీతమైన శక్తి ఏదో ఉందని భ్రమపడి నిరాశచెందేకన్నా తనపై తనే విశ్వాసం పెంచుకోవటం అవసరం. బాధకి, కష్టాలకి గల అసలు కారణం అన్వేషిస్తూ వాటిని సాధ్యమైనంతవరకు మానవ ప్రయత్నం ద్వారా మార్చుకుంటూ బతకటంలోనే జీవితానికి అర్థం ఉంది"

"మీరు... నాస్తికులా?"

ఈ ప్రశ్నకు రావు పెదవులపై చిరునవ్వు విరిసింది.

"నేను నాస్తికుడినా, ఆస్తికుడినా అనే దానికి నా దృష్టిలో అంత ప్రాముఖ్యం లేదు. వీటన్నిటికంటే నేను ముందు మనిషిని. తరువాతే ఏమైనా. ఒక మనిషిగా నాలో ఆలోచించే శక్తి, జ్ఞానాన్ని అన్వేషించే తృష్ణ ఉన్నాయి. వీటితోనే నేను ప్రపంచాన్ని, జీవితాన్ని పరిశీలించగలను" ఈ మాటలు రావు కంఠంనుండి సూటిగా, స్పష్టంగా వచ్చాయి.

"అంటే మీపై మీకు విశ్వాసం మెండన్నమాట" చిరునవ్వుతో అంది అరుణ.

"అవును. నాపైనేకాక మానవ మేధస్సుపై అపారమైన విశ్వాసం. మీకు తెలుసు... మనిషి రోజురోజుకి సాధిస్తున శాస్త్రీయ ప్రగతి..." ఇంతలో జీపు హారను వినబడటంతో చటుక్కున వెనక్కి తిరిగిచూశారు, ఇద్దరూ ఒకేసారి.

జీపు ఆపి దిగాడు మాధవ్.

తండ్రిని చూడగానే పిల్లలు ఇద్దరూ సంతోషంతో ముందుకు పరుగెత్తుకు వెళ్ళారు.

"ఏమిటోయ్! ఇంతదూరం వచ్చారు. మాటల్లోపడి ఎంత దూరం వచ్చిందీ కూడా తెలియటం లేదా?" దగ్గరకు వస్తూ అన్నాడు మాధవ్.

"అరె...మీరువచ్చి ఎంతసేపయింది? ఈరోజు త్వరగా వచ్చినట్టున్నారే?" భర్త ముఖంలోకి చూస్తూ అంది అరుణ.

"నేను త్వరగా రాలేదు. పైగా అర గంట లేటుగా కూడా వచ్చాను. మీ ఇద్దరికీ టైము కూడా తెలియటం లేదల్లే ఉంది. పదండి పదండి.... కడుపులో ఆకలి కేకలు వేస్తున్నది"

"మీ మిత్రుడితో మాట్లాడుతూ ఉంటే కాలం తెలియటం లేదు"

"నే చెప్పలా.... రావుతో మాట్లాడు తుంటే గంటలు క్షణాల్లా గడచి పోతా యని. చూశావా! నువ్వు వచ్చేటప్పటికి ఎంత మంచి కంపెనీ ఏర్పాటు చేశానో" గర్వంగా భార్యవైపు చూశాడు మాధవ్.

అందరూ జీపు ఎక్కి బంగళాకు బయలుదేరారు.

**2**

**...జీవితాన్ని అతితేలికగా, హాయిగా గడిపే కిటుకు ఏదో ఆమె ముఖకవళికలలో ద్యోతకమవుతున్నట్లుగా వుంది. మనిషికి ఆలోచనా శక్తి పెరిగేకొలదీ అమాయకంగా ఆనందాన్ని అనుభవించే అవకాశం తగ్గిపోతుందేమో!...**

దట్టమైన కీకారణ్యం...

ఆ అరణ్యంలో... సన్నని కాలిబాట...

మార్గంలో ముళ్ళు...

పొదలు...రాళ్ళు...

వాటిని తప్పించుకుంటూ నడచి వెళుతున్నాడతను. ఏకాకిగా... అనంతమైన ఒంటరితనాన్ని మోస్తూ...

మార్గంలో ముళ్ళు, పొదలు శరీరానికి గాయం చేస్తున్నా... గాయాలనుండి రక్తం స్రవిస్తున్నా నడుస్తూనే ఉన్నాడు. తనకెవరూ లేరు. ఈ జీవనపథంలో తాను ఒంటరివాడు.

తనతోపాటుగా తన పక్కన తన సుఖాన్ని, దుఃఖాన్ని పంచుకొనే వ్యక్తు లెవరూ తన సరసన లేరు...అలా తాను బరువుగా అడుగులు వేస్తూ ముందుకి వెళుతూనే ఉన్నాడు.

చటుక్కున మెలకువ వచ్చింది రావుకి. గదంతా చీకటి. కరెంటు పోయిందేమో–ఫాను తిరగక శరీరమంతా చెమటపట్టి ఉంది.

కొన్ని క్షణాల క్రితపు కలే రావు మనసులో తిరగసాగింది. కలలో అంతర్లీనంగా ఇమిడిపోయిన భావం రావు హృదయాన్ని పట్టి కుదిపివేసింది.





ఏదో సన్నని సెగ ఆతని అంతరాళాలలో నుండి పైకుబికగా కంఠనాళాలు ఒక్కసారిగా భగ్గుమన్నాయి.

ఆతని చుట్టూ...అతని మనసులో ఏదో భరించలేనంత ఒంటరితనం... దిగులు....

గుండెలని పిండే శూన్యం.

ఒక్కసారి తలగట్టిగా విదిలించి, మంచం దిగి తలుపు తెరచుకుని వరండాలోకి ప్రవేశించాడు.

బయట...నింగి నుండి జారుతున్న వెన్నెల మడుగులో తడిసిన ప్రకృతి మత్తుగా, మనోహరంగా ఉంది.

పాల మీగడవంటి ఆ మెత్తని స్వచ్ఛమైన కాంతిలో లోయ వర్ణించనలవిగాని శోభతో వెలిగిపోతూంది.

చిలిపిగాలి అతని లాల్చీలో దూరి శరీరాన్ని అల్లరిగా తడిమితడిమి చూస్తున్నది.

ఆహ్వానిస్తున్నట్లుగా అడవి పూలవాసన ఒక్కసారిగా రావు ముక్కుపుటాలను తాకి మైమరపింపజేసింది.

కళ్ళెదుట కనిపిస్తున్న ఆ అందానికి చలించిన రావు కవిహృదయం పొంగి రెండు కన్నీటి బిందువులు కనుకొలకులలో నిలిచాయి.

'ఆకులో ఆకునై, పూవులో పూవునై, కొమ్మలో కొమ్మనై, నునులేత రెమ్మనై ఈ అడవి దాగిపోనా?'

కవిహృదయం పొంగి పరవళ్ళు తొక్కిన పదసముదాయం. అతనికి తెలియకుండానే ఈ పదాలను గుండె ఉచ్ఛస్థాయిలో పలుకుతోంది.

వేదన చెందిన హృదయం ప్రకృతి అందంలో సాంత్వన పొందుతోంది.

ప్రకృతి సౌందర్యం మనిషి జీవితానికి గొప్ప వరం.

మనిషి హృదయానికి ఎనలేని ఆహ్లాదాన్ని, శాంతిని కలిగించేది ప్రకృతిలోని అందాలు మాత్రమే.

కాలం జరుగుతోంది. మూడున్నర... నాలుగు...నాలుగున్నర...అలా తనను తాను మరచి చూస్తున్నాడు రావు.

ఎదురుగావినీలాకాశంలో వెండిముద్దలా ప్రకాశిస్తున్నాడు చంద్రుడు.

తన్మయతతో చంద్రుడిని చూస్తుంటే మనస్సు అట్టడుగు పొరల్లో చిక్కుకొని పోయిన ఏదో రూపం... మసకమసకగా కళ్ళెదుట నిలుస్తోంది.

తనలో తన ప్రతి అణువులో నిక్షిప్తమై పోయిన ఆ రూపం...తన నుండి బయట పడి...తననుండి వేరై ఆ లోయనూ, నీలాకాశాన్ని, చుట్టూ వున్న కొండల్ని-అన్నింటిని ఆక్రమించి తనను తన అస్తిత్వాన్ని చేతులతో చుట్టి తనలో ఐక్యం చేసుకుంటున్న రూపం...

తన హృదయాంతరాళాన్ని చీల్చుకుని ఏదో ఆక్రందన....

అనాది మానవునిహృదయాక్రందన...

మమతకోసం అల్లాడే మనిషి గుండెలని చీల్చుకొని వెలుపలై ప్రపంచాన్ని ముంచెత్తే ఆక్రందన...

ఈ ఆక్రందన... ఈ పిలుపు.... ఏ హృదయానికి వినిపిస్తుంది?

ఏ హృదయం తనకై కరగి కన్నీరై పిలపిస్తుంది?

రావు కళ్ళలోనుండి వెచ్చని కన్నీటి బొట్లు రాలి అతని హృదయంపై పడి ఇంకిపోయాయి.

బరువైన హస్తం భుజంపై పడటంతో ఉలిక్కిపడి తిరిగి చూశాడు. ఎదురుగా నైట్‌డ్రెస్‌లో మాధవ్.

"ఏం చేస్తున్నావు ఇక్కడ? నిద్ర కూడా మానుకుని ప్రకృతిని ఆస్వాదిస్తున్నావా ఏమిటి?" మాధవ్ కంఠంలో ఆశ్చర్యం.

సమాధానం ఇవ్వకుండా భుజంపై ఉన్న మాధవ్ హస్తాన్ని చేతులలోకి తీసుకుని "పద వెళదాం" అన్నాడు.

లోపల అప్పటికే అరుణ మేల్కొని కాఫీ తయారుచేయడంలో మునిగివుంది.

జంటగా లోపలికి వస్తున్న మిత్రులిద్దరినీ చూసి రెండు కప్పులలో వేడి కాఫీతో వారికెదురు వచ్చింది.

వరండాలో ఉన్న కుర్చీలలో కూర్చుని ముగ్గురూ కాఫీ తాగటానికి ఉపక్రమించారు.

కొంతసేపు ముగ్గురి మధ్యా నిశ్శబ్దం. తెల్లనికాంతి పరిసరాలను తన కౌగిలిలోకి తీసుకొంటోంది.పక్షులు ఆలపించే ఉదయ గానానికి ప్రకృతి ఉలిక్కిపడిలేచి బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటున్నది.

చిరుగాలి సుతారంగా అరుణ ముంగురులను ముద్దిడుకుంటున్నది.

మిత్రుడి వదనంలో నిండిన గాంభీర్యాన్ని గమనిస్తూ-"అరుణా! మీ ఇద్దరికీ ఒక గుడ్‌న్యూస్" అన్నాడు మాధవ్.

"ఏమిటది?"

"ఈరోజు నేను డ్యూటీకి వెళ్ళబోవటంలేదు. శెలవు పెట్టేస్తాను"

"పెట్టి...?"

"ఈరోజు మనమంతా కలసి అలా డామ్ దాకా వెళ్ళి సరదాగా తిరిగి వస్తామన్న మాట'' అన్నాడు మాధవ్.

"ఓకే...మంచి అయిడియా" ఉత్సాహంగా అంది అరుణ.

''నువ్వేమంటావు రావు?"

''నేను ఈరోజు ఊరికి వెళదాం అనుకుంటున్నానే...?" అస్పష్టంగా

ఉంది రావు కంఠం.

"అదేం కుదరదు. తర్వాత వెళ్ళవచ్చు లేవోయ్. శెలవులేకదా ప్రస్తుతం''

''అవునండీ! అందరం కలిసి ఈరోజు సరదాగా తిరిగొద్దాం" ప్రాధేయ పూర్వకంగా అంది అరుణ.

"సరే... అలాగే వెళదాం" వాళ్ళిద్దరి ఉత్సాహాన్ని కాదనలేకపోయాడు రావు.

"గుడ్! త్వరగా రెడీ అవ్వు అరుణా! ముందు పిల్లల్ని లేపి తయారుచెయ్యి'' హడావుడి చేశాడు మాధవ్.

కుర్రాడు రాము, అరుణ పిల్లలిద్దర్నీ పెట్టుకుని వెనుక కూర్చోగా స్టీరింగు సీటులో మాధవ్ పక్కగా కూర్చున్నాడు రావు.

మెలికలు తిరిగిన ఘాట్ రోడ్ పై జీపు పరుగులు పెడుతూంది. రోడ్డుకి అడ్డంగా పరుగులు తీస్తున్న తెల్లని కుందేళ్ళను, గాలిలో పల్టీలు కొడుతున్న రకరకాల పక్షులనుచూసిచప్పట్లుకొడుతూ ఆనందిస్తున్నారు పిల్లలిద్దరూ.

బాగా ఎత్తుకు వెళ్ళాక జీపునొక పక్కగా ఆపి కిందకు దిగాడు మాధవ్. వెంటతెచ్చిన బైనాక్యులర్స్ తో ముందుకు నడచి ఒక రాయిమీద ఎక్కి దాంట్లో నుండి లోయ కింద భాగంలోకి చూస్తూ, పిల్లల్ని దగ్గరకు రమ్మని పిలిచి వారికి చూపిస్తున్నాడు.

అరుణ రావు కూడా వారి చెంతకు వెళ్ళి రాతి మీదుగా తలలు కిందకు వంచి దిగువ భాగాన్ని తిలకించసాగారు.

లోయ కింద భాగంలో తిరుగాడు తున్న గిరిజనులు కదులుతున్న బొమ్మల్లా ఉంటే, వారి ఇళ్ళు బొమ్మరిళ్ళలా కని పిస్తున్నాయి.

తలఎత్తి చూస్తే సూర్యకిరణాలు తీక్షణంగా తాకుతున్నాయి.

రావు ఇంకొంత దూరం పైభాగానికి నడచి ఒక మూలగా ఉన్న విశాలమైన రాయిపై ఏటవాలుగా కూర్చొని కిందకు చూడసాగాడు.

సూర్యుని కాంతి లోయ మూల మూలలని తడిమి బంగారు నగిషీలు చెక్కుతోంది. వెండిమబ్బులు గుంపు లుగా కొండలపై పచార్లు చేస్తున్నాయి.

చెట్ల ఆకుల సందుల నుండి సూర్య కిరణాలు బండ రాళ్ళపైపడి చిట్లి పోతున్నాయి.

"ఇక్కడున్నావా? రా...ఇక బయలు దేరదాం" చేతిలో ఉన్న కెమేరాతో రావుని ఒక స్నాప్ లాగి ముందుకు వచ్చాడు మాధవ్.

"మాధవ్...చూశావా, ఇక్కడ ఎంత ప్రశాంతంగా ఉందో! ఇక్కడినుండి కదలి రావాలనిపించడం లేదు..."

"అవునులే! ఎంతయినా ప్రకృతి ఆరాధకుడివికదా! నావంటివారికే ఈ ప్రదేశం ఎంతో అందంగా కనపడు తున్నది. ఇహ నీవంటి భావుకులకు వేరే చెప్పాలా"

అంతలో అరుణ, పిల్లలు వారిని వెదుక్కుంటూ అక్కడకు వచ్చేశారు.

''అరుణా! రావుకి ఇక్కడినుండి రావాలనిపించటంలేదట. పోనీ వదలి వెళ్ళిపోదామాఏమిటి?" చిలిపిగా అన్నాడు మాధవ్.

"ఆయనకే కాదు... నాకూ ఇక్కడి నుండి రాబుద్ధికావటంలేదు"

''హతోస్మి! అయితే ఇంకేం మీరి క్కడే ప్రకృతిని తన్మయతతో తిలకిస్తూ కూర్చోండి. మేం వెళతాం. రండిరా పిల్లలూ" పిల్లలను చెరొక రెక్కపట్టుకుని





జీపువైపు నడిపించాడు మాధవ్.

"రండి రావుగారూ! మనమూ వెళదాం"

ఇహ లేవక తప్పలేదు రావుకి.

"అన్నట్టు అరుణా! మా ఇద్దరినీ కలిపి ఒక ఫోటో తీయకూడదూ" జీపు దగ్గరగా వచ్చిన అరుణతో అన్నాడు మాధవ్.

"నిక్షేపంగా తియ్యొచ్చు. మరి రావు గారిని రానివ్వండి" మెల్లగా కిందికి దిగి వస్తున్న రావుకి ఎదురువెళ్ళి, "ఆగాగు... మనిద్దరినీ ఈ రాతిపై నిలబెట్టి అరుణ ఫోటో తీస్తుందట" అన్నాడు మాధవ్.

రావు ఆగిపోయి తలెత్తి చూశాడు.

ఎదురుగా అరుణ కెమేరా కంటిదగ్గరగా పెట్టుకుని నిలబడివుంది.

"చూసుకో అరూ! ఇప్పుడు మేమిద్దరం ఒక గొప్ప పోజు ఇవ్వబోతున్నాం. ఫోటో బాగా రాకపోతే ఊరుకునేదిలేదు"

మాధవ్ రావుని రాతిపై కూర్చోబెట్టి వెనుకగా వెళ్ళి మోకాళ్లు వంచికూర్చుని ఆప్యాయంగా రావు భుజం చుట్టూ చేతులు పోనిచ్చి నవ్వుతూ ముఖం భుజంపై ఆనించగా రావు తన ఒళ్లో పడుతున్న మాధవ్ చేతుల్ని తన చేతుల్లో బిగించి కూర్చున్నాడు.

వారిద్దరినీ చూస్తున్న అరుణచిరునవ్వు పెదవులపై తొణికిసలాడుతుండగా స్నాప్ లాగింది.

ఈసారి రావు కెమేరా తీసుకుని అదే రాతిపై భార్యాభర్తలిద్దరినీ నుంచోమన్నాడు.

"అరూ! ఈసారి నువ్వు కూర్చో. నేను నీ భుజాలపై..."

అరుణ కళ్ళెర్ర చేసి చూడటంతో ఆగిపోయాడు మాధవ్.

"పిచ్చి వేషాలెయ్యక వచ్చి పక్కన నిల్చోండి" పెదవులు బిగించి ఆజ్ఞాపించింది అరుణ.

"అదేమిటోయ్! మరీ వృద్ధ దంపతుల్లా పక్కపక్కగా నిలబడటం నాకేం నచ్చలేదు" గారంగా అన్నాడు మాధవ్.

మాధవ్ అల్లరికి నవ్వుకుంటూ, "మాధవ్! నీవు ఇంకొంచెం వెనక్కు వెళ్లు. అరుణా...మీరు కొంచెం ముందుకు రండి. ఇద్దరూ కలిసి రాతిమీద నుండి దిగుతున్నట్లుగా తీస్తాను" అన్నాడు రావు.

"ఓకే... గుడ్ అయిడియా" వెనక్కి వెళ్ళి నిలబడ్డాడు మాధవ్.

కెమేరా క్లిక్ మంది.

తిరిగి అందరూ కలిసి జీపు ఎక్కి బయలుదేరారు.

రోడ్డు దిగువలో ఒక చిన్న ఊరు వంటిది పది-పన్నెండు తాటాకు గుడిసెలతో ఉంది. లోయ పైకి వెళ్ళటానికీ, కిందికి దిగిరావటానికీ బస్సులు తిరుగుతుంటాయి. అక్కడ రాబోయే బస్సు కోసం ఎదురుచూస్తూ కొద్దిమంది ప్రయాణీకులు నిలబడి ఉన్నారు. రోడ్డుకి ఒకపక్కగా కొంతమంది గిరిజన స్త్రీ పురుషులు ఘుమఘుమలాడేపనసకాయల్ని అమ్ముతున్నారు.

పనసకాయలు చూడగానే జీపు స్లోచేసి అక్కడ ఆపాడు మాధవ్.

మాధవ్‌తోపాటుగా పిల్లలూ, రూప కూడా జీపు దిగారు.

రావు చేతులు కట్టుకొని గిరిజనుల ఇళ్ళను, వారి జీవన విధానాన్ని ఆసక్తిగా గమనిస్తున్నాడు.

హఠాత్తుగా రావు దృష్టి ఒకపక్కగా ఉన్న గుడిసె ముందున్న గిరిజన



యువతిపై పడింది.

ఒంటిమీద ఎటువంటి ఆచ్ఛాదనలే రెండు సంవత్సరాల పిల్లవాడితో యువతి ఆడుకుంటోంది.

ఆ పిల్లవాడితోపాటుగా తనూ కేరింతలు కొడుతున్నది.

ఆ యువతి కదలికలకు అర్ధనగ్నంగా ఉన్న ఆమె శరీరంలోని ఒంపులు అందంగా తొంగిచూస్తున్నాయి.

ఆమె వదనంలో బతుకు బరువు తాలూకు ఛాయలు కానీ, జీవితంపట్ల అసంతృప్తి కానీ ఏమీ కనిపించక ఆనందంతో మెరిసిపోతున్నది.

ఆమె ముఖంలో కనిపిస్తున్న ఆనందాన్ని, ఆమె ఒంపుసొంపుల వయ్యా-రాన్ని రెప్పవేయక చూస్తున్నాడు రావు.

జీవితాన్ని అతి తేలికగా, హాయిగా గడిపే కిటుకు ఏదో ఆమె ముఖకవళికలలో ద్యోతకమవుతున్నట్లుగా ఉంది.

మనిషికి సహజమైన ఆలోచనాశక్తి పెరిగేకొలదీ ఆమె అంత అమాయకంగా ఆనందాన్ని అనుభవించే అవకాశం తగ్గిపోతుందేమో.

జీవితాన్ని ప్రతి అంగుళం శోధిస్తూ బతికేవారికి చివరికి మిగిలేదేమిటి?

ఆలోచనా, అభిరుచీ పెరిగే కొలదీ అసంతృప్తి పెరుగుతున్నదే తప్ప ఆనందం లభించటం లేదే!



జీవితంలో ఎదురయ్యే ప్రతిసంఘటనకు చలించే మనసుండటం కూడా అశాంతికి మూలమా?

పోనీ మిగిలినవాటిని వదలి తన ఆనందం ఒక్కటే చూసుకుని బతికే స్వార్థాన్ని మనసు అంగీకరించదే!

మరి ఎలా...?

రావు చూపులను గమనించిన ఆ యువతి సిగ్గుపడి ఆటలు మాని మౌనంగా పిల్లవాడినెత్తుకుని నిలబడిపోయింది.

ఆ యువతి కళ్ళలోకి పలకరింపుగా చూసి మెల్లగా కదలివచ్చి జీపు ఎక్కాడు రావు.

జీపు మలుపు తిరుగుతుండగా పక్కకు చూశాడు. పిల్లవాడినెత్తుకున్న ఆ యువతి అక్కడే నిలబడి రావు వేపే చూస్తున్నది.

రావు కళ్ళు ఆమె హృదయానికి ఏం భావాన్ని అందించినవోగాని దూరం అవుతున్న ఆమె కనుపాపలలో ఏదో ఆత్మీయత, దాని వెనుకగా లీలగా ఏదో బాధ సూటిగా రావు హృదయాన్ని తాకినాయి.

బహుశా సృష్టిలోగల చిత్రం ఇదేనేమో! స్త్రీ పురుషులనే భిన్నప్రాణుల మధ్య ఏర్పడే అనాది ఆకర్షణ...తద్వారా జనించే అనుబంధం.

ఒక్క రెండు నిముషాల కాలంలోనే తనలో రేగిన ఈ భావసంచయానికి నవ్వుకున్నాడు రావు.

క్రమంగా ఆ పరిసరాలు దూరమై కనుమరుగైపోయాయి.

"నేను ఈరోజు బయలుదేరతాను" మెల్లగా తన నిర్ణయాన్ని తెలిపాడు రావు-ఇంటికి చేరిన తర్వాత.

కాఫీ తాగుతున్న మాధవ్ దంపతులు ఏమీ మాట్లాడలేదు. రావుని ఇంకా ఆపటం భావ్యం కాదనే ఉద్దేశంతో ఉన్నారు వారు.

"మీ దంపతుల ఆదరణకు చాలా థాంక్స్"

"చాల్లేవోయ్! మనమధ్య కూడా ఈ ఫార్మాలిటీస్ ఏమీ బాగాలేదు" నొచ్చుకున్నాడు మాధవ్.

మెల్లగా లోపలికివెళ్ళి తనుగీచిన చిత్రపటాన్ని పట్టుకొచ్చాడు రావు.

"మనం కలిసిగడిపిన ఈ ప్రదేశానికి గుర్తుగా ఇది మీ దంపతులకు..." అరుణకు అందిస్తూ అన్నాడు.

"నా డ్యూటీ కూడాఅయిపోవచ్చింది. రేపో, ఎల్లుండో మేముకూడా ఇక్కడ నుండి మకాం ఎత్తేస్తాం"

"ఈసారి మా ఊరు రావాలి మీరు" అర్థింపుగా అంది అరుణ.

"అలాగే. తప్పకుండా వస్తాను. మరి నేను బయలుదేరనా?"

దంపతులు ఇద్దరిదగ్గరా శెలవుతీసుకుని జీపు ఎక్కాడు రావు.

దూరం అవుతున్న రావుకి చేతులెత్తి వీడ్కోలు చెబుతుండగా రావు ప్రయాణించే జీపు కనుమరుగై ఆ లోయలో అంతర్ధానమైంది.

* * *

"మధూ!"

ఉలిక్కిపడి వెనక్కుతిరిగాడు మధు.

"ఏంచేస్తున్నావిక్కడ?"

"చదువుకుంటున్నాను నాన్నగారూ"

"ఏం చదువుతున్నావు?"

"షేక్స్పియర్ 'హామ్లెట్'"

కొడుకు ముఖంలోకి చూస్తున్న రావు కళ్ళల్లో కించిత్ గర్వం తొంగిచూసింది.

"మీరు వచ్చి ఎంతసేపయింది నాన్నగారూ!" తండ్రి ఊరునుండి వచ్చే టప్పటికి తను కింద లేకపోయినందుకు నొచ్చుకుంటూ అన్నాడు మధు.

"ఇప్పుడే వచ్చాను. మీ అమ్మ ఎక్కడ?" సమాధానం తెలిసే ప్రశ్నించాడు రావు.

"అమ్మ క్లబ్‌కెళ్ళినట్టుంది..."

"ఆంగ్ల సాహిత్యంతో పాటుగా తెలుగుసాహిత్యం కూడా చదవాలి మధూ! అప్పుడే మన సంస్కృతికి, వారి సంస్కృతికి మధ్యగల వైవిధ్యం తెలుస్తుంది'' అక్కడే ఉన్న ఛైర్‌లో కూర్చుంటూ అన్నాడు రావు.

"నాన్నగారూ....'' సందిగ్ధంగా ఆగాడు మధు.

''ఏమిటి? అడుగు మధూ! సందేహం ఎందుకు?''

''మన ప్రాచీన, ఆధునిక సాహిత్యాల్లో ఏది గొప్పది?"

''ఈ రెంటిలో ఏది గొప్పది అనే ప్రశ్న అనవసరం. దేని విలువ దానికుంటుంది. నా అభిప్రాయమైతే ప్రాచీన సాహితీపరులకంటే ఆధునిక సాహితీపరుల రచనలలోనే వాస్తవిక జీవనం ఇమిడివుంది. మానవ జీవితానికి ఉపకరించే విలువలను వీరే నిష్కర్షగా ఎత్తిచూపారు. ప్రాచీనులకు ఆధునికులకు మధ్యగల ఈ తేడాకు కారణం లేకపోలేదు''

''ఏమిటా కారణం?''





"ఆంగ్ల సాహిత్యప్రభావం వలన మన ఆధునిక సాహితీ పరుల ఆలోచనా విధానంలో మౌలికమైన మార్పువచ్చింది. ఈ మార్పే వారికి జీవితంపట్ల కొత్త దృష్టిని కలిగించింది...''

ఇంకా చెప్పబోయి ఆగాడు రావు. పదిహేడు సంవత్సరాలన్నా నిండని తన కొడుక్కి తను చెప్పే విషయాలు అర్థం కావద్దూ.

కొడుకు ముఖంలోకి పరిశీలనగా చూశాడు. ఆ ముఖంలో తెలియనిదాన్ని తెలుసుకోవాలనే ఉత్సుకతతో పాటు పట్టుదలకూడా ప్రకాశిస్తున్నది.

''మధూ! ఈ విషయాలన్నీ తెలియాలంటే నీవు చాలా పుస్తకాలు చదవాల్సి ఉంది. అదీగాక జీవితం అంటే ఏమిటో అర్థం చేసుకునే వయస్సు నీకు లేదు. జీవితం గురించి పుస్తకాలలో చదివిన దానికంటే అనుభవంలోకి వచ్చినపుడే దాని లోతులు బాగా తెలుస్తాయి. ప్రస్తుతం నీవు చేయవలసింది ఇప్పుడు ఉన్న ఈ ఆసక్తిని ఇలాగే పెంచుకోవటం. ఈ ఆసక్తే నీకు అనేక విషయాలను నేర్పుతుంది''

"మీ పుస్తకాలను చూస్తుంటే అవన్నీ ఎప్పుడెప్పుడు చదువుతానా అని ఆత్రుతగా ఉంది నాన్నగారూ!"

కొడుకు మాటలకు చిన్నగా నవ్వాడు

ఇంతలో కిందనుండి కాచు శబ్దం వినిపించడంతో ఆ వచ్చింది ఎవరో ఇద్దరికీ అర్థంఅయి మౌనం వహించారు.

తిన్నగా మెట్లు ఎక్కి పైకి వచ్చింది ఇందిర.

"హలో...మీరు వచ్చేసారే! ఎప్పుడు వచ్చారేమిటి?" హడావుడిగా భర్తను పలకరించి సరాసరి తన రూమ్‌లోకి వెళ్ళిందామె.

రావు సమాధానం ఇవ్వకుండా టీపాయ్‌పై ఉన్న పత్రికని చేతుల్లోకి తీసుకున్నాడు.

"మధూ! కాలేజీకి వెళ్ళలేదా?" బట్టలు మార్చుకుని బయటకు వస్తూ అడిగింది ఇందిర.

"ఈరోజు కాలేజీ లేదు... ఆదివారం గదా"

"అవును కదూ, మర్చేపోయాను. అబ్బబ్బ! ఒకటే హడావుడి. ఈ కాన్ఫరెన్సు కోసం నాలుగు రోజులుగా ప్రయత్నం చేస్తున్నా తెమిలితేనా! కలెక్టరుగారి అధ్యక్షతన జరిపించాము. మీటింగ్స్ ఎంత బాగా జరిగినాయని. పుర ప్రముఖులందరినీ ఆహ్వానించాము. వారంతా వచ్చారు. స్త్రీ సంక్షేమంకోసం మా క్లబ్ చేస్తున్న కృషికి అందరూ ఎంతో ఆనందించారు" అడక్కుండానే ఏకరువు పెట్టేస్తోంది ఇందిర.

శ్రోతలిద్దరూ మౌనంగా వింటూ కూర్చుండిపోయారు.

"అన్నట్టు మీరిద్దరూ ఏదో చర్చలో ఉన్నట్టున్నారు. ఎందుకొచ్చిన చర్చలివి? అచ్చు మీ కొడుకు కూడా మీలాగే తయారవుతున్నాడు. ఏం మధూ! క్లాసు పుస్తకాలు చదువుకోకుండా ఏమిటా పిచ్చి పుస్తకాలు చదవటం? నీ టైము వేస్టవటం లేదూ?" కొంచెం తీవ్రంగా అంది ఇందిర.

మధు మాట్లాడలేదు. తండ్రి దెస ఒకసారి చూసి తలవంచుకుని కూర్చున్నాడు.

కొన్ని క్షణాల నిశ్శబ్దం.

ఒక్కసారిగా ఆవలించి "నేను చాలా అలసిపోయాను. రెస్ట్‌తీసుకుంటాను. నన్నెవరూ డిస్టర్బ్ చేయకండి" అంటూ

నిష్క్రమించిందామె.

తండ్రీ కొడుకులిద్దరూ తప్పుచేసినట్లుగా ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. "నేను కూడా రెస్టు తీసుకుంటాను. నీవు చదువుకో మధూ! మీ అమ్మ మాటల కేంలే" అంటూ రావు కూడా అక్కడ నుండి కదిలాడు.

వెళుతున్న తండ్రివైపు ఒకసారిచూసి పుస్తకం తెరిచాడు మధు.

**3**

...స్త్రీ పురుషుల మధ్య ఆకర్షణ అతి సహజమైన విషయం. బాహ్యమైన వేష భాషలతో వారిరువురూ ఆకర్షింపబడటం అనేది అంత ఆరోగ్యకరమైన పరిణామం కాదు. స్త్రీ పురుషుల మధ్య పెరగవలసినది ఆకర్షణ కంటే ముందు అవగాహన...

ఒకటి...రెండు...మూడు...నాలుగు... అప్రయత్నంగా పుస్తకంలోని పేజీలు తిరిగి పోతున్నాయి. కళ్ళు అక్షరాల వెంట పరుగులు పెడుతున్నాయే తప్ప మనసు మాత్రం ఆ అక్షరాలలోని అర్థాన్ని గ్రహించడానికి సహకరించటం లేదు.

ఎంత ప్రయత్నించినాగాని మనసుదే పైచేయి అవటంతో లాభంలేదనుకుని పుస్తకం మూసి లేచాడు రావు.

గది అంతా పల్చని లేతకాంతిని చిమ్ముతూ బెడ్‌లైటు వెలుగుతోంది. మంచం దగ్గరగా నడచి నిద్రిస్తున్న భార్య ముఖంలోకిచూస్తూ నిలబడ్డాడు.

ఆముఖంలో ఏదో అసహనం, అర్థం లేని అహంభావపు ఛాయలు కనిపించి రావు మనసుని కలుక్కుమనిపించాయి. అంత నిద్రావస్థలో కూడా ఆమె స్వాభావికపు ఛాయలు ఆ ముఖంలో ప్రతిఫలిస్తూనే వున్నాయి.

ఆమె రూపురేఖలలో అందం, ఆకర్షణ కొట్టొచ్చినట్లు కనిపిస్తూనేవున్నా అవి రావు మనసుకి ఆనందం కలిగించలేక పోతున్నాయి. ఆమె వదనంలోనే కాక ఆమెవద్ద కూడా సౌమ్యత, ప్రశాంతత కొరవడినట్లు అతనిమనస్సుకి తోస్తున్నది. నిద్రించే స్త్రీ సౌందర్యం పురుషుణ్ణి రెచ్చగొడుతుందంటారు.

కాని...కాని తనలో...తన నరనరాల్లో నిండుకున్న ఏదో నిస్సత్తువ....మనస్సు, శరీరం రెండూ కూడా ఏ కదలికలేక ఒక దానితో ఒకటి పోటీపడి నిరామయస్థితిని పొందుతున్నాయి .. ఒక్కసారి దీర్ఘ నిశ్వాసం విడచి గది తలుపు తెరచుకుని డాబా పిట్టగోడదగ్గర కుర్చీలో చతికిల పడ్డాడు.

చల్లని వెన్నెల కురుస్తున్న రావు మానసంపై మంచిగంధం చిలకరిస్తున్నది. ప్రశాంతంగావున్న ఆకాశంలో నిశ్చలంగా వెలుగుతున్న చంద్రుడు...కిందగార్డెన్‌లో నుండి పిల్లగాలులు మోసుకొస్తున్న మరు మల్లెల మకరందం అతని నాసికా పుటాల నుండి గుండె మారుమూలల్లో జొరబడి అణచిపెట్టబడిన రసోద్రేకాన్ని రగిలిస్తోంది. రక్తంలో ఏదో వేడి, ఉరవడి. అతని మస్తిష్కంలో అలజడి... కుర్చీలో వెనక్కువాలి ఏకాగ్రదృష్టితో చంద్రుణ్ణి చూస్తూ కూర్చున్నాడు.

క్రమంగా పరిసరాలతో ప్రేరేపింపబడిన మనస్సు, శరీరంనెమ్మదిగా ప్రశాంతస్థితిని పొందాయి. అతనిని మొదలంటా ఊపిన భావోద్రేకానికి ఫలితంగా కళ్ళ వెంట రెండు వెచ్చటి కన్నీటి బిందువులు రాలి చెంపలపైకి జారాయి.




సృష్టిధర్మం ఎంత విచిత్రమైంది...?

ప్రతి ప్రాణిలో ఈ కోరిక.... నరాలను గుంజి రక్తాన్ని మండించేకోరిక....కడుపు నింపుకోవటం ఒక్కటేకాక శరీరాన్ని, మనసుని ప్రేరేపించే ఈ ఆకలి... అనాదిగా ఈ మానవ ప్రపంచంలోని సామాన్యులను అసమాన్యులను కూడా వ్యథపెడుతూనే ఉంది. దీనిని అధిగమించినవారు మహానుభావులైతే అందుబాటులో లేనివారు ఆరని అసంతృప్తి జ్వాలల్లో మండిపోయారు. కేవలం నరాల సంతృప్తే దీని ధ్యేయమా? కాదు...కానే కాదు...శరీరం సాధనం మాత్రమే.

అంతకంటే ముఖ్యం మనసుకి కలిగే ఆనందం. రెండు మనసుల సంగమమే రెండు శరీరాలను ఐక్యం చేయగలుగుతుంది. ఆ ఐక్యతే సృష్టిరహస్యాన్ని రమ్యంగా విప్పి చూపుతుంది. అదే...అదే నిజమైన ఆనందం..

ఓహ్...ఏమిటీ ఆలోచనలు?

కుర్చీలోనుండి లేచి పచార్లు చేయటం ప్రారంభించాడు.

ఆకాశంలోని నక్షత్రాలు మరింత కాంతిని సంతరించుకొని మెరిసిపోతున్నాయి.

తను .... తనవంటివాడికి మనసు ప్రేరేపిస్తేతప్ప శరీరం పనిచేయని తనకి ఆ ఆనందం లభ్యమయ్యే అవకాశం ఏది? తాను ఆశించినరీతిలో లభిస్తేతప్ప తాను దాన్ని పొందలేడు. ఒకవేళ పొందినా యాంత్రికంగా తప్ప తాను ఆశించిన స్థాయిలో అనుభవంలోకి తీసుకోలేడు. తనలో నిరంతరం ఏదో అసంతృప్తి... ఎంత ప్రయత్నించినాసమయంచూసుకుని తనని కోతపెడుతూనే ఉంది. లేదు... లేదు...ఈ అసంతృప్తికి తాను లోనవకూడదు. దీనిని పెరగనిస్తే తనని, తన వివేకాన్ని క్రమంగా కాల్చివేయదా...!

నిశ్చలంగా రెండు నిముషాలు ఏ ఆలోచనా లేకుండా శూన్యంలోకి చూస్తూ నిలబడ్డాడు. పక్కకు తిరిగి తన రీడింగు రూముకి వెళ్ళి రంగులు కలపటం ప్రారంభించాడు.

* * *

"మధూ..."

తండ్రి కంఠస్వరానికి ఉలిక్కిపడి సర్దుకు కూచున్నాడు మధు.

"ఏమిటి ఆలోచిస్తున్నావు?"

"ఏంలేదు నాన్నగారూ"

ఒంటరిగా కూర్చుని ఆలోచనలో మునిగివున్న కొడుకుకు దగ్గరగా కుర్చీ జరుపుకుని కూర్చున్నాడు.

"చెప్పు మధూ! ఏమిటలావున్నావు?"

"క్లాసులో కుర్రవాళ్ళతో నేను ఎందుకనో ఇమడలేకపోతున్నాను నాన్నగారూ" మెల్లగా గొణిగాడు మధు.

"ఎందుకని?"

"వారంతా ఎప్పుడూ కేరింతలు కొడుతూ తేలికగా కాలం గడిపేస్తుంటారు. వారి చేష్టలు, మాటలు ఎందుకనో నాకు నచ్చటం లేదు. వారి ప్రవర్తన నన్ను బాధిస్తుండటంతో నేను వారిలో ఒకడిగా కలవలేక ఒంటరిగా మిగిలిపోతున్నాను"

కొడుకుని వేధిస్తున్న ఒంటరితనం రావుకి అర్థం అయింది.

"చూడుమధూ! మీక్లాసు కుర్రవాళ్ళూ, నీవూ ఇప్పుడిప్పుడే ప్రపంచాన్ని చూస్తున్నవారు. ఈ ప్రపంచం మీకళ్ళకు ఎంతో అందంగా కనిపించడం మీ వయస్సుకి సహజం. జీవితమనే మహాప్రస్థానంలోకి మొదటి అడుగు వేసిన

వారు మీరంతా. ఒక్కొక్క అడుగువేసే కొలదీ మార్గంలో కల మిట్టపల్లాలు, కరకు రాళ్లు కాలికి తగులుతూ అనుభవం అనే పాఠాన్ని మీకు తెలియచెబుతుంటాయి. ఆ అనుభవ సారాంశమే మిమ్మల్ని జీవిత రథసారథులుగా తీర్చిదిద్దుతుంది. సారథి తెలివిని, నేర్పునిబట్టి రథం గమ్యం చేర గలుగుతుంది"

"కానీ నాన్నగారూ....!"

"మనుషులంతా ఒకేలా ఉండాలనుకోవటం అసహజమైన విషయం మధూ!"

"అదికాదు నాన్నగారూ"

"నీవు చెప్పబోయేది నాకర్థం అయింది. మనుషుల స్వభావాల్లో అంతులేని భిన్నత్వముంటుంది. ఎవరి స్వభావాన్ని బట్టి వారు తమ అభిరుచుల్ని ఏర్పాటు చేసుకుంటారు. వారిని మనం తప్పుపట్టటం సమంజసమేనంటావా?"

"కాని కాలాన్ని అలా దుర్వినియోగం చేయటం సమంజసమంటారా?"

"అదీ అసలు. కానీ తరానికి తరానికీ మధ్య పూడ్చలేని అంతరం పెరుగుతుంది. దీనికి కారణం మన సామాజిక పరిస్థితులు. తాను జీవిస్తున్న పరిసర ప్రభావంనుండి ఏ మనిషైనా తప్పించుకోవటం అసాధ్యం"

చెప్పటం ఆపి కొడుకు దెస చూశాడు. ఇంకా ఏవో ఆలోచన ఆ ముఖంలో అస్పష్టంగా కన్పిస్తోంది.

తన బాధనంతటినీ కొడుకు బయట పడేయకపోతే ఇది అనారోగ్య పరిస్థితికి దారి తీస్తుందనిపించింది రాఘవకి.

"నీ వయస్సు కుర్రవాళ్ళ ప్రవర్తన గమనించి మెలకువతో ఉండటం నేర్చుకో మధూ! వారికి, నీకు స్వాభావికమైన భేదా ఉన్నాగాని వారితో నీవు స్నేహంగా ఉంటే ఏమిటి నష్టం? మన హద్దుల్లో మనం ఉంటూనే వారిని కూడా కలుపుకు రావాలి. మన మనస్సుకి అనుగుణంగా లేరని వ్యక్తుల్ని వదులుకుంటూపోతే చివరికి నీవు ఏకాకిగా మిగిలే ప్రమాదం ఉంది. అటువంటి పరిస్థితి రానీయకు"

అర్థం అయినట్లుగా తల ఊపాడు మధు.

కిందహాల్లో పనివాళ్ళను కేకలువేస్తున్న ఇందిర కంఠం ఖంగున మోగుతోంది.

"చూశారా వాడి పొగరు! పన్నెండు గంటలకు కారు క్లబ్‌దగ్గరకు తీసుకు రమ్మన్నాను. అరగంట వెయిట్ చేసినా పీడు అయిపులేడు. పాపం! మిసెస్ సుధాకర్ కారులో దింపివెళ్ళారు. లేకుంటే ఏమయ్యేదానిని?'' మెట్లెక్కి వస్తూ ఫిర్యాదు చేస్తున్నట్టుగా అంది ఇందిర.

సాధారణంగా ఇందిర భర్తతో మాట్లాడే మాటలు అవే...లేరూ అంతే! ఆమెకు తీరుబడే తక్కువ. ఒకవేళ తీరికగా మాట్లాడినా ఊళ్ళో ప్రముఖుల భార్యలు ఎవరు ఎంత ఖరీదైన నగలు పెట్టుకున్నారో, ఎటువంటి చీరలు కట్టుకున్నారో తప్ప ఆమెకు భర్తతో మాట్లాడే విషయాలంటూ వేరేవమీ వుండవు. వాళ్ళ క్లబ్ ఫంక్షన్స్ ఎంత ఆర్భాటంగా జరిగాయో, క్లబ్ ప్రెసిడెంటుగా వారంతా తనను ఎంత మెచ్చుకున్నారో ఎంతో ఉత్సాహంతో ఏకరువు పెడుతూంటుంది ఆమె.

రాఘవ మౌనంగా విని ఊరుకోవటం తప్ప మరేం మాట్లాడడు. అసలు ఆ సమయంలో ఏం మాట్లాడాలో కూడా రాఘవకు తోచదు. ఇందిర స్వభావం, ఆమె అభిరుచులు ఏమిటో ఇన్ని సంవత్సరాల వైవాహిక జీవితంలో రాఘవ గుర్తించక





పోలేదు. కొత్తలో ఆమె మాటల ధోరణికి అడ్డువెళ్ళి ఏదో చెప్పబోయినా ఆమె వినిపించుకునేదికాదు. రావు ఆమెకు నేర్పాలని చూసే విషయాలకు ఆమె దృష్టిలో పీసమంతయినా విలువలేదు. రావు మనస్తత్వం ఆమెకు ఈనాటికీ అర్థంకాలేదు. అసలు అర్థం చేసుకోవటానికి ఆమె ఏనాడూ ప్రయత్నించలేదు కూడా. బహుశా రావు ఏనాటికీ ఆమెకు అర్థంకాదేమో!

* * *

"నాన్నగారూ!"

"ఏం మధూ?"

"ఇతను నా క్లాస్‌మేట్ జోసఫ్!''

"నమస్కారమండీ!"

"నమస్కారం...కూర్చోబాబూ!''

"జోసఫ్‌కు చిత్రకళ అన్నా, చిత్రకారులన్నా ఎంతో ఇష్టం నాన్నగారూ"

"ఐసీ"

"మీ చిత్రాలు చూడాలని ఉందంటే తీసుకొచ్చాను"

"దానికేం... అలాగే చూపించు"

''అన్నట్టు నాన్నగారూ! ఈమధ్య జోసఫ్ ఒక చిన్న గేయం రాశాడు. మీరు చూస్తారా?'' జోసఫ్ చేతిలోని నోట్‌బుక్ తెరచిపట్టుకుని తండ్రికి ఇచ్చాడు మధు.

మతసామరస్యాన్ని బోధించే గేయం.

"బాగుంది. చిన్నవాడివైనా చక్కని గేయం రాశావు. ఇలాగే విడవకుండా రాస్తుండు"

''థాంక్సండీ"

"ఈ గేయం రాయటానికి నీకు కలిగిన ప్రేరణ ఏమిటి బాబూ?"

"నేను ప్రతిరోజూ పేపరు చూస్తుంటాను. దేశం మూలమూలల్లో జరుగుతున్న మతపరమైన హింస నాలో ఏదో ఆవేదన కలిగించింది. మా నాన్నగారు చర్చి ఫాదర్. వార్తల వెనుకగల కారణాన్ని మానాన్నగారు నాకు వివరించి చెబుతుంటారు. నాకు కలిగిన బాధను ఏవిధంగా నివారించాలో తెలియక కాగితంపై పెట్టాను"

"వెరీగుడ్! మీ కుర్రవాళ్ళు తెలుసుకోవల్సిన విషయాలు ఎన్నో ఉన్నాయి. మన దేశం ఎదుర్కొంటున్న అనేక సమస్యల్లో ఈ మత విబేధం ఎంతో ప్రధానమైంది. మనదేశం ఇటువంటి పరిస్థితిని ఎందుకు ఎదుర్కొంటున్నదో తెలుసుకోవాల్సిన బాధ్యత మీ యువతరంపై వుంది. దీని బీజాలు ఎక్కడున్నాయో మీరు తెలుసుకొన్నప్పుడు మతమనే ఈ విషవృక్షాన్ని మీరు మొదలంటూ పెకిలించగలరు.ఆ...జోసఫ్‌ను నా రూమ్‌కు తీసుకుని వెళ్ళు మధూ!"

వాళ్ళలా వెళ్ళగానే "హలో! రావ్!" అంటూ వచ్చాడు శ్రీపతి.

"హలో .. శ్రీపతీ! రారా... ఇలా కూర్చో"

"సారీ! నిన్ను డిస్టర్బ్ చేయలేదు కదా!"

"నో నో....అదేంలేదు. ఉండు వేడిగా కాఫీ తాగుదాం...చెప్పివస్తాను" అంటూ లోపలికి వెళ్ళి వచ్చాడు రావ్.

"ఏమిటో చదువుతున్నట్లున్నావ్?"

"మామూలేగా"

"ఎప్పుడూ అలా చదువుతుంటే నీకు విసుగెత్తదూ?" ప్రశ్నించాడు శ్రీపతి.

"మనంచదవవలసిందితెల్సుకోవల్సింది ఎంతో ఉంది శ్రీపతీ" చిరునవ్వుతో అన్నాడు రావు.

"ఏమో...అదేం తెలియదుగానీ నాకు మాత్రం లైఫ్ ఎంజాయ్ చేయాలని





ఉంటుంది. ఏమిటో ఈ కాలేజీ, పాఠాలు, పుస్తకాలు, డ్రామా, పిల్లలు ... అబ్బబ్బ! రొటీన్ అయిపోతోంది బతుకు. బోర్ కొట్టేస్తున్నాననుకో!"

"అంటే మార్పుని కోరుతోందన్న మాట మనసు" అన్నాడు రావు.

"అవునోయ్... కాస్త అలా వెళదాం రాకూడదూ? కాస్త విదేశీ ద్రవం ఏదయినా గొంతులోకి జారితే హుషారొస్తుందేమో!"

"శ్రీపతీ! మనసు మార్పును కోరటం సహజం. ఆ మార్పునుమరోలా సాధించాలి గానీ అందుకోసమని మనసుని మైకంలో పడవేస్తే ఏం ఆనందం లభిస్తుంది?"

"ఏం చేయమంటావు మరి! నువ్వు కవిత్వం రాస్తావు, బొమ్మలు గీస్తావు. నీకు చక్కగా టైమ్ పాస్ అవుతుంది. మరి నాలాంటి సామాన్యుడికి ఏది దారి?"

"నువ్వూ రాయరాదూ కవిత్వం!" హాస్యంగా అన్నాడు రావు.

"నేనేం రాస్తానోయ్... నా ముఖం.




కవిత్వం ఏది అయినా ఆనందించలేని వాడివి''

"పోనీ నేను చదివి వినిపించనా?"

''అమ్మమ్మ! ఆ పని మాత్రం చేయబోకు. ఇంతకీ నువ్వు బయటకు వచ్చేది ఏమైనా ఉందా లేదా?''

"వస్తాను... బీచ్ కైతే''

''అవునులే. నీ సంగతి తెలిసీ నిన్ను అడగటం నాదే బుద్ధి తక్కువ. పదమరి... కాస్త కాలక్షేపం అన్నా అవుతుంది''

మిత్రులిద్దరూ లేచారు.

జన సంచారానికి కొంచెం దూరంగా చల్లని మెత్తని ఇసుకలో కూర్చున్నారు ఇద్దరూ. ఎడ తెరపి లేకుండా మహోద్రేకంగా ఎగసి పడుతున్న కెరటాలపై దృష్టి నిగిడ్చి కూర్చున్నాడు రావు.

''చల్లని సాగరతీరం, మదిఝల్లను మలయ సమీరం, మదిలో కదిలే సరాగం జీవితమే అనురాగయోగం'' పాట మెల్లగా దగ్గరలో ఉన్న ట్రాన్సిస్టరు నుండి వినిపిస్తోంది.

''వింటున్నావా శ్రీపతీ! ఎంత చక్కని పద సౌందర్యమో!''

''ఊ ఊ... వింటూనే ఉన్నాను'' అక్కడ కొన్న వేరుశనగపప్పు నోట్లో వేసుకుంటూ అన్నాడు శ్రీపతి.

''సినిమా సాహిత్యమే అయినా ఎంత లలితంగా ఉందో చూడు ఆ పాట" వెనక్కి వాలి కూర్చుంటూ అన్నాడు రావు.

"నిజమేనోయ్... ఇప్పుడూ రాస్తున్నారు పాటలు. ఏంచెప్పేది రామరామ.

చెవులు మూసుకోవాలనిపిస్తోంది"

"నిజమే ఈ తరంవాళ్ళలో చక్కని అభిరుచిగానీ, ఏ విషయం గురించీ సరైన, స్పష్టమయిన అవగాహనగానీ లేవు. దేనిలోనైనా తమకంటూ ఒక ప్రత్యేక మైన దృష్టి కనబడటం లేదు. మనిషి జీవితంలో రానురాను భయంకరమైన మార్పులు వచ్చే జాడలు గోచరిస్తున్నాయి శ్రీపతీ!"

"కాలం మారిందోయ్! మన చిన్న తనానికీ ఇప్పటికీ ఎంతో మార్పు వచ్చింది"

"మార్పుని నేను వద్దనటం లేదు. ప్రపంచం ఎప్పుడూ మార్పు వైపే పురోగమించడం సహజం. కానీ ఆ మార్పు అనేది మనిషి ప్రగతికి తోడ్ప డాలి"

"క్షణ క్షణం ప్రపంచం మారి పోతూనే ఉందిగదా! ఈ మార్పు ప్రగతికి తోడ్పడదంటావా?"

"లేదు. మనం ప్రగతిపథం వైపుగా రెండు అడుగులు ముందుకువేస్తూనే మరో నాలుగు అడుగులు వెనక్కి అగాధంలోకి జారిపోతున్నాము. ఈ క్రమంలో మనం లక్ష్యాన్ని సాధించటం అసాధ్యమైన విషయం"

"అవునులే. నువ్వు చెప్పింది నిజమే కావచ్చు. అయినా ఇప్పుడా విషయం పండుగానీ కాస్త కులాసా కబుర్లు చెప్పవోయ్"

"కులాసాకబుర్లంటే ఎలా ఉంటా యిమిటో?" చిలిపిగా ప్రశ్నించాడు రావు.

"అదిగో చూడు...ఆ గ్రీన్‌శారీ కట్టు కున్నామె ఎంత అందంగా ఉందో! ఇటే వస్తోంది...చూడుచూడు"

తలతిప్పి చూశాడు రావు.

తెల్లగా పొడుగ్గా ఉన్న ఒకామె పక్కనుండి వెళుతూ కనిపించింది. పల్చని చీరెలో నుండి ఆమె అవయవాలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. తన శరీర సౌందర్యం చూసే హక్కు ప్రతి వారికి ఉందన్నట్లుగా ఉంది ఆమె వేషధారణ. అసలే ఉల్లిపొరవంటి ఆమె పైట వీస్తున్న గాలికి నిలువకుండా నాట్యం చేస్తున్నది. వెంట్రుకలు అల్లకుండా వదలివేయటం వలన అవి పైటచెంగుతో పోటీపడుతున్నాయి. కత్తిరించిన కను బొమ్మలు, రంగుపూసిన పెదవులు.

తీక్షణంగా ఆమెనే చూస్తున్న మిత్రుణ్ణి గమనించి చిన్నగా నవ్వుకున్నాడు రావు.

"ఆమె అందమైనదే అంటావా శ్రీపతీ!"

"కాదామరి!"

"ఆ మాత్రం అందం ఇంచుమించు ప్రతి స్త్రీలోనూ ఉంటుంది. కాకపోతే తనకున్న అందాన్ని ఈమె ఆలా ఎగ్జిబిట్ చేయటం వలన నీకళ్ళకు మరింత అందంగా కన్పిస్తోంది"

"అంటే, ఆమె వేష భూషణాల్ని తప్పుపడుతున్నావా?"

"తప్పుపట్టటానికి నేనెవరిని? అవి ఆమె ఇష్టాయిష్టాలకు సంబంధించినవి. కాని ఇలా పబ్లిక్ ప్లేస్‌లో అవయవ సౌందర్యాన్ని ఎగ్జిబిట్ చేయటం ఒక విధంగా తప్పే"

"ఎలా?"

"మన దేశంలో తరాలుగా స్త్రీజాతి పరదాలచాటునే జీవించింది. ఇప్పుడిప్పుడే మన స్త్రీలు బైట ప్రపంచంలోకి కాలు పెడుతున్నారు. ఈనాటికీ ఇంకా స్త్రీపట్ల పురుషుడి దృష్టి మారలేదు. ఆమెను ఒక వ్యక్తిగా గుర్తించి గౌరవించేదాకా ఎదగ





లేదు. ఇటువంటి స్థితిలో స్త్రీ ఈ రూపంలో పురుషుడికి కనిపిస్తుంటే ఆమెపట్ల కామ ప్రకోపం కలుగుతుంది తప్ప, నిజమైన గౌరవం చూపించగలడంటావా పురుషుడు?"

''అంటే నీ ఉద్దేశం?''

''వేరే ఉద్దేశ్యంకాదు. స్త్రీ తన ఆనందం నిమిత్తమే సృష్టింపబడిందని తలచే పురుషుడి ప్రవృత్తి మారనంతవరకూ స్త్రీ తన గౌరవానికి భంగంవాటిల్లని రీతిలోనే మెలగాలి. అలాగాక తన అందాన్ని, అవయవసంపదను ఇలా ఎగ్జిబిట్ చేయటం పరోక్షంగా పురుషప్రవృత్తిని రెచ్చగొడుతున్నదనే నా ఉద్దేశం"

"ఆ...ఈరోజుల్లో ఎవరున్నారోయ్ నీవు చెప్పినట్లుండే స్త్రీలు"

"అలా తేలికగా మాట్లాడకు. అటువంటి స్త్రీలు నీకు తటస్థపడనంత మాత్రాన అసలే లేరనీ, అందరూ ఇలాగే ఉంటారనీ అనుకోకు"

"ఏమిటోయ్...నీవు చెప్పేది! అసలు ఈనాటి స్త్రీల గురించి నీకేం తెలుసు. సన్నడుగు చెబుతాను - ఎంత అల్ట్రామోడరన్‌గా అలంకరించుకుంటున్నారో, పురుషుడితో ఎంత ఫ్రీగా మూవ్ అవుతున్నారో...!ఇంతకీ ఆకర్షణీయంగా అలంకరించుకోవటం తప్పనా నీ ఉద్దేశం?''

"కాదు...స్త్రీపురుషుల మధ్య ఆకర్షణ అతిసహజమైన విషయం. నేను కాదనను. బాహ్యమైన వేషభాషలతో ఇరువురు ఆకర్షింపబడటం అనేది అంత ఆరోగ్యకరమైన పరిణామం కాదు. స్త్రీపురుషులమధ్య పెరగవలసినది ఆకర్షణ కంటే ముందు అవగాహన" దృఢంగా అన్నాడు రావు.

''నిజమేగాని, రోజులు చాలా మారిపోతున్నాయి. ఇహ ఆ విషయంఆపేద్దాం. పద వెళదాం!''

మిత్రులిద్దరూ లేచారు.

**4**

...తన అభిరుచుల్ని తనకే పరిమితం చేసుకుని ఎందుకని బతకలేక పోతున్నాడు? తనలా ఇంకొకరు ఉండాలనుకోవటం వెర్రితనమా? తన ఆనందం ఇంకొకరిది ఎలా అవుతుంది? అలా అవ్వాలని కోరుకోవటం ఎంతవరకూ సబబు?...

శూన్యం వంటి మైదానం..ఆ మైదానంలో శ్వేత వస్త్రధారిణి అయిన స్త్రీమూర్తి అవనతవదనయై ఏదో అన్వేషిస్తున్నట్లుగా ఉంది.

రావు చేతిలోని కుంచె ఆ స్త్రీ చిత్రానికి తుదిమెరుగులు పెడుతున్నది.

చిత్రం పూర్తిచేసి తదేక ధ్యానంతో రెండు నిముషాలు ఆ చిత్రాన్ని చూస్తూ నిలబడ్డాడు! అన్వేషణ...అన్వేషణ...

తన బతుకులో అన్వేషణ ...

తన ఆలోచనల్లో అన్వేషణ...

చివరకు తన కవిత్వంలో...

తాను గీసే బొమ్మల్లో...

ఏదో అంతుపట్టని అన్వేషణ.

చేతివేళ్ళతో కణతలపై రుద్దుకున్నాడు.

జీవన విధానంలో మార్పులేదు.

ప్రతిరోజూ ఏదో ఒక అద్భుతం జరగాలని కోరుకుంటోంది మనసు.

కాని ఏ అద్భుతాలులేవు.

నిరంతరం తనలో ఏదో తెలియని వేదన... ఏదో కావాలని తపన!

ఏమిటి...ఎందుకు....?

మండుతున్న తన హృదయానికి శాంతి కావాలి.

ఎక్కడ ఉంది శాంతి?

ఎలా లభిస్తుందది?

తన ఆనందాన్ని, అనుభూతిని పుస్తకాల్లో, చిత్రాల్లో వెదుక్కోక తప్పటం లేదు.

ఎంత చదివినా, ఎంత గీసినా ఏదో తెలియని అసంతృప్తి...

కాలమంతా వీటికే పరిమితమైపోతున్న దనే బాధ.

ఇంతకంటే చేయగలిగింది కూడా ఏమీ కనబడటం లేదు.

ఓహ్...ఏమిటీ ఆలోచనలు?

రావులేచి పుస్తకం చేతుల్లోకి తీసుకుని కూర్చున్నాడు.

ఏకాగ్రత కుదరటం లేదు.

ఆలోచించే మనసు పనిచేయటం మానలేదు.

తనని కాల్చే ఈ ఆలోచనలని, తపించే తన మనస్సుని-అన్నింటినీ ఐక్యం చేసు కోగలిగిన శక్తి ఏదో తనకు కావాలి.

మనిషిమనిషికీ మధ్యగల తెరలను ఛేదించి మమతను పొంగించి తనలో ఐక్యం చేసుకునే శక్తి తనకుకావాలి.

అందుకే తన ఈ అన్వేషణ.

అది ఫలించేవరకూ ఈ అనంత విశ్వంలో తాను ఒంటరివాడు. ఎవరికీ ఏమీకానివాడు.

మనసున్న మనిషికీ, మానవత్వపు జాలనకు అత్యంత సన్నిహితుడు తను.

మెల్లగా మెట్లుదిగి గార్డెన్‌లోకి అడుగు పెట్టాడు రావు.

విరగబూసిన తెల్లగులాబీలు మసుసు కుంటున్న ఆ చీసుచీకటిలో ఇంకా తెల్లగా మెరిసిపోతున్నాయి.

ప్రతి మొక్కనూ నిశితంగా చూస్తూ పలార్లు చేస్తున్నాడు.

చంద్రోదయమైంది.

చంద్రుడి దగ్గర శలవడిగి చీకటి మాయమయింది.

వెన్నెల ఆకాశానికీ, భూమికీమధ్య వారధి నిర్మిస్తోంది.

తోటలోని తెల్ల గులాబీలు, మల్లెలు వెన్నెల కిరణాలతో పోటీపడుతున్నాయి.

క్రమంగా రావు మనస్సు స్థిమితపడింది. రాతి చప్టామీద వెల్లికిలా పడుండి మబ్బులతో ఆడుకుంటున్న చంద్రుడిని చూస్తున్నాడు.

"ఏంచేస్తున్నారీ చీకట్లో?" వెతుక్కుంటూ వచ్చింది ఇందిర.

సమాధానంగా లేచి కూర్చుని భార్యకేసి చూశాడు.

వెన్నెలవంటి తెల్లని మెత్తని చీర ఆమె ఒంటిమీద మెరుస్తోంది.

రావు హృదయంలో ఏదో కోరిక తలెత్తింది.

"రా ఇందిరా! కాసేపు వెన్నెలలో కూర్చుందాం"

"ఇప్పుడా? భలేవారు. నాకు టైము లేదు. అవతల హైదరాబాదునుండి మిసెస్ ఆనందరావు వస్తున్నారు. ఆమెను రిసీవ్ చేసుకోటానికి మేమంతా స్టేషనుకు వెళుతున్నాము. మీకుచెప్పిపోదామనివచ్చాను"

"అలాగా...వెళ్లు"

తలెత్తిన కోరిక తిరిగి చూడకుండా గుండెలలోకి నిష్క్రమించింది.

ఎప్పుడూ...ఎల్లవేళలా తనను చుట్టు ముట్టి వుండే ఈ ఒంటరితనం ఏమిటి..?

దీనినుండి తనకు ఎప్పటికి విముక్తి...?

భిన్న స్వభావులైన ఇద్దరు వ్యక్తులు కలిసి బతకటం ఎంత దుర్భరం...?

తన అభిరుచుల్ని తనకే పరిమితం చేసుకుని ఎందుకని బతకలేకపోతు

 

న్నాడు...?

తనలా ఇంకొకరు వుండాలనుకోవటం వెర్రితనమా?

తన ఆనందం ఇంకొకరిది ఎలా అవుతుంది? అలాఅవ్వాలని అనుకోవటం ఎంతవరకు సబబు....?

కాని తన అంతరంగాన్ని, అభి రుచుల్ని పంచుకునే వ్యక్తి కావాలను కోవటం తప్పా?

తను ఎంత స్థయిర్యాన్ని అలవచ్చు కున్నా తనకీ బాధ తప్పటంలేదే!

మనిషి ఎల్లవేళలా ఏకాకిగా జీవించడం అసాధ్యం. అర్ధరాత్రి బయటకు వచ్చి తలెత్తిచూస్తే అనంతమైన ఆకాశంలో నిండిన చీకటి తన గుండెలను మెలి పెడుతుంది.

శరీరాన్ని చల్లగా తాకే చిరుగాలికి తాను చిగురుటాకులా వణికిపోతాడు.

నిండువెన్నెల్లో కూర్చుంటే గుండె నుంచి ఉబికే ఏదో సెగ తన నరనరాన్ని కాల్చివేస్తుంటుంది.

తనలో నిరంతరం ఏదో నిర్వచించ లేని బాధ...

రావు లేచి లోపలికి నడిచాడు.

* * *

"మాష్టారూ!"

డెబ్బై సంవత్సరాల ఆ వృద్ధుడు ఉలిక్కిపడి తిరిగి చూశాడు.

ఎదురుగా తెల్లని లాల్చీ, పైజమా ధరించిన వ్యక్తి.

"ఎవరు బాబూ నీవు?" జ్ఞాపకాల పొరలని తడుముతున్నాడా వృద్ధుడు.

"నేను మాష్టారూ...సుందర్రావుని! జగన్నాథంగారి అబ్బాయిని"

"ఏ సుందర్రావు... గుర్తు రావటం లేదు బాబూ!"

"చిన్నప్పుడు మన ఊళ్ళో హైస్కూల్లో తెలుగు చెబుతుండేవారు... తెలుగు పద్యాలు చదివి వినిపిస్తుండే వారు. నేను...నేను...పద్యాలు రాసుకొస్తే మీరు సరిదిద్దేవారు... జ్ఞాపకం రావటం లేదా మాష్టారూ?"

"ఆ ఆ ... జ్ఞాపకం వస్తున్నట్లే ఉంది. అవునవును...నీవు సుందరానివి కదూ!" మాష్టారి కళ్ళల్లో గతం తళుక్కున మెరిసింది.

"ఎన్నేళ్ళనాటి సంగతి... ఎన్ని సంవత్సరాలయిందో! నీవు చాలా మారి పోయావోయ్. ఆనాటి సుందరానికి, నీకు పోలికేలేదు"

"మీరూ చాలా మారేరు మాష్టారూ!" చిరునవ్వుతో అన్నాడు రావు.

"మారానటోయ్! డెబ్బైఏళ్ళ వాడిని. రేపో మాపో వెళ్ళిపోయేవాడిని"

మాష్టారి నోటి వెంట దీర్ఘమైన నిట్టూర్పు.

"అన్నట్టు సుందరం! నేను నీకు ఇంకా గుర్తుండటం చిత్రంగా ఉందోయ్! నీకు ఏనాటి మాష్టారిని నేను...తలచు కుంటే ఆశ్చర్యంగా ఉంది"

"ఇందులో ఆశ్చర్యపడాల్సింది ఏముంది మాష్టారూ!పద్యాలుపాడి వినిపించే మీ కంఠ మాధుర్యం నాకు ఇప్పటికీ గుర్తుంది. ప్రాచీన కవులను, కవిత్వాన్ని మీరేకదా నాకు పరిచయం చేసింది. ఎలా మరచిపోతాను?" తామిద్దరి మధ్య గల అనుబంధాన్ని గుర్తు చేసుకుంటు న్నట్టుగా అన్నాడు రావు.

"మంచిది సుందరం! ఆరోజులన్నీ ఇంకా నీకు గుర్తున్నందుకు సంతోషంగా ఉంది"

"సరేగానీ...ఈ ఊళ్ళోవున్నారేమిటి



మాస్టారూ? ఇక్కడకు ఎలా వచ్చారు?" రావు కంఠంలో ఆప్యాయత.

మాస్టారి ముఖంలో విషాదఛాయలు.

ఆయన కళ్ళల్లో లీలగా నీటి తడి.

"ఇప్పుడు ఇక్కడే ఉంటున్నాను సుందరం! మావాడిక్కడే పనిచేస్తున్నాడు" మెల్లగా అన్నారు మాస్టారు.

"నిజమా! ఇక్కడుంటున్నారా?" ఆనందంగా అన్నాడు రావు.

"అవును. అన్నట్టు నీ సంగతులేం చెప్పలేదు"

క్లుప్తంగా తన గురించి చెప్పుకొచ్చాడు రావు.

"బాగుందోయ్! ఇప్పుడేమైనా కవిత్వం రాస్తున్నావా, మానేశావా?"

"రాస్తున్నాను మాస్టారూ! మా ఇంటికి వెళదాం రాకూడదూ?"

"ఇప్పుడా? తరువాత వస్తానులే. ఆలస్యమైతే మావాళ్లు నా కోసం వెదుక్కుంటారు"

తను చేసిన పొరపాటు గ్రహించి తలవంచుకున్నాడా వృద్ధుడు.

"ఇక్కడ ఎవరున్నారు మాస్టారూ?"

చెప్పటానికి తడబడ్డాడాయన.

"ఏమీలేదు....కోడలికి పిల్లలతో, ఇంట్లో చాకిరితో తెములటం లేదు. పైగా నా పనులు చేయాలంటే కష్టం కదా! అందుకని...."

"అందుకని... చెప్పండి మాస్టారూ!"

"అబ్బాయి నన్ను ఇక్కడి వృద్ధ శరణాలయంలో చేర్పించాడు" తల వంచుకుని మెల్లగా అన్నారాయన.

నిర్ఘాంతపోయాడు రావు.

తనలో పేరుకొన్న మమతను, తను ఆర్జించిన జ్ఞానాన్ని అందరికీ పంచి ఇచ్చి సౌమ్యతకు, సహనానికి మరో పేరుగా గుర్తింపబడ్డ ఈ మాస్టారు...

తన దగ్గరకు వచ్చే కుర్రవాళ్ళందరినీ ఒకేలా హృదయంలోకి తీసుకుని కులమత వ్యత్యాసాలకు అతీతంగా జ్ఞానాన్ని గరిపిన ఈ రామనాథం మాస్టారు...

బాల్యదశలో గొప్ప మానవతా మూర్తిగా తన హృదయంలో ముద్రపడ్డ మాస్టారు...

అయినవారికి, ఆప్యాయతకు, ఆదరణకు దూరంగా ఇలా.... ఈ వయస్సులో...

కొన్నిక్షణాల వరకూ రావు నోటి వెంట మాటలు పెగలలేదు.

"వస్తాను సుందరం! నీకు వీలుంటే ఎప్పుడైనా వచ్చి చూసివెళ్లు"

తలవంచుకుని మెల్లగా అడుగులు వేస్తూ వెళుతున్న ఆ మూర్తి నీరు నిండిన రావు కళ్ళకు మసక మసకగా కనిపిస్తూ కనుమరుగయింది.

* * *

ఆ రాత్రి చదువుతూ కూర్చున్నా... రావు మనసులో మాత్రం రామనాథం మాస్టారి మూర్తే గిర్రున తిరుగుతోంది.

ఏవేవో చిన్నప్పటి జ్ఞాపకాలు, ఆనాటి మాస్టారి కంఠం రావుని పదే పదే పలకరిస్తున్నాయి. ఆ సాయంకాలం గుండెల్లో రగిన బాధ పెరిగి పెరిగి అతనిలో అనేక ఆలోచనలను రేకెత్తిస్తోంది. బాల్య, యౌవన దశల కంటే వృద్ధాప్యదశలో మనిషి తోడు లేకుండా జీవించలేడు. తనవారి అండలో వారు అందించే ఆదరణలో తన జీవితం ముగియాలని కోరుకుంటాడు. కాని **ఇదేమిటి...?** మనిషి జీవితం ఇంత దుర్భరంగా ఎందుకు తయారవుతోంది? కుటుంబ వ్యవస్థ పతనానికి పరాకాష్ఠ ఈ





హోమ్‌లు?

మనిషి తన జీవితకాలంలో ఎంత సంపాదించినా, ఎన్ని వున్నత పదవులను నిర్వహించినా తన కుటుంబ సభ్యుల ఆప్యాయతను అండదండలను కోరుకోక మానడు.

భోగభాగ్యాలకు ఏనాడు విలువనీయని మాష్టారు వంటివారికి మమత, మానవతలే వెలలేని సంపదలు.

మరి సాటిమనిషి నుండి ప్రేమాభిమానాలను మాత్రమే ఆశించే మాష్టారికి జీవితం ఇటువంటి శిక్ష విధించిందేమిటి?

ఈ చివరి దశలో ఎటువంటి మనస్తాపం లేకుండాబతికి, హాయిగా మరణించే అవకాశం మాష్టారికి లేదా?

ఎక్కడవుంది ఈ లోపం?

మాష్టారితరానికి, ఈతరానికి మధ్య భయంకరమైన అగాథం...

మనిషి మనిషికీమధ్య పూడ్చలేని అగాథం...

మానవ జీవితం ఎటువైపుగా మలుపు తిరగబోతోంది?

ఆలోచనలు ... ఎడతెరిపిలేని ఆలోచనలు...

ఈనాటి మనిషి ఎన్నెంటినో సాధిస్తున్నాడు.

కానీ అంతకుమించి జీవితానికి, అంతరంగానికి అవసరమయిన విలువలని ఎన్నింటినో కోల్పోతున్నాడు.

దని పర్యవసానం అందరూ అనుభవించవలసిందే...తప్పదు.

* * *

ఆదివారం ఉదయం ...

మాష్టారికి ఇష్టమయిన తెలుగు సారస్వత గ్రంథాలు రెండు కొని, ఒక బాస్కెట్‌నిండా పళ్ళు తీసుకుని బయలుదేరాడు రావు.

"వచ్చావా సుందరం!"

మాష్టారి ముఖంలో ఆనందం రావు దృష్టిని దాటిపోలేదు.

రావు వెళ్ళేటప్పటికి ఒక చెట్టు కింద కూర్చుని వున్నారు మాష్టారు. అక్కడే వున్న ఒక రాతిపై కూర్చున్నాడు రావు.

"మాష్టారూ...మీకుకాస్త కాలక్షేపంగా వుంటుందని ఇవి తెచ్చాను" పుస్తకాలందిస్తూ అన్నాడు.

"అయినవారంతా వదలివేసిన ఈ వృద్ధుడిపై నీకింత వాత్సల్యం ఏమిటి సుందరం?"

మాష్టారి కంఠంలో వణుకు.

"అలా అనకండి మాష్టారూ! నేను మీ కుటుంబసభ్యుడిని కాకపోయినా మన మధ్యగల గురుశిష్య సంబంధాన్ని నేను గౌరవిస్తాను. సాటిమనిషిగా మిమ్మల్ని అభిమానిస్తాను"

నిర్నిమేషంగా రావు ముఖంలోకి చూస్తూండిపోయారు మాష్టారు.

"ఈరోజుల్లో కూడా నీవంటి శిష్యుడు ఉన్నందుకు నేను గర్విస్తున్నాను" రావు భుజంపై చేతులువేసి తడుతూ అన్నారాయన.

"నాదో చిన్న సందేహం"

"ఏమిటది...చెప్పు?"

"మీ అబ్బాయి తన ఇష్టప్రకారమే ఇలా చేశాడంటారా?"

"తండ్రిగా నాపై వాడికి అభిమానమున్నా పరిస్థితులవలన వాడు ఇలా చేయక తప్పలేదు. ఈరోజుల్లో అయిన వారి మధ్యే ఆప్యాయతలు కరువవుతుంటే పరాయి ఇంటిపిల్ల కోడలికి నాపై మమకారం ఎందుకుంటుంది చెప్పు?"

రావు జవాబివ్వలేదు.



"మీకు అభ్యంతరం లేకపోతే నేను అప్పుడప్పుడు ఇలా వచ్చి మిమ్మల్ని చూసిపోతుంటాను"

"అభ్యంతరం ఏముంటుంది సుందరం? నీరాక నాకు ఆనందదాయకమనే విషయం నీకు తెలియదూ!"

"వస్తాను మాష్టారూ! మళ్ళీ కలుస్తాను"

"మంచిది...వెళ్ళిరా!"

* * *

"ఏం చేస్తున్నావ్ రావు?"

"ఏంలేదు.... కూర్చో. సరేగానీ... ఇంటికెళ్ళకుండా ఇలావచ్చావేం శ్రీపతీ?"

"ఏంచేయమంటావ్? ఇంటికెళ్ళాలంటే భయంగావుంది. మా ఇల్లు ఒక చిన్న సైజు నరకంలా తయారవుతున్నదంటే నమ్ము"

"ఎందుకని?"

"మా ఆవిడలో ఏదో విపరీతమైన మార్పు వచ్చింది. ఎంతో నెమ్మదిగా ఉంటూ నన్ను, పిల్లలను ప్రేమగా చూస్తుండేది. ఇటీవల కొంతకాలంగా ఏమిటో ప్రతిదానికీ విసుగూ, చికాకు ఎక్కువైపోయాయి. ఏమైనా అంటే మాటకుమాట బదులుచెబుతూ విరుచుకు పడుతోంది" నిట్టూర్చాడు శ్రీపతి.

"కారణం ఏమిటో కనుక్కోలేక పోయావా?"

"నాకు చేతనైన రీతిలో అడిగి చూశానుగానీ సమాధానం సరిగా రాలేదు. అంతకంటే సౌమ్యంగా అడిగే ఓపిక నాకు లేదు"

"అదేమిటి శ్రీపతీ! ఆమె ప్రవర్తనలో ఎన్నడూలేని మార్పు కనబడుతూంటే కారణం తెలుసుకుని ఆమెను సరిచేయ వలసిన బాధ్యత నీకు లేదా?"

"ఏం చేయమంటావు? ఇంటికి వెళ్ళగానే రుసరుసలతో సంభాషణ ప్రారంభం అవుతుంటే సహనం చచ్చిపోదటోయ్"

"చిన్నపిల్లవాడిలా మాట్లాడకు. ఆమె పరిస్థితి గ్రహించకుండానే నువ్వూ అలాగే ప్రవర్తించటం ఏం బాగాలేదు"

"నీది మరీ విడ్డూరం! ఏం పరిస్థితులు ఉంటాయి ఆమెకు? హాయిగా తిని ఇంట్లో కూర్చోవటమేగా ఆమె పని"

"పొరపడుతున్నావు శ్రీపతీ! నీతో కలిసి జీవించేవ్యక్తిని నీవు ముందు ఒక మనిషిగా గుర్తించాలి"

"గుర్తించక ఏం బాధలు పెడుతున్నాను?"

"బాధలు పెట్టకపోవటమే సుఖపెట్టటం అవుతుందా?"

"మరి ఏం చేయమంటావ్?" ఆశ్చర్యంగా అడిగాడు శ్రీపతి.

"ఆమెకు ఆ ఇల్లు, ఆ వాతావరణం, ఇంటి పని ఓకాకు కలిగిస్తున్నాయేమో తెలుసుకున్నావా?"

"బావుందోయ్ నువ్వు చెప్పేది. ఇంటి పనికూడా చెయ్యక పిళ్ళింక చేసేది ఏముంది?"

"నిజమే కానీ, ఆమె ఒక మనిషనీ, ఆమెకూ ఒక మనసుంటుందనీ, ఆ మనస్సు మార్పుని కోరుతుందనీ నువ్వు ఎందుకాలోచించవు?"

"అందుకని...?"

"ఏంలేదు శ్రీపతీ! ఆమె పరిస్థితిని కాస్త శ్రద్ధగా పరిశీలించి అర్థంచేసుకోటానికి ప్రయత్నించేయి. నీతో కలిసి బతికే ఆమెపట్ల అశ్రద్ధకూడదనే చెబుతున్నాను"

"అశ్రద్ధ చేస్తున్నానంటావా?"

"కాదామరి? ఎంతసేపూ నీ ఆనందం నువ్వు చూసుకుంటున్నావేగాని ఎన్నడైనా ఆమె గురించి ఆలోచించావా? ఆమె ఆనందం ఏమిటో, ఆమెకు ఏం కావాలో, ఏం చేస్తే ఆమె సంతోషిస్తుందో తెలుసుకున్నావా?"

"ఆమెకంటూ ప్రత్యేకమైన ఆనందం ఏముంటుంది?"

"అక్కడే పొరబడుతున్నావు. ఆమెను ఒక వ్యక్తిగా, సాటి మనిషిగా గుర్తించక పోవటం వలనే ఈరోజు నీకీ మనస్తాపం కలుగుతోంది ... కాదంటావా? జీవితం పంచుకున్న వ్యక్తిని సరిగా అర్థం చేసుకోలేక అశ్రద్ధ చేస్తే జీవితం నుంచి మనం చాలా కోల్పోతాం శ్రీపతీ!"

"ఇంతకీ నువ్వనేది...?"

"ఏముంది .. ఆమెను అర్థంచేసుకుని ఆనందింపచేయటానికి ప్రయత్నించేయి. అంతే! ఇదో పెద్ద సమస్య కాదు. మనస్సు వైవిధ్యాన్ని కోరుకోవటం సహజం. యాంత్రికంగా జీవితాన్ని గడుపుకు రావటం వల్లనే ఇటువంటి పరిస్థితులు సంభవిస్తాయి"

"నిజమేనోయ్! ఈ రొటీన్ లైఫ్‌కి నాకే విసుగెత్తిపోతోంది"

"చూశావామరి? ఆమెకూడా అదే పరిస్థితిలో ఉండివుంటుంది'' చిరునవ్వుతో అన్నాడు రావు.

"అన్నట్టు శ్రీపతీ! మంచి కల్చరల్ ప్రోగ్రాం ఒకటుంది...వెళదామా?"

"ఓకే... పద మరి''

కిక్కిరిసిన ప్రేక్షకులను దాటుకుంటూ ఒక పక్కగా ఉన్న సీట్లలో ఆసీనులయ్యారు మిత్రులిద్దరూ.

వేదికపై రసవత్తరమైన నృత్యరూపకం నడుస్తోంది. అందులో పాల్గొన్న కళాకారుల హావభావాలు, అభినయం మనోరంజకంగా ఉన్నాయి. జీవితంలో గల సుఖదుఃఖాలను అభినయం ద్వారా వ్యక్తీకరించే నాట్యకళ మనిషిని నిత్య జీవిత సమస్యలకు, బాధలకు దూరంగా తీసుకుని వెళ్ళి ఒక అలౌకిక సౌందర్య జగత్తులో ప్రవేశపెడుతుంది. అసలు కళకు మాత్రమే అటువంటి శక్తి ఉందేమో. అనాదిగా మనిషి వాస్తవిక జీవితాన్ని కొంతసేపైనా విస్మరించే ప్రయత్నంలోనే కళలను సృష్టించుకున్నాడు. జీవితంలోగల బాధలను, వేదనల్ని మరపించి మనస్సుకు ఊరట కలిగించేందుకు ఈ కళ తోడ్పడినట్లుగా మరింకేదీ తోడ్పడదు. సామాన్యులకు, అసామాన్యులకు కూడా ఆనందాన్నిచ్చేది కళ మాత్రమే. జాతిమత వ్యత్యాసాలకు అతీతంగా సర్వ మానవ ప్రపంచాన్ని సమ్మోహితులను చేసి పరవ





శింపచేస్తుంది.

లౌకిక జగత్తునుండి రస జగత్తులోకి అడుగుపెట్టినట్లుగా ఉంది రావు మనస్సుకి. పరిసరాల్ని మరచి తన్మయతతో తిలకిస్తూ కూర్చుండిపోయాడు.

* * *

"రండి మాష్టారూ!"

మాష్టారిని వెంట తీసుకుని వచ్చి తన రూమ్‌లో కూర్చోబెట్టాడు రావు.

"ఈరోజంతా మీరుఇక్కడేవుండాలి. ఆ...భోజనం తయారుచేయమని చెప్పి వస్తాను. మీరు ఈ చిత్రాలు చూస్తుండండి" అని కిందకి దిగి వెళ్ళి అయిదు నిమిషాల్లో తిరిగి వచ్చాడు.

"చాలా బాగున్నాయ్ రావ్...నీ చిత్రాలు. ముఖ్యంగా ఒంటరిగా చెట్టుకింద నిలబడిన ఆ వృద్ధుడి మొహంలో కనిపించే దైన్యం మనసుని కలచి వేస్తుందోయ్! నన్ను చూసిన తరువాత వేశావా ఏమిటి ఆ చిత్రం?" కుతూహలంగా అడిగారు మాష్టారు.

రావు సమాధానం ఇవ్వలేదు. చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు.

"ఏది...నీ కవిత్వం కూడా చూపించు మరి!"

రాతప్రతిని మాష్టారి చేతికి అందించాడు.

"చదివివిన్పించకూడదూ...వింటాను"

"అలాగే"

రావు నిదానంగా ఒక్కొక్కటే చదువుతుంటే మాష్టారు కుర్చీలో వెనక్కు వాలి కళ్ళు మూసుకుని వినసాగారు.

"మధూ...ఇలా రా!"

"మా అబ్బాయ్ మధుకర్!" పరిచయం చేశాడు.

"నమస్కారమండి" చేతులు జోడించాడు.

"నమస్కారం. ఇలా రా బాబూ... కూర్చో"

"అచ్చు నీ పోలికేనోయ్ సుందరం!" సంతోషంగా అన్నారు మాష్టారు.

"నేను వెళతాను నాన్నగారూ!" మెల్లిగా లేచి నిలబడి అన్నాడు మధు.

"అలాగే"

"సుందరం! మీవాడిలో నీ పోలికలే కాకుండా ఆ ముఖంలో నీ స్వాభావికపు ఛాయలు కూడా తొంగిచూస్తున్నాయి"

"అవును మాష్టారూ! మధు అలవాట్లు, అభిరుచులు కొంతవరకూ నన్ను పోలివుంటాయి"

"అహా...నీకొడుకుని కూడా నీలాగే తయారుచేస్తున్నావన్నమాట"

"కావాలని తయారుచేయటం లేదు మాష్టారూ! మధుకి నాదగ్గర స్వేచ్ఛవుంది. వాడి స్వభావాన్ని గుర్తించి ఆ మార్గంలో తను ముందుకు వెళ్ళటానికి నేను సహకరిస్తున్నాను అంతే!"

"అదీ నిజమేలే. మనం కోరుకున్నట్లుగా పిల్లలు తయారవుతారనుకోవటం వట్ఠి తెలివితక్కువ" భారంగా అన్నారు మాష్టారు.

"ఇహ భోజనానికి లేద్దామా!"

"అలాగే పద"

"ఇద్దరూ భోజనం బల్లదగ్గర కూర్చున్నారు.

"అన్నట్లు సుందరం...మీ శ్రీమతి ఇంట్లో లేదా?"

"లేదు... వస్తుంది" ముక్తసరిగా జవాబిచ్చాడు.

మాష్టారికి అన్నీ తానే స్వయంగా వడ్డించటం మొదలెట్టాడు.

దగ్గరవుండి ఆప్యాయంగా కొసరి

కొసరి వడ్డిస్తున్న రావుని చూస్తుంటే మాష్టారి కళ్ళల్లో నీరు తిరిగింది.

పరిస్థితి గ్రహించి విషయం మరల్చాలని....

"మాష్టారూ! మీరు శరత్ సాహిత్యం ఏమైనా చదివారా?" అన్నాడు రావు.

"చదవకేం... శరత్ భోజనప్రియుడు కదూ!"

"అవును మాష్టారూ! దయార్ద్ర హృదయులైన శరత్ నాయికలంతా తమలోగల ఆప్యాయతను, అభిమానాన్ని భోజనంలో రంగరించి తమ నాయకులకు వడ్డించినవారే. భోజన సన్నివేశాన్ని శరత్ రాసినంత మార్దవంగా మరే రచయితా రాయలేదేమో! స్త్రీత్వపు మమకారాల్ని తన నాయికల ద్వారా పాఠకులకు రుచిచూపించినవాడు శరత్"

"అవును సుందరం! స్త్రీలు ఆప్యాయతతో దగ్గరవుండి వడ్డిస్తుంటేనే పురుషుడు సంతృప్తిగా భోంచేయగలడు. అయినా ఇప్పుడు రోజులు మారిపోయినయ్ అనుకో! సంతృప్తిగా భోజనంచేసే సమయంకూడా లేదు ఈనాటి మనిషికి"

భోజనానంతరం మాష్టారు కొంతసేపు విశ్రాంతి తీసుకున్నాక తిరిగి కవితలుచదివి వినిపించటం మొదలెట్టాడు రావు.

"సుందరం! సూటిగా ఒకమాట అడుగుతాను చెబుతావా?"

"ఏమిటది మాష్టారూ?"

"నీ కవిత్వంలో అంతర్లీనంగా ఏదో ఆవేదన ధ్వనిస్తోంది. నీకేం తక్కువ సుందరం?"

రావు అంతరంగాన్ని తడిమి చూస్తున్నాయి ఆయన చూపులు.

"ఆవేదనలేని మనిషి ఉంటాడంటారా, మాష్టారూ?"

"ఉండకపోవచ్చు. కానీ నీ ఆవేదన ఏమిటో నాకు అర్థంకావటంలేదు. నీకు ఉన్నతమైన అభిరుచులున్నాయి. ఒక క్రమపద్ధతిలో జీవిస్తున్న మనిషివి నీవు. అనుభూతించే మనసున్న నీకు ఆనందం అంటే ఏమిటో కూడా తెలిసుండాలి. ఇహ ఆవేదన దేనికి సుందరం?"

రావు మాట్లాడలేదు.

కొంతసేపు మౌనం రాజ్యం చేసింది.

"మీరు చెప్పింది నిజమే మాష్టారూ! ఆనందం అంటే ఏమిటో తెలుసుకాబట్టే కృత్రిమమైన విలువల్లో ఇమడలేకపోతున్నాను. ఒక మనసున్న మనిషిగా నేనూ జీవితంనుండి కొన్ని కోరుకుంటున్నాను. అవి లభ్యం కానప్పుడు మిగిలింది ఆవేదనేగా"

"అంటే నీవు కోరుకున్నది లభ్యం కాని పరిస్థితి ఉందా నీ జీవితంలో?" ఆశ్చర్యంగా అడిగారాయన.

"అవును మాష్టారూ! నా మనస్సుకి అననుకూలమైన పరిస్థితిలోనే నేను ప్రస్తుతం జీవించవలసి వస్తున్నది"

బరువుగా ధ్వనించింది రావు కంఠం.

"నీకేమిటి తక్కువ సుందరం! ఒక ప్రొఫెసర్‌గా సంఘంలో మంచి హోదా, చక్కని ఇల్లు, నీ అభిరుచులకు తగ్గ కొడుకు..." ఆగారు మాష్టారు.

నవ్వాడు రావు.

"మీకు తెలిసింది ఇంతే మాష్టారూ! కేవలం మీరు చెప్పినవాటిలో మాత్రమే మనిషి జీవించలేడనే విషయం మీకూ తెలుసు. అయినా ఇప్పుడా విషయాలు దేనికిలెండి" సంభాషణ తుంచేశాడు రావు.

మాష్టారు బయలుదేరుతుండగా కారు దిగి లోనికి అడుగుపెట్టింది ఇందిర.




"ఇందిరా! వీరు నా చిన్ననాటి మాష్టారు...రామనాథంగారు" పరిచయం చేశాడు రావు.

"నమస్కారమండీ"

"నమస్కారమమ్మా"

మాష్టారి ముఖంలో ఏదో ఆశా భంగం కనిపించింది.

"వస్తాను సుందరం!" అన్నారాయన ముందుకు కదుల్తూ.

"ఎవరా ముసలాయన? ఎందుకొచ్చా రేమిటి?"

గదిలో కొచ్చిన భర్తను ప్రశ్నించింది ఇందిర.

చివుక్కుమంది రావు మనస్సు. నిగ్రహించుకున్నాడు.

"రామనాథంగారని మా ఊరి హైస్కూల్లో తెలుగు మాష్టారు. చాలా మంచి వ్యక్తి" తనలో తను అనుకుంటు న్నట్లుగా గొణిగాడు రావు.

**5**

....సాటి మనిషిని ప్రేమించలేని తత్వం మనిషిలో ఎందుకు పెరుగు తోంది? మనిషి ఇంత స్వార్థ పరుడిగా తయారవుతున్నాడే. ఏంబావుకోవాలని? ఈనాడు మనిషికీ మనిషికీ మధ్య ఏం మిగిలింది?...

"అయ్యగారూ!" డైనింగ్ టేబిల్ దగ్గర కూర్చుని కాఫీ తాగుతున్న రావు తలెత్తి చూశాడు.

"ఏమిటి సత్యం?"

సంశయంతో చేతులు నలుపుకుంటూ నిలబడ్డాడు వంటతను సత్యం. వదనంలో విషాదఛాయలు. కళ్ళల్లో కిందకు జార టానికి సిద్ధంగా వున్న కన్నీళ్ళు.

"అలా వున్నావేం సత్యం?" అను నయంగా అన్నాడు.

విషాదం బద్దలై భళ్ళున కన్నీ రుకట్టలు తెగి ప్రవహించగా బావురుమని రోదిం చాడు సత్యం.

"అరె...ఏమిటిది? ఏమైంది?"

"బాబూ! మావాడికి ఏదో గుండె జబ్బుట. వ్యాధి ముదిరిపోయిందని, త్వరగా అపరేషన్ చేయాలని అంటు న్నాడు డాక్టరు"

"ఎవరికి..మీ అబ్బాయికా?" ఆదుర్దాగా అడిగాడు.

"అవును బాబూ!"

"చదువుకుంటున్నాడనిచెప్పావుకదూ!"

"అవును బాబూ వాడే! పదవ తరగతి చదువుతున్నాడు. వాడొక్కడే నాకు మగబిడ్డ. చదివించి కాస్త బాగా బతికేటట్టు చేయాలని ఆశలు పెట్టుకున్నాను. నా ఖర్మకాలి ఆ జబ్బు వాడికే దాపురించింది" దుఃఖం గొంతుకి అడ్డుపడగా అస్పష్టంగా, గొణిగినట్లుగా అన్నాడు సత్యం.

"ఇప్పుడు ఎక్కడున్నాడు? హాస్పి టల్ లో చేర్చావా?"

"లేదు బాబూ! మీకొకసారి చూపించు దామని నాతో కూడా తీసుకుని వచ్చాను. ఒరేయి రాముడూ!" అంటూ బయటకు కేకవేశాడు సత్యం.

రాముడు మెల్లగా నడచి వచ్చి తల వంచుకుని నిలబడ్డాడు.

గుండెపట్టేసినట్లయింది రావుకి. జబ్బు వల్ల క్షీణించిన రాముడి శరీరం ఎముకల ప్రోవులావుంది. గుంటలుపడిన ఆ కళ్ళలో దైన్యం, మృత్యుభీతి కొట్టొచ్చి నట్లు కనిపిస్తున్నాయి.

"ఏ స్కూల్లో చదువుతున్నావు రాముడూ?" ఆప్యాయంగా అడిగాడు

రావు.

ఎగసిపడుతున్న శ్వాసను బిగపట్టి అతిప్రయత్నం మీద కూడతీసుకుని ఒక్కొక్క అక్షరం ఉచ్చరించాడు రాముడు.

ఆ పిల్లవాడి అవస్థ చూస్తుంటే నోరు తెరిస్తే గుండె పగిలిపోతుందేమో అన్నట్టుగావుంది.

''బాబూ...మీరేదైనా సహాయం...''

అర్థం అయింది రావుకి.

"అలాగే సత్యం! నా చేతనైనంత సహాయం తప్పకుండా చేస్తాను. జబ్బు పూర్తిగానయమయ్యేంతవరకూ కావలసిన డబ్బు నేనిస్తాను! ఇతరత్రా కూడా సేకరించి నీకు అందజేస్తాను. బాధపడకు. ముందు వెంటనే ఈ కుర్రాడిని హాస్పిటల్‌లో చేర్పించు"

కృతజ్ఞతా భారంతో కంఠం పెగలని సత్యం రెండు చేతులు జోడించి రావుకి నమస్కరించాడు.

వాళ్ళటు వెళ్ళగానే భార్య దగ్గరికి నడిచాడు.

"ఇందిరా!"

"ఊ..."

''మన సత్యం కొడుకు సంగతి నీకు తెలుసా?"

''తెలిసింది.''

''నీకు ఊళ్ళో చాలా సంస్థలతో పరిచయం వుండివుంటుంది. వాటి ద్వారా ఆ అబ్బాయికి ఆర్థికసహాయం ఏమైనా చేయకూడదూ? మీ క్లబ్ తరఫున కూడా ఏమైనా సహాయం చేయవచ్చుగదా ...''

"బావుంది మీరు చెప్పేది. ఊళ్ళో చందాలు వసూలుచేసి వంటవాడి కొడుక్కి వైద్యం చేయించేతీరిక, ఆసక్తి నాకు లేవు. అవేమైనా మీకుంటే ఆపని మీరే చేయండి. నాకు మీటింగుంది ... వెళుతున్నాను" చకచకా మెట్లుదిగి వెళ్ళిందామె.

స్థాణువులా నిలబడిపోయాడు రావు. క్లబ్ ఫంక్షన్స్‌కు పోటీపడి విరాళాలు సేకరిస్తూ వేలకొద్దీ ధనాన్ని, కాలాన్ని దుర్వినియోగంచేసే భార్యపట్ల చెప్పరాని విముఖత కలిగింది. సాంఘిక సంక్షేమానికి తమ క్లబ్ ఎంతో పాటుపడుతుందని, ఆర్థికంగా వెనుకబడిన వారికి సహాయ సహకారాలు అందజేస్తుందని తాటి కాయంత అక్షరాలతో పేపర్లో ప్రచారం చేసుకుంటూ ఫోటోలు వేయించుకునే వీరికి... కనీసం సాటి మనిషిపట్ల కాస్తంత కరుణ చూపించలేని వీరికి... నిజంగా హృదయం అంటూ ఉందా? ఉన్నా మిథ్యా నాగరికత ముసుగుల కింద అది కూరుకుని పోయిందా?

ఛ...దీనికి ఒకరిని అర్థించటం ఎందుకు? ఆ ప్రయత్నం ఏదో తనే చేయాలి.

ఓ నిశ్చయానికి వచ్చాడు రావు.

* * *

అనంతంగా పరచుకున్న చీకటిని తీక్షణంగా చూస్తూ కూర్చున్నాడు రావు. క్షణక్షణానికి పెరుగుతున్న సన్నని మంట అతని గుండెలని భగ్గున మండిస్తున్నది. ఆ చీకట్లో తలెత్తి దీనంగా తనవంకే చూస్తున్న రాముడి ముఖం, ఆ కళ్ళల్లో కనిపించే అసహాయత, తన ప్రాణాన్ని కాపాడమని ప్రపంచాన్ని అర్థించే ఆ చూపు పదేపదే గుర్తు వస్తున్నాయి. తనను కబళించేశక్తి ఏమిటో తెలియని ఆ పసివాడి ఆక్రందన, గుండె బరువయ్యే కొలది భరించలేని బాధతో విలవిలలాడుతూ మృత్యువుతో జరిపే




పోరాటం... అన్నీ రావు కళ్ళముందు తిరుగుతున్నాయి. ఎవరి సహాయం అక్కర లేకుండానే రాముడు మృత్యు పాశానికి ఎర అయ్యాడు. ప్రాణం కోసం చేసే పోరాటంలో రాముడు ఓడిపోయాడు.

కాలేజీనుండి వస్తూ హాస్పిటల్‌కు వెళ్ళిన రావుకి కనిపించింది... అలసి పోయి మృత్యువు ఒడిలో శాశ్వతంగా విశ్రాంతి తీసుకుంటున్న రాముడి విగత శరీరం. నిస్సహాయంగా విలపిస్తున్న రాముడి తల్లిదండ్రులను చూసి రావు మనస్సు చెదిరిపోయింది.

అనాదిగా అజేయమైన మృత్యువు ముందు మానవుడు తలవంచక తప్పటం లేదు. వైద్యరంగం ఎంత పురోగమించినా సామాన్యుడికి మాత్రం చేరువ కాలేక పోయింది.

డబ్బున్నవాడిదే ఈ ప్రపంచం.

వాడిదే ఈ జీవితం.

కోరికలు, కాంక్షలు అన్నీ వాడివే.

లేనివాడికి ఏమీలేదు.

లోపల గదిలో ఇందిర నిశ్చింతగా నిద్రిస్తోంది.

రావుకి నిద్ర రావటం లేదు. ఆలోచనలు విడవకుండా సాగుతున్నయ్. ఎన్నో ప్రశ్నలు అంతరంగంలో తల ఎత్తుతున్నాయ్.

వాటికి సమాధానాలను అన్వేషిస్తోంది మనసు.

అనాదిగా మానవుడు ఏర్పరచుకున్న విలువలెన్నో నేడు సమూలంగా దెబ్బ తినే ప్రమాదం ఏర్పడింది. తన జీవిత నౌకకు చుక్కానిగా ఏర్పాటు చేసుకుని వాటినే నమ్ముకుని జీవయాత్ర సాగిస్తున్న మానవుడి పరిస్థితి ఈనాడు అనూహ్యంగా తయారవుతోంది.

ఏ విలువలనైతే నమ్ముకుని వేల సంవత్సరాలుగా జీవన పోరాటాన్ని కొన సాగిస్తున్నాడో అవి ఈనాడు చెల్లా చెదురై పోవటంతో దిక్కుతోచక, గమ్యం తెలియక తప్పుదోవ పట్టిన మనిషి జీవితం ఆందోళనకరంగా తయారవు తోంది.

దీనికి పరిష్కారం ఏమిటి?

మనిషి జీవితం సాఫీగా మళ్ళీ గమ్యం చేరే అవకాశం లేదా?

సాటి మనిషిని ప్రేమించలేని తత్వం మనిషిలో ఎందుకు పెరుగుతోంది?

మనిషి ఇంత స్వార్థపరుడిగా తయారవుతున్నాడే, ఏం బావుకోవాలని?

ఏ విలువలైతే జీవితాన్ని నడిపిస్తాయని విశ్వసించాడో వాటికి బదులుగా వాటి స్థానంలో వ్యతిరేకమైన గుణాలు మనిషిలో ఎందుకు పెరుగుతున్నాయి?

ఈనాడు మనిషి మనిషికీ మధ్య ఏం మిగిలింది?

భవిష్యత్తులో మానవ జీవితం ఏవిధంగా పరిణమించబోతోంది?

* * *

"అలా వున్నావేం సుందరం?"

రావు మాట్లాడలేదు.

"ఏదో ఆలోచనలో వున్నట్టున్నావ్?"

"మాస్టారూ! మిమ్మల్ని ఒక ప్రశ్న అడగనా?"

"అడుగు సుందరం!"

"ప్రస్తుతాన్ని వదలివేస్తే ఇంతవరకూ గడిచిన జీవితం మీకు సంతృప్తికరంగానే వుందంటారా?"

రావు ముఖకవళికల్ని గమనిస్తూ, "ఎందుకలా అడుగుతున్నావ్?" అన్నారు మాష్టారు.

"చెప్పండి మాష్టారూ! ఇంతవరకూ





మీరు సంతృప్తిగానే జీవించారా?"

"ప్రతి వ్యక్తి జీవితంలోనూ ఏవో కొన్ని ఒడిదుడుకులు వుంటూనే వుంటాయి. అయినా నావరకు నేను ఇంతవరకూ ఆనందంగానే జీవించినట్టు లెక్క."

దీర్ఘంగా నిట్టూర్చాడు రావు.

"ఏమైంది సుందరం?" ఆయన కంఠంలో ఆందోళన తొంగిచూసింది.

"ఏంలేదు మాష్టారూ! భయంకరమైన ఒంటరితనం నన్ను భయపెడుతున్నది. ఒక్కొక్కరోజు గడిచేకొద్దీ నాలో ఏదో నిరాశ, భవిష్యత్ జీవితం నన్ను చూసి అపహసిస్తున్నట్లుగా నాలో ఏదో ఆవేదన, ఒంటరిగానే ఈ జీవితాన్ని ముగింపు చేయాల్సొస్తుందేమోననే బాధ...నా చేత మిమ్మల్ని అలా అడిగించింది. అంతే" అతని ప్రతి పలుకులో నిండివుంది నిస్పృహ.

"అదేమిటి సుందరం! భార్య, సంసారం వున్న నీవు ఒంటరివాడవు ఎలా అవుతావు? నాకేం అర్థం కావటం లేదు"

మాష్టారి మాటలకు జీవంలేని నవ్వు అతడి పెదవులపైకి పాకి మాయమైంది.

"మీరన్నట్లు సంసారబంధంలో, ఈ మానవ సంఘంలో బతుకుతున్న మనిషి ఒంటరివాడు ఎలా అవుతాడు? నా చుట్టూ నావారు, నా తోటి మనుషులు వీరంతా లేరా? వున్నారు మాష్టారూ! కాని వీరంతా నా బాహ్య జీవితానికి సంబంధించిన వ్యక్తులు. నా అంతరంగిక జీవితానికి సంబంధించి నా అనేవారునాకెవ్వరూలేరు. నేను ఒంటరివాడిని మాష్టారూ!"

"చిత్రంగావుంది. నీ జీవితాన్ని పంచుకున్న వ్యక్తి నీమనిషేకదూ! నీకెవ్వరూ లేకపోవటమేమిటి?"

"ఆమె నా జీవితాన్ని పంచుకున్నదే కాని నా అంతరంగానికి చేరువకాలేక పోయింది"

"అంటే...?"

"మీకు తెలియనిదేముంది? సాంఘిక

బంధం మమ్మల్ని జతగా బతకమని శాసించింది. హృదయం అందుకు వ్యతిరేకంగా అవధులులేని దూరాన్ని సృష్టిస్తోంది. ఈ రెంటికి సమన్వయం కుదరక ఆంతరంగం నిరంతరం ఒంటరితనంతో ఆక్రోశిస్తున్నది"

"అంటే మీ వైవాహికబంధం మీ మనసుల్ని ముడివేయలేదా సుందరం?"

"ఎలా వేస్తుంది మాష్టారూ? భిన్న ధృవాలైన ఇద్దరు వ్యక్తులమధ్య మానసిక

అనుబంధం పెరుగుతుందంటారా?"

మాష్టారు సమాధానం ఇవ్వలేదు. మౌనం వహించారు.

"సంప్రదాయంకంటే మనిషికి, మనసుకి మీరు ప్రాధాన్యత ఇస్తారని తెలిసి ఈ విషయం చెప్పాను. అపార్థం చేసుకోకండి.

"ఇందులో అపార్థం ఏముంది? కాని సుందరం! అననుకూలమైన పరిస్థితులలోనే ధైర్యంగా జీవించడానికి ప్రయత్నించాలి. నీబాధ నాకర్థం అయింది. కోరినవన్నీ మనిషికి లభించిననాడు జీవితం నిస్సారంగా తోస్తుంది. బాధ అనుభవంలోనికి వచ్చినప్పుడే ఈ జీవితం విలువ మనకు తెలిసివస్తుంది. నీ అంతరంగిక సంఘర్షణను మరోవైపు కేంద్రీకరించి బాహ్య సంఘర్షణనుండి బయటపడటానికి ప్రయత్నించు. నీ ప్రయత్నం వృథాపోదు. ఏదో ఒకనాటికి నీకు మానసిక ఆనందం లభిస్తుంది" ఆప్యాయంగా రావు చేతిని నిమురుతూ అన్నారాయన.

"ప్రస్తుతం నేచేస్తున్నదదే మాష్టారూ" నిట్టూర్చి లేచి నిలబడ్డాడు రావు.

"వస్తాను మాష్టారూ!"

"మంచిది వెళ్ళిరా!"

* * *

మెట్లెక్కి లోపల ప్రవేశించిన రావుకి చిందరవందరగావున్న తన గది స్వాగతమిచ్చింది. తను చదువుకునే టేబిల్ పైన పుస్తకాలు తాను పెట్టిన క్రమంలో లేకుండా చిందరవందరగా వున్నాయి. ఒక పక్కగా వుంచిన చిత్రాలు అస్తవ్యస్తంగా సర్దివున్నాయి. గది తీరు తిలకించిన రావుకి చీకాకు ముంచుకొచ్చింది.

తన రీడింగు రూంలోకి ఎంతో అవసరమైతే తప్ప ఎవరూ రారు. అటువంటిది ఈ గదిలోకి రావలసిన అవసరం ఎవరికి కలిగింది?

క్రమబద్ధతను పాటించే మనిషి రావు. పాటించడమేకాదు ప్రేమిస్తాడు కూడా. తనకు సంబంధించిన పుస్తకాలు వస్తువులు సదా అందంగా సర్దివుంచటం అతని అలవాటు. తన చుట్టూ పరిసరాలు అందంగా, ఆహ్లాదంగా ఉండటం కోసం తానుగా శ్రమించి వాటికి ఒక రూపాన్ని ఇస్తాడు. పరిశుభ్రంగా, అందంగా ఉండే పరిసరాలు మనసుపై ఎటువంటి ప్రభావాన్ని చూపుతాయో రావుకి తెలుసు. మనస్సుకి ఎల్లవేళలా ఒక క్రమ పద్ధతిని అభ్యసింపచేయడానికి కూడా అతను శ్రమిస్తుంటాడు. జీవితంలోగాని, పరిసరాల్లోగాని సౌందర్య రాహిత్యాన్ని అతను భరించలేడు.

కలిగిన చికాకు పక్కకునెట్టి త్వరత్వరగా రూము సర్దనారంభించాడు.

ఇంతలో మెట్లపై పకపక నవ్వులు.

తన భార్యతో పాటు ఎవరిదో కొత్త గొంతుక.

"ఇద్దరూ లోపలికొచ్చారు. వచ్చారా! మీకోసమే ఎదురుచూస్తున్నాను. ఈమె నా ఫ్రెండు మిసెస్ సుధాకాంతారావు. మిస్టర్ కాంతారావు మద్రాస్ ఎయిర్ ఫోర్సులో పనిచేస్తున్నారు'' అంటూ పరిచయం చేసింది ఇందిర.

రంగు పూసిన పెదవులపై తెల్లని నవ్వుని అద్దుకుని కరచాలనంకోసం చేతిని ముందుకు చాపింది మిసెస్ సుధా కాంతారావు.

బాబ్డ్ హెయిర్, స్లీవ్‌లెస్ బ్లౌజు, పలుచని దుస్తులు.





రావుచేతిని ముందుకు చాచక తప్ప లేదు.

అసలే చికాకులో ఉన్న రావుకు ఆమె వేషభాషలు, కర స్పర్శ ఇంకా చీకాకు కలిగించాయి. అయినా ముఖం పైకి నవ్వు తెప్పించుకోక తప్పింది కాదు.

"మీ చిత్రాలు ఎంతో బాగున్నాయి" అదో మాదిరిగా చూస్తూ అంది ఆమె.

ఆ చూపులు రావుని ఇబ్బంది పెట్టాయి. ఇటువంటి పరిస్థితిని ఎదుర్కోవలసి వచ్చినందుకు చికాకు మరింత ఇనుమడించింది.

అయినా సభ్య ప్రపంచంలో కొన్నింటిని ఎరువు తెచ్చుకోక తప్పదు.

"కూర్చోండి!" దగ్గరగా ఉన్న కుర్చీ చూపాడు.

"ఒన్ మినిట్... ఇప్పుడే వస్తాను కూర్చో" అంటూ ఇందిర కిందికి దిగి వెళ్ళింది.

ఆ పరిస్థితిని ఎలా ఎదుర్కోవాలో తోచక తికమకపడసాగాడు రావు. కొంతసేపు మౌనం.

"మీవారు ఎయిర్‌ఫోర్స్‌లో ఏం చేస్తుంటారు?" ఏదో ఒకటి మాట్లాడాలి కనుక అడిగాడు.

ఆమె చెప్పింది.

రావు సమాధానం కోసం ప్రశ్నించ లేదు కనుక కావాలనే వినిపించుకోలేదు కూడా.

"మీ చిత్రాలు ఎప్పుడైనా ఎగ్జిబిషన్స్‌లో ప్రదర్శించారా?"

"ఊఁ... రెండు మూడుసార్లు ప్రదర్శించాను"

"ఎలా వేస్తారవి? ఏదైనా దృశ్యం చూసినపుడు వేస్తారా? లేక ఊహించి వేస్తారా?" ఆమె అడిగే ప్రశ్నలకు రావు చికాకు మరింత పెరిగింది.

సమాధానం ఇవ్వకుండా నవ్వి ఊరుకున్నాడు.

"మీరు చాలా కామ్. ఇందిరలా కాదు మీరు" వయ్యారంగా తల ఎగరేస్తూ అందామె. ఏం మాట్లాడాలో తోచలేదు రావుకి.

ఆమె మాటలు, చూపులు రావుని అసహనానికి గురి చేస్తున్నాయి. ఆ పరిస్థితినుండి త్వరగా బయటపడాలని కోరుకుంటోంది మనసు.

"మీవద్ద చాలా బుక్స్ ఉన్నాయే! ఇవన్నీ చదవటానికి మీకు టైముంటుందా"

రావులో సహనం చచ్చిపోతోంది. ఎలాగో తమాయించుకుంటున్నాడు.

"ఎక్కువగా రాత్రిళ్ళు చదువుతుంటాను"

"మీరు పొయిట్రీకూడా రాస్తారని చెప్పింది ఇందిర"

రావు సమాధానం ఇవ్వలేదు.

పుస్తకాలు సర్దేమిషతో ఒక్కొక్కటే అందుకుని ఒక క్రమంలో పేర్చసాగాడు.

"కవులు అందాన్ని ఆరాధిస్తారట..." కనుబొమ్మలు కొంటెగా ముడివేస్తూ అందామె. కనుకొనలలో నుండి చూశాడామెను.

'అవును. సహజత్వం తొణికిసలాడే అందాన్ని ఎంత ఆరాధిస్తారో, అసహజత్వాన్ని అంత ద్వేషిస్తారు' అందామను కున్నాడు.

కాని అనలేదు.

ఇంతలో ఇందిర రావటంతో గాలి పీల్చుకున్నట్లయింది.

* * *

విశ్వవిద్యాలయం ఆవరణలో లాన్‌లో

కూర్చుని కొండ కిందకు పరచుకున్న ఆకాశాన్ని నిర్విరామంగా కదులుతున్న మబ్బుల దొంతరలను తీక్షణంగా చూస్తున్నాడు రావు.

అంతక్రితమే పొడిపొడిగా రాలిన వానచినుకులకు వాతావరణం అంతా వింత పరిమళం అలుముకుని ఉంది.

లాన్ మధ్యలో అక్కడక్కడా అందంకోసం నాటిన పూలమొక్కల నుండి లేతపరిమళం గాలిలో తేలుతూ వచ్చి రావుని పరామర్శించి పోతోంది.

ఆ చిరుగాలులందించే సువాసనకు అతని హృదయంలో ఏవో సన్నని ప్రకంపనలు! లోపల నరాలు చలించినట్లయి సర్దుకుని వెల్లకిలా శరీరాన్ని వాల్చి ఆకాశ నీలంలోకి చూపులు బరిపాడు.

"ఏమిటోయ్! అంత తదేకంగా చూస్తున్నావ్?" అంటూ వచ్చాడు శ్రీపతి.

లేచి కూర్చుని "నీలాకాశాన్ని" అన్నాడు.

"రోజూ చూసేదేగా"

"నిజమే. రోజూ చూచేదే అయినా నిముషానికొక వర్ణంతో కొత్త అందంతో కనిపిస్తూనే ఉంటుంది"

"ఏమోనోయ్! ఆ అందాలన్నీ నీ వంటి భావుకులకు కనిపిస్తాయేమోగాని నాకుమాత్రం ఆ ఆకాశం, నేల, ఈ చెట్లు నిత్యం ఒకేలా కన్పిస్తుంటయ్"

నవ్వాడు రావు.

"భావుకుడు కూడా నీవంటి మనిషే శ్రీపతీ! ఎటొచ్చీ నీవన్నట్లు భావుకుడు పరిసరాల్ని మనోనేత్రంతో చూస్తాడు. అందుకే సామాన్యుడికి కనిపించని అందాలు అతనికి కనిపిస్తాయి"

"ఏమో! ఈ భావుకత, తన్మయత-ఇవన్నీ నాకర్థంగాని విషయాలు. అయినా ఇవన్నీ రోజూ చూసేవేగా ఏముంది వీటిలో?"

"వేటిలోనైనా, ఏముంది? అని ప్రశ్నించుకుంటే ఏమీ మిగలదు. మన జీవితాల్లో మాత్రం ఏముంది? తినటం, నిద్రించటం, బతుకుతెరువుకై తెల్లారిలేస్తే పరుగులు...ఇవేగా!హృదయంతెరచిచూస్తే వేటిలో మాత్రం ఏంలేదు? ఆ నీలాకాశాన్ని, చుట్టూ కనిపిస్తున్న కొండల్ని, నిర్విరామంగా ఎగిసిపడుతున్న సముద్ర కెరటాల్ని చూస్తుంటే ఆనందంకలగటం లేదూ... కలిగే ఆనందం వదులుకుని ఎందులో ఏమీ లేదంటావేం శ్రీపతీ!"

"ఏమో రావ్! నాకేం కన్పించటం లేదు. బహుశా నీకు కనిపించే అందం నాకు కనబడటం లేదేమో"

"పొరపడుతున్నావు. మనసుని లగ్నంచేసి చూసినపుడు నీకూ కన్పిస్తాయి"

"నీకేమోయ్! నీ జీవితం సాఫీగా గడిచిపోతుంది. తెల్లారిందగ్గర్నుంచి నా మనస్సులో ఎన్ని ఆలోచనలు! ఎంత ఆందోళన? నిత్యజీవిత సమస్యల వైపే అనుక్షణం మొగ్గే ఈ మనస్సుని నీవు చెప్పినట్లుగా చేసి చూడాలంటే ఎలా కుదురుతుంది?"

రావు నోటి వెంట దీర్ఘనిశ్వాసం వెలువడింది"

"ప్రతి వ్యక్తి జీవితంలో ఏవో సమస్యలు వుంటూనే వుంటాయి. అవి నీ ఒక్కడికే పరిమితం కావు. నేననేది వాటికి మించి మనం జీవితాన్ని చూసినపుడే జీవితపు లోతులు, అందాలు మనకు అందివస్తాయి"

"అలా చూసే శక్తి నాకు లేదుమరి.





ఏం చేస్తాం! పద వెళదాం"

లేచి నిలబడ్డారిద్దరు. నడవటం ప్రారంభించారు.

"అన్నట్టు మీ శ్రీమతి ఏమంటున్నది?"

"ఏముంది మామూలే! ఇప్పుడు కొంచెం ఫరవాలేదనుకో. నీవు చెప్పినట్లుగా ఆమెతో కొంచెం సన్నిహితంగా మసలుకుంటున్నాను"

"గుడ్! ఆమెను తీసుకుని సరదాగా రెండు రోజులు ఎక్కడికైనా వెళ్ళలేక పోయావా?"

"వెళ్ళాలి ఎప్పుడో"

"హలో... రావుగారూ!"

వెనుకనుండి వినిపించటంతో తిరిగి చూశాడు.

త్వరగా అడుగులువేస్తూ వచ్చివారిని కలిసింది తెలుగు లెక్చరర్ మాధురీదేవి.

"బావున్నారా!" చిరునవ్వుతో అందామె.

సమాధానంగా నవ్వుతూ తల ఊపి ఊరుకున్నాడు.

ముగ్గురూ కలిసి నడుస్తున్నారు.

"ఈమధ్య మీరేమీ కొత్త కవిత్వం రాస్తున్నట్లు లేదే?" అడిగిందామె.

"అవును. ఇటీవల ఏమీ రాయలేదు"

"నాదొక చిన్న రిక్వెస్టు" అందామె.

"చెప్పండి"

"ఏంలేదు. రేపు సాయంత్రం సరిగా ఈ టైముకి దయచేసి మీరు మా ఇంటికి రావాలి"

"ఏమిటి విశేషం?"

"ఆధునికకవిత్వంపైరీసెర్చికి అప్లయి చేశాను. మీతోమాట్లాడి కొన్ని విషయాలు తెలుసుకుందామని. నేనే మీ ఇంటికే వద్దునుగానీ, నా నోట్సూ, రిఫరెన్సు బుక్సు అన్నీ మోసుకురావాల్సి వస్తుం దని..."

"అంత శ్రమవద్దు... నేనే వస్తాను"

"థాంక్యూ. మరి నేను వస్తాను. బస్సువచ్చింది"

గేటుముందు ఆగిన బస్సు ఆమెను ఎక్కించుకుని ముందుకు కదిలింది.

"మొగుడికి డైవోర్స్ఇచ్చి ఎంత నిబ్బరంగా బతుకుతోందో చూశావా రావు!"

శ్రీపతి కంఠంలో ధ్వనించిన తేలిక భావం రావుని ఇబ్బందిపెట్టింది.

"అదేమిటి శ్రీపతీ! అందుకు ఆమెను అభినందించాలిగానీ..."

"ఇంకా నయం సన్మానించాలన్నావు కాదు. సంసారంలో భర్తతో ఏవో పేచీలువస్తే ఇహ విడిపోవటమేనా ఏమిటి? మన సాంప్రదాయాన్ని గౌరవించవలసిన అవసరం లేదా?"

"భర్తతో ఎంత బాధనెదుర్కోకపోతే ఆమె ఆపని చేసివుంటుందంటావ్! సంఘం దృష్టిలో తనవంటివారి స్థానం ఏమిటో తెలిసీ లెక్కచేయక ఈ సాహసం చేసిందంటే ఆమె ఎంత బాధకు గురి అయిందో"

"ఆ...కొందరు అలాగే ఉంటారు లేవోయ్! ఇటువంటివారికి వారి ఆనందమే తప్ప సంఘం ఏమైతే వీళ్ళకెందుకు?" ఈసడింపుగా అన్నాడు శ్రీపతి.

"ఆమె వ్యక్తిగత జీవితం గురించి మనం ఇలా మాట్లాడుకోవటం బాగాలేదు. అయినా వ్యక్తికన్నా నీవనే సంఘం, సంప్రదాయం ఏమీ గొప్పవి కావులే"

"అంటే సంఘంకంటే వ్యక్తి ఆనందమే గొప్పదంటావా?"

"అవును. నీవుచెప్పే సాంఘిక ఆచా

రాలు సంప్రదాయాలు వ్యక్తికి నిజమైన జీవితాన్ని ఇవ్వలేనప్పుడు అవన్నీ నిరుపయోగమే" దృఢంగా అన్నాడు రావు.

"అంటే నీవనేది తరతరాల మన ఆచార సాంప్రదాయాలు మనిషిజీవితానికి ఉపయోగపడనే లేదంటావా?"

"గతం సంగతి తీసెయ్. కాలం మారింది. కాలంతోపాటుగా మన ఆచార వ్యవహారాలను కూడా మార్చుకోవలసిన అవసరంవుంది. పాతవాటినే పట్టుకు వేలాడితే మనం తిరోగమిస్తామేగాని పురోగమించం"

"నువ్వు ఎన్నయినా చెప్పు... పాశ్చాత్యులకంటె మన సంస్కృతి భిన్నమైంది పవిత్రమైంది కూడా. మనం ఈనాడు మన సంస్కృతిని పాటించకుండా పరాయి సంస్కృతి వెంట పరుగులెత్తడం వల్లనే దేశం ఇలా తగలడుతోంది"

"చిన్నపిల్లవాడిలా మాట్లాడకు.చదువుకున్న నీవే ఇలా మాట్లాడటం క్షమించరాని అజ్ఞానం. నీవనుకునే పవిత్ర సంస్కృతిని పక్కకుపెట్టి కాస్త కళ్ళెత్తి ప్రపంచాన్ని పరికించు... మనం ఏస్థితిలో ఉన్నామో అర్థం అవుతుంది" మందలింపుగా అన్నాడు రావు.

"ఏమోనోయ్! ఈ విషయంలో నీతో నేను ఏకీభవించలేకపోతున్నాను. నీవు ఎంత చెప్పినా నా అభిప్రాయాలు నావే"

"నీ అభిప్రాయాలు నీకుండటం మంచిదే. కాదని ఎవరన్నారు? కాకపోతే మారుతున్న పరిస్థితులను అర్థం చేసుకోమంటున్నాను. వస్తాను మరి"

మిత్రులిద్దరి మార్గాలు వేరవడంతో చెరోవైపు అడుగులు వేశారు.





6

...తన జీవితంలో, హృదయంలో కొత్త ఊపిరి నింపే క్షణాలు లేనేలేవా? జీవితం ఇలా నిస్సారంగా, నిరాశా తమస్సులో కరిగి పోవలసినదేనా? తనలో ఈ ఆరాటం ఏమిటి? అసలు తనకు కావలసినదేమిటి...?

చల్లని నీటితో స్నానంచేసి తెల్లని లాల్చీ ధరిస్తూండగా...

గది వాకిట్లో చప్పుడైనట్లయి వెనక్కి తిరిగి చూశాడు.

"హలో... గుడీవినింగ్"

విష్ చేస్తూ టీ కప్పుతో లోని కడుగు పెట్టింది మిసెస్ సుధా కాంతారావు.

"థాంక్స్" అందుకుంటూగొణిగాడు.

"ఇందిర లేదా?" ప్రశ్నించాడు.

"లేదు. క్లబ్‌కెళ్ళింది. ఏం... నేనున్నానుగా. కాసేపు సరదాగా కబుర్లుచెప్పండి. వింటాను" కుర్చీ లాక్కుని కూర్చుంటూ అందామె.

ఇరకాటంలో పడ్డట్టయింది రావుకి. అయినా పైకి తెలకుండా-

"మరి మీరు వెళ్ళలేదే?" అన్నాడు.

"వెళ్ళేదాన్నే. తలనొప్పిగా వుంటేను, ఈ పూటకు ఇందిరనే వెళ్ళమన్నాను" అదో మాదిరిగా నవ్వుతూ అందామె.

ఆమె చూపుల్లో అంతర్లీనంగా కదులుతున్న భావమేదో రావుని కలవరపెడుతోంది. తనని నిశితంగా గమనిస్తున్న ఆమె చూపులు తట్టుకోలేక ఇబ్బందిగా ఫీలవుతున్నాడు. కొన్ని క్షణాలు ఏం చేయాలో తోచలేదు.

"ఏవో కొత్త పుస్తకాలు తెచ్చినట్టున్నారే?" టేబిల్‌పై వుంచిన బుక్స్ చేతుల్లోకి తీసుకుంటూ అందామె.

"సైకాలజీ కదూ మీ సబ్జెక్టు? అంటే మనసు పోకడలు మీకు బాగా తెలిసే వుండాలే'' విచిత్రంగా కళ్ళను తిప్పుతూ అందామె.

'అవునవును... చాలా బాగా తెలుస్తూంది' అనుకున్నాడు మనసులో

ఇంతలో ఆమె చేతిలో పుస్తకం చటుక్కున కిందకు జారింది. వంగి పుస్తకం తీయబోతుండే ఆమె శరీరంపై గల ఉల్లిపొర పైట తొలగి కిందకు వాలింది. లోనెక్ బ్లౌజ్‌లో నుండి ఆ అర్ధ నగ్న వక్షస్థలం యథేచ్ఛగా ప్రదర్శిత మైంది.

ఆమె కావాలనే అలా చేసిందేమో-అనిపించకపోలేదు రావుకు. అయినా గమనించనట్టుగానే వుండిపోయాడు.

పుస్తకం చేతుల్లోకి తీసుకుని పయ్యెద వయ్యారంగా సర్దుకుంటూ క్రీగంటచూపు విసిరింది.

అసహ్యం ముంచుకొచ్చింది రావుకి. దానిని లోపలే దాచిపెట్టి మనస్సులోనే నవ్వుకున్నాడు.

అందమైన ఆ సాయంసమయం ఆమె సమక్షంలో గడపవలసి వచ్చినందుకు నొచ్చుకున్నాడు.

పైకి ప్రకాశంగా, "మీకుతోచటంలేదల్లే ఉంది. ఏదేనా పుస్తకం తీసుకువెళ్ళి చదువుకోకూడదూ" అన్నాడు తప్పించు కోజూస్తూ.

''చదవటమే?... చంపారు! అదో పెద్ద బోర్...మీరు ఏమైనా కబుర్లు చెప్పండి వింటాను'' గారం ఒలికిస్తూ అందామె.

ఎలా తప్పించుకోవాలో బోధపడలేదు రావుకు.

''నేను అలా సముద్రం ఒడ్డుకు వెళతాను...''

"ఓకే...నేనూ వస్తాను పదండి!'' బయలుదేరింది.

హతోస్మి! ఈమెనుండి ఎలా బయటపడటం?

"రండి'' ముందు తనే దారితీసింది. అనుసరించక తప్పలేదు రావుకి.

అసుర సంధ్యని చూస్తూ ఆలోచిస్తు న్నాడు. ఎందుకీమె ఇలా ప్రవర్తిస్తూంది? చంచలమా? లేక ఎదుటవ్యక్తికి తన ప్రవర్తన ఎంత ఇబ్బందికరంగా ఉందో గమనించలేని అమాయకత్వమా?

చదువుకొని, నాగరిక ప్రపంచంలో జీవిస్తున్న ఈమెకు ఇతరులను ఇబ్బంది పెట్టడం సభ్యత కాదనే విషయం తెలి యదా? లేక కావాలనే అలా చేస్తున్నదా?

తనని గురించి ఏమని తలుస్తోందీమె? తన అవయవ సౌందర్యం చూసి అతిగా ప్రవర్తిస్తాననుకుని ఉంటుంది.

నవ్వు ముంచుకొచ్చింది రావుకి.

"ఏమిటీ...మీలో మీరే నవ్వుకుంటు న్నారు?"

ఆలోచననుండి బయటపడి ఆమె దెస చూశాడు. జాలిలాంటిదేదో కలిగింది.

"ఆ... సుధగారూ! మద్రాసులో ఖాళీ టైమ్‌లో మీరు ఏంచేస్తుంటారు?''

"ఖాళీయా...'' ఫక్కునవ్విందామె.

"అసలు ఖాళీ ఎక్కడ ఉంటుంది? తెల్లారి లేస్తే ఎంత బిజీ! రెస్టు తీసుకోవ టానికి కూడా టైముండదుగదా''

''ఏం చేస్తుంటారేమిటి?" ఆశ్చర్యంగా అడిగాడు.

"ఒకపనా! మా క్లబ్ మెంబర్లం అంతా ఎప్పుడూ ఏదో ఒక కార్యక్రమం జరిపి స్తూనే ఉంటాము"

"అలాగా. మీ క్లబ్ తరఫున స్త్రీలకి




ఏమైనా సహాయ సహకారాలు అంద చేస్తుంటారా?"

"ఎందుకు చేయం? భర్తలు వదిలేసిన వారికి, అత్యాచారానికి గురి అయిన వారికి, ఆర్థికంగా వెనుకబడినవారికి - ఎంతమందికో మా క్లబ్ తరపున సహాయం చేశాం. ముఖ్యంగా స్త్రీ సమాన హక్కులకోసం, స్వాతంత్ర్యం కోసం ఎన్నో కార్యక్రమాలు నిర్వహించాం"

"మంచి పనులే"

పైకి అలాఅన్నా ఆమె చెప్పినవాటిల్లో ఎంత శాతం నిజంగా, ప్రయోజనకరంగా జరిగుంటాయో తెలుసుకాబట్టి లోలోపలే నవ్వుకుని ఊరుకున్నాడు.

ఇంతలో కిందనుండి కారు శబ్దం అవడంతో ప్రాణం లేచి వచ్చినట్లయింది రావుకి.

"ఇందిర వచ్చినట్టుంది...''



"అవును. నేను ఎప్పుడు వదులుతానా అని ఎదురుచూస్తున్న మీ కోరిక నెరవేరింది" విసురుగా అంటూ కిందికి దిగి వెళ్ళిందామె.

నవ్వుకుని కుర్చీలో వెనక్కు వాలాడు.

ఆమె అందమైనదే కావచ్చు!

కాని అలాఅందాన్ని అతిగా ప్రదర్శించ డంలో దాని విలువ పోతుందని తెలియదు పాపం!

అనాదిగా మగవాడిని అందంతో ఆకట్టుకోవాలని చూసే స్త్రీ పురుషుడికి లోకువే.

పురుషుడెపుడూ లభించిన అందాన్ని అనుభవించి, నాశనం చేసి కాలదన్ని పోతాడు.

అయినా స్త్రీ కళ్ళు తెరవటంలేదు.

పురుష ప్రవృత్తిని సరిగా అంచనా వేయక అతని కామానికి బలి అవుతూనే వుంది.

తన సౌందర్యాన్ని పొగడుతుంటే అమాయకంగా పొంగిపోతూ మోసపో తూనే వుంది.

అందానికిగాక ఔన్నత్యానికి తలవంచే పురుషులు ఎందరుంటారు...?

హృదయం స్పందిస్తే ఆ స్పందన నరనరాల్లోకి పాకి ఏ చిన్న చిరునవ్వో, ఏ వేలి స్పర్శో రసతన్మయతని కలిగించదా!

మధురమైన శృంగార అనుభవాల్ని ఇలా బాహాటంగా కావాలని పనిగట్టుకుని ప్రదర్శిస్తే వాటి విలువ తగ్గిపోవటంలేదూ!

ఏమిటో... మనిషి జీవితం నుండి క్రమంగా ఇటువంటి సున్నితమైన అంశాలు కూడా మాయమైపోతున్నాయి.

నిట్టూర్చాడు రావు.

◆ ◆ ◆

"రండి!'' చిరునవ్వుతో ఆహ్వానిందిందామె.

"పిలవగానే నా ఆహ్వానాన్ని మన్నించి వచ్చినందుకు ధన్యవాదాలు" అంది అభిమానంగా కుర్చీ చూపిస్తూ.

మొహమాటంగా నవ్వాడు రావు.

సింపుల్‌గా, అందంగా వున్న ఆ ఇల్లు రావు మనస్సుకి ఆహ్లాదకరంగా వుంది.

"మీరేమీ అనుకోనంటే ఒకమాట"

"చెప్పండి!"

"రీసెర్చికి అప్లయ్ చేసిన మాట నిజమేకాని మిమ్మల్ని మా ఇంటికి ఆహ్వానించిన కారణం మాత్రం అది కాదు''

"మరి..."

"మీ మిత్రుని సమక్షంలో మిమ్మల్ని కారణం లేకుండా ఆహ్వానించటం అపార్థాలకు దారితీస్తుందని అలా చెప్పాను .. మన్నించాలి"

"మరి కారణం ఏమిటో చెప్పారు కాదు...''

"చెబుతాను...మీ వ్యక్తిత్వం,అలవాట్లు చూసి కాసేపు మీతో మనసు విప్పి మాట్లాడదామనే పిలిచాను. మీసంస్కారం పట్ల నాకున్న విశ్వాసం ఇలా చొరవ తీసుకునేందుకు సాహసింపచేసింది. అన్యథా భావించకండి. మీరు సైకాలజిస్టులుగదా! మీనుండి తెలుసుకోదగ్గవి ఎన్నయినా ఉంటాయి"

"......"

"రావుగారూ! నాగురించి మీకు తెలిసే ఉండచ్చు. సాటి ఆడవాళ్లు నా పరిస్థితి అర్థం చేసుకోరు. ఇక పురుషులా? వారిపట్ల నాకు సద్భావం ఏనాడో పోయింది. అఫ్‌కోర్స్ మీ విషయం వేరనుకోండి. ఈ స్థితిలో కనీసం మాట్లాడుకోవటానికి కూడా మనుషులు కరువవడంతో నిరంతరం ఒంటరితనం వేధిస్తున్నది అందుకే మీతో పరిచయం పెంచుకోవాలని ఆహ్వానించాను. నన్ను అపార్థం చేసుకోరనే నమ్మకంతోనే ఈ పని చేశాను" మెల్లగా స్పష్టంగా పలికిందామె.

రావుకి ఆమె పరిస్థితి అర్థంఅయింది.

"కూర్చోండి! నిలబడే మాట్లాడుతున్నారు" అన్నాడు చివరికి. అంతకంటే ఏమనాలో తోచలేదు.

"ఉండండి.టీ తీసుకువస్తాను.మాటల్లో పడి మర్చిపోయాను"

టీ తాగటం పూర్తయింది.

"అన్నట్టు ఎగ్జిబిషన్‌లో మీ చిత్రం 'ఏకాకి' చూశాను. చాలా బాగా వేశారు. మోడై మిగిలిన చెట్టుకింద ఒంటరిగా నుంచొని శూన్యంలోకి చూస్తున్నట్టున్న ఆ వ్యక్తి బొమ్మ చూస్తుంటే హృదయం ద్రవించిపోయింది. నా జీవితంలోగల ఒంటరితనం ఆ బొమ్మలో ప్రతిఫలించినట్లయింది"

"మీకే కాదు మాధురీదేవీ! ఈనాడు ప్రతిమనిషి జీవితంలో ఒంటరితనం పేరుకొనిపోతోంది. ఆధునిక జీవనం మనిషిని ఏకాకిని చేస్తోంది"

"అంటే...? అర్థం కావటంలేదు"

"ఏ సమస్య అయినా లోతుకి వెళ్ళి చూస్తేకాని అర్థంకాదు. ఈనాడు మనిషి మనిషికి మధ్య ఉండవలసిన మానవ విలువలు దెబ్బతిన్నాయి. అందుకే మానవ జీవితంలో ఈ ఒంటరితనం, అశాంతి"

"మీరన్నది నిజమే. సాటిమనిషిని అర్థం చేసుకుని ఆదరించేవారు ఎవరూ కనబడటంలేదు. కనీసం నోటి మాటకు





కూడ మొహం వాచిపోవాల్సివస్తోంది"

"మీరు ఒంటరిగానే ఉంటున్నారా? అంటే నా ఉద్దేశం మీకు తోడుగా ఇంట్లో ఎవరూలేరా అని"

"మా మామ్మ ఉంది. మానాన్నగారు పోయారు. అమ్మ అన్నయ్య దగ్గరే ఉంటున్నది. మామ్మ పెద్దదైపోయింది. రేపోమాపో అన్నట్లుగా ఉంది ఆమె పరిస్థితి"

"మీరు తిరిగి వివాహం చేసుకోవచ్చు నేమో..."

"లేదు రావుగారూ! తిరిగి అటువంటి పొరపాటు చేయను"

"మరి...జీవితకాలం ఇలా ఒంట రిగా..."

"ఫరవాలేదు. వైవాహిక జీవితంకంటే ఇలా బతకటమే బావుంది"

"కావచ్చు... కాని ఎన్నో సమస్యలు ఇబ్బందులు ఎదుర్కోవలసి వస్తుం దేమో"

"వాటన్నింటికిసిద్ధపడే ఈ నిర్ణయానికి వచ్చాను. అయినా స్త్రీ పెళ్ళి, పిల్లలు లేకుండా జీవించలేదంటారా?"

"స్త్రీ అయినా, పురుషుడయినా ఎవరి జీవితం వారిదే. ఎలా జీవించాలన్నది ఎవరికివారునిర్ణయించుకోవలసినవిషయం. వివాహం సాంఘికబంధం. దానివలన జీవితం బాధాకరంగా పరిణమించినపుడు దానినుండి బయటపడి మీలా నిర్ణయించు కోవటమే సరైన పద్ధతి"

"ఇంతకాలానికి మీరొక్కరయినా నా నిర్ణయాన్ని హర్షించినందుకు చాలా థాంక్స్ రావుగారూ!"

"చాలా టైమైంది...నేను వెళ్ళిరానా"

"అలాగే. మనమధ్య స్నేహం ఇలాగే కొనసాగాలని ఆశిస్తున్నాను"

నవ్వి బయటకు నడిచాడు రావు.

* * *

చల్లని వెన్నెట్లో కూర్చునివున్నా హృదయంలో ఆరని అగ్ని ఏదో ఆరాట పెడుతోంది.

తీరని అసంతృప్తి అణువణువునా దొలిచేస్తోంది.

కాలం గడుస్తుంటే ఏదో ఆరాటం...

మనిషి జీవితకాలంలో ఎన్ని క్షణాలు? ఎన్నో కోట్లక్షణాలు...కదలి కాల ప్రవాహంలో కొట్టుకుని పోతూనే ఉన్నాయి.

ఇన్ని క్షణాలు అర్థరహితంగా గడచి పోవల్సిందేనా?

తన జీవితంలో, హృదయంలో కొత్త ఊపిరినింపే క్షణాలు లేనేలేవా....?జీవితం ఇలా నిస్సారంగా, నిరాశా తమస్సులో కరిగిపోవలసినదేనా?

తనలో ఈ ఆరాటం ఏమిటి?

అసలు తనకు కావలసినదేమిటి?

నిరంతరం తనను వెంటాడే అసంతృప్తి నుండి తను బయటపడలేడా?

ఓహ్...

తన నరనరంలో ప్రజ్వలిస్తున్న ఈ ఆర్తి, ఈ తృష్ణ దేనికోసం?

అందిన జీవితంతో తృప్తిచెందక, అందరాని వాటికోసం ఈ ఆరాటం వాంఛనీయమేనా?

తనకున్నాయనుకునే వివేకం, ఆర్జించిన జ్ఞానం, స్పందించేశక్తిగల మనస్సు- ఇవేమీ తనకి జీవితాన్ని ఇవ్వలేకపోవటం ఆశ్చర్యం.

వీటికి అందనిదా జీవితం?

ఇవేమీ జీవించటానికి పనికిరావా?

మరి...పనికివచ్చేవి ఏమిటి?

తనని ఎల్లవేళలా వెన్నంటే ఈ బాధ తనకొక్కడికేనా...?



బాధలేని మనిషంటూ ఉండడేమో?

బాధకూడా ఎన్నోరకాలు.

మానవులంతా ఒకటే అయినా మనిషి మనిషికీ రూపురేఖలలో, జీవనవిధానంలో ఎంతో తేడా.

అభిరుచులలో, ఆకాంక్షలలో, ఆలోచనలలో ఎంతో భిన్నత్వం.

బహుశా ఆ భిన్నత్వంలో ఏకత్వాన్ని చూడగలిగితేనే మనిషికి శాంతి లభిస్తుందేమో...!

అది ఎలా సాధ్యం?

ప్రతిక్షణం ద్వేషాలతో, త్యాగాలతో, ఆకాంక్షలతో, ఆవేదనలతో జ్వలించే మానవ మనస్తత్వం ఏకత్వాన్ని ఎలా చూడగలుగుతుంది?

ఎల్లవేళలా ఎదురయ్యే వైవిధ్యాన్ని తట్టుకుని అన్నింటినీ సమన్వయపరచి చూసే శక్తిని ఎలా సంతరించుకో గలుగుతుంది?

ఇది సాధ్యమా?

క్షణక్షణం కలలతో, కన్నీళ్ళతో నిండిన జీవితం తొణకని తటాకంలా ఉండగలగడం సంభవమేనా?

వైవిధ్యం కోరే మనసే మనిషికి లేకుంటే మనిషి ఈనాడు ఇన్నింటిని సాధించగలిగేవాడేనా?

ఏదో... ఏదో కావాలనీ, దేన్నో పొందాలని, మనస్సు చేసే ఈ తొందర, ఈ తృష్ణ విశ్వవ్యాప్తమై సుదూర గ్రహాంతర యానానికి పురిగొల్పినా, ఆకాశాన్నంటే హర్మ్యాలు నిర్మించినా, విహంగంలా విహార యానం చేసినా, ప్రేయసికై ప్రాణాలు త్యజించినా... ఇంకా...ఇంకా ఏన్నో చేయాలనీ, ఏదో కావాలనీ ప్రేరేపించే మనసే కదూ వీటన్నింటికీ కారణం.

వినువీధి నుండి జారుతున్న ఈ వెన్నెల తనలో కలిగించే ప్రకంపనలు...

తన నరాల్లో ఏదో వత్తిడి...

చలించే తన గుండెల్లో నిర్వచనానికి అందని ఏదో భావం...

ఈ గాలి మృదుత్వానికే కదలిపోయే తన శరీరంలో తలఎత్తే ఏవో కోరికల వాసనలు...

ఇంతే...ఎప్పుడూ ఇంతే. చిన్నతనం నుండీ తనలో వెన్నెలలో కూర్చుంటే ఏదో అలజడి.

ఆ అందాన్ని ఆస్వాదించలేక, కలిగే అలజడిని తట్టుకోలేక సతమతమైపోతుంటాడు.

ఈ వెన్నెల కాంతిలో తన హృదయారాటానికి ఉపశాంతినిచ్చేవారు ఎవరైనా తన పక్కన ఉండి గుండెలలో పొదువుకోగలితే తప్ప ఈ ఆరాటం పోదేమో...!

ప్రకృతి అందాన్ని చూడకుండా ఉండలేడు. చూసి భరించలేడు...ఏమిటీ స్థితి?

అకారణంగా రావు హృదయం ఆర్ద్రమయింది. గుండె లోపల ఏదో బాధ సుళ్ళు తిరిగింది.

తన మానసికస్థితి తనకే అర్థం కాకుండా ఉంది. కాలం గడిచేకొంటీ ఒంటరితనపు పొరలలో కూరుకుని పోతున్నట్లూ, దానినుంచి ఎన్నటికీ బయటపడలేనట్లుగా ఏదో అశాంతి నరనరం పాకింది.

దేనికోసం ఈ తపన?

ఎందుకీ అసంతృప్తి?

సమాధానంలేని ప్రశ్నలు తిలెత్తాయి....

మనిషి జీవితానికి ఏమైనా అర్థం




ఉందా? ఉంటే ఏమిటది?

అర్థవంతమైన జీవితం అంటే ఎలా ఉంటుంది?

ఏవో కొన్ని అభిరుచుల్ని, ఆశయాల్ని పెంచుకుని జీవించడమేనా జీవితమంటే?

ఇంతకుమించి ఏమీ లేదా...? లేకుంటే తనను కాల్చే ఈ అశాంతి ఏమిటి?

అనుక్షణం అశాంతి మంటలలో తన హృదయం దగ్ధం అవుతున్నా పైకి నిశ్చలంగా ఉండటంకోసం ప్రయత్నిస్తున్నాడు. ఈ నిశ్చలత వెనుకగల ఆరని ఆర్తి ఎవరికి అర్థం అవుతుంది?

మానసం నిరంతరం - వైవిధ్యాన్ని కోరుతుంటే వాస్తవ జీవితం అందుకు భిన్నంగా ఉంది.

దీనిని తాను మార్చుకోలేడా?

ఎలా? అది తనకు సాధ్యమౌతుందా? తన ఒక్కడి శక్తి సరిపోతుందా?

తనహృదయారాటాన్ని అర్థంచేసుకొని ఊరట నిచ్చే వారుంటే తప్ప తానీ జీవయాత్రను సాగించలేడు.

కాని ఎవరున్నారు తన అండన?

తనకు స్ఫూర్తినిచ్చి ముందుకు నడిపే దివ్యశక్తి తనకు కావాలి.

జీవన ప్రవాహం ఆగి పోకూడదు.

ఆగిపోతే జీవితం స్తంభించిపోతుంది. స్తంభించిన జీవితం మృతప్రాయం.

లేదు...లేదు... అటువంటి పరిస్థితి రానీయకూడదు. చూస్తూచూస్తూ జీవితాన్ని నీజేతులా జారవిడుచుకోకూడదు.

తన సర్వశక్తుల్ని కేంద్రీకరించి జీవన ప్రవాహాన్ని ఆనందసీమల వెంట, శాంతి శిఖరాల దిశగా మళ్ళించాలి.

అంతవరకూ ఈ జీవితంతో పోరాటం తప్పదు.

ఈ క్రమంలో తన జీవితకాలం ముగిసినా తాను వెనుకంజవేయక జీవితానందాన్ని దక్కించుకోవాలి.

స్తబ్దంగా, స్థాణువులా, చైతన్య రహితంగా బతకటం తనవల్లకాదు. నిరంతరం చలించే తన హృదయం మూగపోకూడదు.

ఆనందం అందివచ్చినా, విషాదం వెక్కిరించినా తన గుండె స్పందించి వాటి లోతుల్ని పసిగట్టాలి.

జీవితం అణువణువునూ శోధించి తనకు కావలసిందిసాధించాలి. రావు నిట్టూర్చేడు.

* * *

"ఒంట్లో బాగాలేదా మాష్టారూ?

"కొంచెం బడలికగా ఉందోయ్!"

"డాక్టరు దగ్గరకు వెళదామా?"

"దీనికి డాక్టర్లు ఎందుకు సుందరం! వయస్సు అయిపోయినవాడిని - ఇంకా డాక్టర్లు, మందులు ఎందుకు చెప్పు"

రావు మాట్లాడలేదు. మాష్టారి శరీరంపై వృద్ధాప్యపు ఛాయలను చూస్తున్నాడు. ఆరోగ్యం, దారుఢ్యం నిండిన శరీరంతో, గంభీరంగా ధ్వనించే కంఠస్వరంతో పద్యాలు చదివి వినిపించే తన చిన్ననాటి మాష్టారి రూపాన్ని ఈనాటి శుష్కించిన వృద్ధ శరీరంలో వెతుక్కుంటున్నాడు.

"మౌనం వహించావేమిటి సుందరం! ఏమైనా మాట్లాడు"

వలిచిన బత్తాయిపండు తొనలను మాష్టారికి అందిస్తూ, "ఏం మాట్లాడను?" అన్నాడు రావు.

"ఏదో ఒకటి. ఏమిటో ఈమధ్య మనసు బాగుండటం లేదు. దిగులుగా, బెంగగా ఉందోయ్!"

నిట్టూర్చాడు రావు. ఒంటరితనపు కోరలలో చిక్కుకొని అసహాయంగా ఆక్రందనచేసే ప్రాణి ఆవేదన ఆమాటలలో

ధ్వనించింది.

"అలా సముద్రపు ఒడ్డుకి వెళదామా?" బాధనుండి మనసు మళ్ళించాలనే ఉద్దేశంతో అడిగాడు.

"అలాగే...వెళదాంపద!" నెమ్మదిగా లేచి నిలబడ్డారాయన.

అనంతమైన జలవాహినికభిముఖంగా కూర్చున్నారిద్దరూ. ఎర్రటి ముసుగు వేసుకున్న పడమటి ఆకాశం కాంతి నీటి కెరటాలపై చిందీ చిత్రంగా ప్రతిఫలిస్తున్నది. చల్లటిగాలి శరీరాన్ని, మనసుని సేదతీరుస్తున్నది.

"సుందరం! నాపట్ల నువ్వు చూపిస్తున్న ఆదరణకు ఎలా కృతజ్ఞతలు చెప్పాలో తెలియటం లేదు"

"అలా అనకండి. మీకన్నా చిన్నవాడినైన నాకు కృతజ్ఞతలు చెప్పటం ఏమిటి మాష్టారూ!"

"నిన్ను చూస్తుంటే మనుషులపట్ల నశించిపోయిన విశ్వాసం తిరిగి తలెత్తుతోంది. మనిషి మనిషికీ మధ్య మమత నశించిననాడు మానవ జీవితం వ్యర్థం సుందరం! నీవంటి శిష్యుడున్నందుకు ఎంత ఆనందంగా ఉందో చెప్పలేను. ఆ ఆనందంలో కించిత్ బాధ లేకపోలేదు"

"అదేమిటి మాష్టారూ బాధెందుకు?"

"నీగురించే బాధ! నీ జీవితం నీవు కోరినట్లు ఉండాలని, జీవితాంతం వరకూ నీవు ఆనందంగా గడపాలని ఉంది. కాని...అందుకు విరుద్ధంగా నీ వదనంలో ఏవో విషాద ఛాయలు కనిపిస్తూనే ఉన్నాయి" రావు ముఖంలోకి పరీక్షగా చూస్తూ అన్నారాయన.

"లేదు మాష్టారూ! నేను ఆనందంగానే ఉన్నాను"

"నాకు అమాత్రం తెలియదా! నీవెంత ఆనందంగా ఉందీ నీ ముఖమేచెబుతోంది"

"అందిన జీవితంతో సర్దుకుపోవాలనే ప్రయత్నాన్ని నేను విస్మరించటంలేదు మాష్టారూ! కాని నా అంతరంగం నా ప్రయత్నానికి విఘాతం కలిగిస్తూనే ఉంది"

మాష్టారుకి ఏం మాట్లాడాలో తోచ లేదు.

"నా చుట్టూ ఉండేవారికి నా జీవితం ఏలోటూ లేకుండా సాగుతున్నట్లేలెక్క. సంఘం దృష్టిలో నాకన్నీ ఉన్నట్లేకాని నా హృదయం ఆశించే ఆదరణకు, ఆప్యాయతకు నేను నోచుకోలేదు మాష్టారూ"

"ఇద్దరు వ్యక్తుల మధ్య మనసులు ముడిపడితేనే– ఒకరినుండి ఒకరికి నీవు చెప్పేవి లభ్యం అయ్యే అవకాశం ఉంది. ఆ అవకాశం లేనప్పుడు జీవితంనిస్సారమై మోడుబారిపోతుంది అయినా నీవంటే ఏమిటో ఆమెకు అర్థం కాలేదంటే ఆమె అందే ఏమిటో తేలిగ్గా ఊహించవచ్చు. ప్చ...ఏమిటో ఈ జీవితాలు...?"

"నా ఆవేదనకు ఆమెదే పూర్తిబాధ్యత అని చెప్పలేను మాష్టారూ! ఇద్దరు వ్యక్తుల మధ్య భిన్నత్వం చోటు చేసుకోవటం సహాజమైన విషయం. ఆమె ఏది ఆనందమని నమ్మిందో దానిని అనుసరించటం తప్పని మనం అనగలమా?"

మాష్టారు మౌనం వహించారు. కొంతసేపు ఇద్దరి మధ్యా నిశ్శబ్దం.

"నా వేదనకు కారణాలు చాలా ఉన్నాయి మాష్టారూ! ఒక విధంగా నా స్వభావం నన్ను ఎక్కువ బాధిస్తున్నది. పరిస్థితులతో సర్దుకుపోలేక, నాకు నచ్చిన పరిస్థితిని ఏర్పించుకోలేక సతమతమౌతున్నాను. ఏదో ఒకనాటికి పరిస్థితిని అధిగ

మించగలననే విశ్వాసం నాకుంది''

దీర్ఘంగా నిట్టూర్చి నిలబడ్డారు మాష్టారు.

"చీకటి పడుతోంది...పద వెళదాం''

* * *

స్టాఫ్‌రూమ్‌లో కూర్చుని ఉదయం నుండి మనసులో సుళ్ళు తిరుగుతున్న భావసంచయానికి ఒక రూపం ఇవ్వాలనే ప్రయత్నంలో నిమగ్నమై ఉన్నాడు రావు.

ప్యూన్ వచ్చి విజిటర్స్ రూమ్‌లో తనకోసం ఎవరో వెయిట్ చేస్తున్నారని చెప్పటంతో ఆ ప్రయత్నం మానుకుని ఆవైపుగా అడుగులు వేశాడు.

"అరె! కరుణాకరం... నువ్వా?" ఆశ్చర్యానందాలతో మిత్రుణ్ణి ఆలింగనంలోకి తీసుకున్నాడు రావు.

మిత్రుడి ఆత్మీయతను అనుభవించిన కరుణాకరం శరీరం పులకించింది.

"ఎన్నాళ్ళకి ... ఎన్నేళ్ళకి ...?'' మాటలు పెగలలేదు రావుకి.

అదే పరిస్థితిలో వున్న కరుణాకరం కెప్పర్లిల్లి చిరునవ్వు నవ్వాడు.

మిత్రుని వదనాన్ని ఆనందంగా తిలకిస్తున్న రావు ఆ చిరునవ్వులో కించిత్ విషాదం తొంగిచూసినట్లై కనుబొమ్మలు చిట్లించాడు.

"కూర్చో కరుణా! ఇంటికెళదాం. ఇప్పుడే నేను అయిదు నిమిషాల్లో వచ్చేస్తాను" కుర్చీ చూపించి బయటకు నడిచాడు.

కొంతసేపైన తర్వాత యూనివర్శిటీ మెయిన్‌గేటు దాటి రోడ్‌పై అడుగు పెట్టారు.

గాలి స్థంభించి ఉక్కపోతగా వుంది, ఇంటి వద్ద వాతావరణం.

గులాబీ మొక్కల పక్కగా రెండు కుర్చీలు వేసి మధ్య టీపాయ్ అమర్చి టీ తీసుకురమ్మని చెప్పటానికై వంటగది వైపుగా వెళ్లాడు రావు.

వెనుకనుండి కన్పిస్తున్న రావు గంభీర మూర్తిలో, అప్పటికి ఇప్పటికి చెక్కు చెదరని నిశ్చలతను గమనిస్తున్న కరుణాకరం హృదయంలో మిత్రునిపట్ల అభిమానం వేయింతలుగా పెరిగింది.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్?" అంటూ వచ్చి కూర్చున్నాడు రావు.

"ఆలోచించడంలేదు...చూస్తున్నాను"

"ఏం చూస్తున్నావు?"

"పరిసర సౌందర్యాన్ని, మిత్రుని హృదయ సౌందర్యాన్ని"

"ఆగాగు... అంత పెద్ద మాటలు వాడబోకు. ఆ తరువాత పశ్చాత్తాప పడతావు" హాస్యంగా అన్నాడు రావు.

"లేదు రావ్! ఆ అవసరం కలగదనే నా నమ్మకం"

నవ్వాడు రావు.

"సరేగానీ ... ఇక నీ విషయాలు చెప్పు" ఆప్యాయంగా మిత్రుని చేతిని చేతిలోకి తీసుకుంటూ అన్నాడు.

"ఏమున్నాయ్ చెప్పటానికి! ఇన్నేళ్ళుగా నిన్ను చూడాలనివున్నా ఇటువైపు రాలేక పోయాను. మా పిల్లలిద్దరి చదువుల విషయం అప్పుడప్పుడు నీకు లెటర్స్‌లో రాస్తూనే వున్నాను కదా"

"అన్నట్టు మీ శ్రీమతిని, పిల్లలని నేను చూడనేలేదు''

"అవునుకదూ! చూద్దువుగానిలే!'' నవ్వుతూ అన్నాడు కరుణాకరం.

అంతలో మధు అటువైపుగా రావడంతో రావు కొడుకుని దగ్గరకు పిలిచాడు.

"మధూ! కరుణాకరం అంకుల్ వచ్చారు చూశావా?"

"ఏం మధూ! నేను గుర్తున్నానా?"

ఆ ప్రశ్నకు ఏం జవాబు చెప్పాలో తోచక గుర్తుతెచ్చుకోవటానికి ప్రయత్నిస్తూ చేతులు జోడించి నమస్కరించాడు మధు.

"దాదాపు పదేళ్ళయింది కదూ మనం కలసి. అప్పుడు చిన్నవాడు మధు అతనికేం గుర్తుంటుందిలే" అన్నాడు కరుణాకరం.

వంటతను టీతో రావడంతో కప్పులందుకుని ఇద్దరికి చెరో కప్పు ఇచ్చాడు మధు.



మిత్రుని ఆగమనంతో తండ్రిముఖంలో కనిపిస్తున్న ఆనందాతిరేకాన్ని సంభ్రమంగా చూస్తూ నిలబడ్డాడు మధు.

"కూర్చో బాబూ...ఛైర్ తెచ్చుకో" అన్నాడు కరుణాకరం.

"లేదంకుల్...నేను వెళ్ళాలి" చిన్నగా సమాధానం చెప్పి లోపలకు నడిచాడు.

"రావ్! నీ కొడుకుని చూస్తుంటే అచ్చు మన కాలేజీ రోజుల్లో నీ రూపం గుర్తొస్తోంది. నా అల్లుడిగా చేసుకోవాలని ఆశగా ఉందోయ్''

"అంతదూరం వెళ్ళకు" నవ్వాడు రావు.



"వాళ్ళు మన పిల్లలే అయినా వారి వ్యక్తిగత జీవితంలో మన ప్రమేయం అంత మంచి ఫలితాలను ఇవ్వదు''

"అంటే మన అభీష్టాన్ని వాళ్ళు అంగీకరించరంటావా?"

"కరుణా! వారి జీవితంలో తీసుకోవలసిన ముఖ్యమైన నిర్ణయాలను వారికే వదలివేయటం మంచి పద్ధతి"

"నీవు చెప్పింది నిజమేలే. అయినా ఇంకా టైముందిగా. ఈలోపు ఎవరి అభిరుచులు ఎలా ఉంటాయో?'' కుర్చీలో వెనక్కి వాలుతూ అన్నాడు.

ఇద్దరి హృదయాల్లో గతకాలపు జ్ఞాపకాల పరిమళం వ్యాపించగా దానిని ఆస్వాదిస్తున్నట్టు మిత్రులిద్దరిమధ్య కొంత సేపు మౌనం. ఆ మౌనాన్ని ఛేదిస్తూ ఏవో ప్రశ్నలు అడగాలనిపించినా అడగలేక, ఏదో ఉద్వేగపు తెర వారి గుండెలని కమ్మి గొంతు పెగలనీయటంలేదు

"అన్నట్టు కరుణా!'' హఠాత్తుగా అన్నాడు రావు.

"ఏమిటి?" అన్నట్టు చూశాడు కరుణాకరం.

"కాలేజీ రోజుల్లో నువ్వు పాటలు పాడేవాడివి కదూ! ఒక పాట పాడకూడదూ?"

"ఇప్పుడా...ఇంకా నయం! నేను పాడగలననే సంగతి నువ్వు అనేదాక నాకు గుర్తే లేదు"

"అదేమిటి? ఎంత బాగా పాడేవాడివి! నీకిష్టంకదూ సంగీతమంటే?"

"హు ... నా ఇష్టాయిష్టాలని ఏనాడో మర్చిపోయాను" నిట్టూర్చాడు కరుణాకరం.

"అందే?" అర్థం కానట్టు చూశాడు రావు.

"గొంతెత్తి హాయిగా పాడుకోవటం నాకెంతో ఇష్టం.అలాపాడుకోగలిగింది మన కాలేజీ రోజుల్లోనే. ఆ తర్వాత కాలంలో అలా పాడుకోవాలని ఎన్నడూ అన్పించలేదు"

"ఎందుకని?"

నవ్వాడు కరుణాకరం. ఆ నవ్వులో తొంగి చూసిన నైరాశ్యం రావు కంట పడకపోలేదు.

"లభించిన జీవితం ఆ విధంగా పాడుకోనివ్వలేదు"

"అంటే...సమయం దొరక్కనా?"

"కాదు. హృదయంలో ఆనందం పలక్క"

"అర్థం కాలేదు"

కరుణాకరం సమాధానం చెప్పలేదు. మౌనం వహించాడు.

సంధ్యా కాంతి క్షీణించి చీకటి వ్యాపించసాగింది.

మల్లెపొదను స్పృశించి వచ్చిన గాలి తెమ్మెర లేత పరిమళాన్ని మోసుకొచ్చి మిత్రులిద్దరికీ అందించిపోతోంది. రావు [illegible] తెల్లని లాల్చీ మరింత తెల్లగా మెరుస్తోంది.

మౌనంగా కూర్చున్న మిత్రుని ముఖకవళికల్ని తీక్షణంగా గమనిస్తున్నాడు రావు.

"ఇంట్లోకి వెళదామా?" మెల్లగా అన్నాడు.

"వద్దు. ఇక్కడే కూర్చుందాం"

"ఏమిటంత దీర్ఘాలోచన?"

"రావ్! నీవు ఎన్నో పుస్తకాలు చదువుతావు కదా... ఈ ప్రశ్నకు సమాధానం చెప్పు"

"ఏమిటా ప్రశ్న?"

"జీవితానికి ఏమైనా అర్థం ఉందంటావా?"

చీకటిని వెలిగిస్తూ రావు పెదవులపై చిరునవ్వు మెరిసింది.

"అబ్బో... పెద్ద ప్రశ్నే వేశావు!"

"హాస్యం కాదు రావ్! నాకు జవాబు కావాలి" సీరియస్‌గా అన్నాడు.

మిత్రుని ముఖంలోకి చిత్రంగా చూశాడు రావ్.

"నీవడిగిన ప్రశ్న అంత సులభమైంది కాదు. వెంటనే జవాబు చెప్పటం కష్టం"

"లేదు... నీవు చెప్పగలవు. నీవు చదివే పుస్తకాలద్వారా ఈ ప్రశ్నకు జవాబు నీకు తెలిసే ఉంటుంది"

నవ్వాడు రావు. "నువ్వూ చదువుతావుగా?"

కరుణాకరం మాట్లాడలేదు.

"పుస్తకాలనుండి నేర్చుకున్న జ్ఞానంతో నీ ప్రశ్నకు జవాబు చెప్పగలనని నేను అనుకోవటంలేదు. జీవితం నేర్పే జ్ఞానం వేరు, పుస్తకాలు నేర్పే జ్ఞానం వేరు"

"అంటే పుస్తక జ్ఞానం జీవితానికి ఉపకరించదనా?"

"ఉపకరిస్తుంది. కాని నీ ప్రశ్నకు సమాధానం జీవితానుభవం నుండే





లభిస్తుంది తప్ప పుస్తకాలనుండి కాదు''

"సాహితీ సృష్టి జరిగేది అయినా రచయితల జీవితానుభవాలనుండే కదూ!"

"నిజమే...కాని వారి అనుభవాలు మన అనుభవాలు ఎలా అవుతాయి?"

"అంటే స్వీయానుభవంనుండి తప్ప మనం ఏవిషయం గ్రహించలేమంటావా?"

"ఎదుటివారి అనుభవాలనుండి మనం గ్రహించేది కొంతమేరకే. మన అనుభవంనుండి గ్రహించే సారం ఎంతో లోతైనది. గాఢమైనదీ కూడా"

''ఇంతకీనా ప్రశ్నకుసమాధానం...''

రావు ముఖంలో గంభీరత అలుముకుంది.

"కరుణా! జీవితానికి, అర్థాన్ని, పరమార్థాన్ని వెతుక్కోవలసిందే, వుందా, లేదా అని నిగ్గు తేల్చుకోవలసింది ఎవరికి వారే"

"కావచ్చు. కాని నాకు నీనుండి సమాధానం వినాలనివుంది"

"నా అనుభవాలద్వారా నే చెప్పే సమాధానం నీకెలా ఉపకరిస్తుంది? నీ ప్రశ్నకు సమాధానం నువ్వే అన్వేషించాలి"

"అంతేనంటావా?"

''అంతే!'' చిరునవ్వుతో అన్నాడు రావు.

''అయినా ఇప్పుడెందుకీ తాత్విక చర్చ? కొంపతీసి వైరాగ్యం అభ్యసిస్తున్నావా ఏమిటి?"

కరుణాకరం మాట్లాడలేదు.

"లోపలకు వెళదాం పద" అంటూ రావు లేచి నిలబడ్డాడు.

ఇద్దరూ లేచి రావు రూములోకివెళ్లారు. లోపలకు అడుగుపెడుతుండగానే ఆ గది తీరు కరుణాకరానికి ఆహ్లాదంగా అనిపించింది. మిత్రుని అభిరుచిని మనసులోనే అభినందించాడు.

కాసేపు రావు గీసిన బొమ్మలు చూసి, కవిత్వం చదవగావిని భోజనానికి లేచారు. మెట్లుదిగి కిందకు వస్తుండగా అప్పుడే క్లబ్‌నుండి వచ్చిన ఇందిర ఎదురైంది.

"నమస్కారం'' అన్నాడు కరుణాకరం.

"ఎవరు?'' అన్నట్లు ప్రశ్నార్థకంగా కనుబొమలు ముడివేసి చేతులు జోడించిందామె.

''మన కరుణాకరం మర్చిపోయావా?" భార్యతో అన్నాడు రావు.

జ్ఞాపకం రాకపోయినా సభ్యతకోసం, 'అలాగా' అనక తప్పలేదు ఆమెకు.

"ఇందిరా ... నువ్వూ రాకూడదమ్మా! కలిసి భోంచేద్దాం" భార్యను పిలిచాడు.

"నేను ఇప్పుడు తినను. మీరు భోం చేయండి" అంటూ మెట్లెక్కి పైకి వెళ్ళిందామె.

విస్మయంగా చూశాడు కరుణాకరం.

"రా కరుణా! మనం భోంచేద్దాం" డైనింగ్ టేబిల్ దగ్గరకు నడిచాడు.

వంటతను ఇద్దరికీ భోజనం వడ్డించాడు. స్వయంగా తనే గిన్నెలలోని కూరలు ఆప్యాయంగా మిత్రుని ప్లేటులో వడ్డించి తను కూడా తినటానికి ఉపక్రమించాడు.

తింటున్న రావు ముఖంలో ఏదో వెతకటానికై ప్రయత్నిస్తున్నాడు కరుణాకరం.

"మీ ఇంట్లో మీ శ్రీమతే వంట చేస్తుందా" అడిగాడు రావు.

"మరి వంటతన్ని పెట్టుకునే తాహతు నాకెక్కడిది?"

"ఇటీవల ఏమైనా కొత్త పుస్తకాలు చదివావా కరుణా?" సంభాషణ మార్చాడు.

"లేదు"

"అదేమిటీ...నీ అభిరుచులన్నింటికీ తిలోదకాలు ఇచ్చినట్టున్నావే?"

"ఆ... పెళ్ళిచేసుకున్ననాడే అన్ని అభిరుచులు అంతరించాయి"

"నీవనేది నాకు అర్థం కావటంలేదు. పెళ్ళికి, నీ అభిరుచులికి సంబంధం ఏమిటి?"

"ఎందుకు లేదు. పెళ్ళి నా వ్యక్తిగత అభిరుచులకు ప్రతిబంధకంగా తయారయింది"

"ఎట్లా?"

"నీకు తెలియంది ఏముంది! మన వివాహ వ్యవస్థ వ్యక్తుల్ని బానిసలను చేస్తుందనే విషయం నీకు తెలియకనా?"

తలెత్తి ఆశ్చర్యంగా, మిత్రుని ముఖంలోకి చూశాడు రావు.

చూపు తప్పించి తినటంలో నిమగ్నమయ్యాడు కరుణాకరం.

భోజనం ముగించి ఇద్దరూ లేచారు.

ఇద్దరికీ డాబాపై పక్కలు ఏర్పాటు చేయించాడు రావు.

మంచం మధ్యలో కూర్చుని సిగరెట్ కాలుస్తూ పిట్టగోడనానుకుని నిలబడ్డ మిత్రుణ్ణి చూస్తున్నాడు రావు.

ఆకాశంలో అర్థచంద్రుడు ప్రయాణిస్తున్నాడు.

లేత వెన్నెల కాంతి మంచంపై పరవబడ్డ తెల్లదుప్పటిని మరింత తెల్లగా వెలిగిస్తోంది.

సిగరెట్ పారేసి వచ్చి రావుకెదురుగా మంచంపై కూర్చున్నాడు కరుణాకరం.

"రావ్! నేను ఇక్కడకు ఎందుకొచ్చానో తెలుసా?"

"తెలియదు"

"మనశ్శాంతి కోసం.. నీతో రెండు రోజులు గడిపి మరచిపోయిన నన్ను నేను గుర్తు తెచ్చుకోవాలని. మన కాలేజీరోజుల్ని మననం చేసుకోవాలనీ వచ్చాను"

"......"

"నిన్నూ, నీ జీవితాన్ని చూస్తుంటే నా మనసుకు ఎంతో ఉపశమనంగా ఉంది పోగొట్టుకున్నదేదో పొందినట్లుగా ఉంది" బరువుగా ధ్వనించింది కరుణాకరం కంఠం.

"ఏమైంది నీకు కరుణా!" లాలసగా అడిగాడు రావు.

"ఏమిటో ... అసంతృప్తి పెరిగిపోతోంది"

"ఎందుకని?"

"భార్యాభర్తలు భిన్నధృవాలైతే ఆ సంసారం ఆనందకరంగా సాగుతుందంటావా?"

ఉలిక్కిపడ్డాడు రావు.

"అంటే?"

"ఏముంది...జీవితం అంటే తెలియని వయస్సులో వివాహం చేసుకుంటే దాని ఫలితం బతికినన్నాళ్ళూ బాధను భరించడమే"

"అంటే నీ భార్య ..." వాక్యం పూర్తి చేయలేదు రావు.

"పూర్తిగా నా భావాలకు,స్వభావానికి విరుద్ధమైనది"

నిట్టూర్చాడు రావు.

"రావ్! నీకు తెలుసు నా స్వభావం! భార్య అనే బంధాన్ని నాచుట్టూ బిగించి బానిసత్వం చేయమంటే నావల్లకావటం లేదు"

"......"

"ఆమెది అదోరకం స్వభావం. ఎదగనిమనస్తత్వం.స్వార్థంపాలుఎక్కువ. ఈ సంగతి గ్రహించేటప్పటికే అంతా అయిపోయింది. ఇప్పుడు కేవలం ఆ





బంధానికి తల ఒగ్గి ఉండటం తప్ప ఆనందం అనేది ఏ కోశానా లేకుండా పోయింది''

"చిత్రంగా మాట్లాడుతున్నావు! ఈ దేశపు పురుషుడిలా మాట్లాడటంలేదు'' నవ్వుతూ అన్నాడు రావు.

"నీ ఉద్దేశం...ఇక్కడ పురుషుడిదే పైచేయి అనికదూ! పొరపడుతున్నావు. అది ఒకప్పుడు. ఇప్పుడు పరిస్థితి మారే కొద్దీ పురుషుడిలో సంస్కారం పెరిగే కొద్దీ అది అతనికి బాధగానే పరిణమిస్తున్నది"

"ఎలా?''

''ఏముంది, కాస్తోకూస్తో సంస్కారం గలవాడు భార్యను బానిసగా చూడకఆమె వ్యక్తిత్వాన్ని గుర్తిస్తాడు. ఆమె స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు అడ్డురాడు. దీనిని ఆసరా చేసుకొని భార్య భర్తనే బానిసగా చేసుకోవాలనుకుంటున్నది"

"పరిస్థితి తలకిందులవుతుందన్న మాట" నవ్వాడు రావు.

"ఆ... అంతే! భార్యా బానిసత్వం పోయిభర్త బానిసత్వం నెరిపే రోజులు వచ్చాయి"

"దీనికి కారణం ఏమిటో గ్రహించావా?"

"కారణం ఏమైనా, నా అనుభవాన్ని బట్టి అసలు మన వివాహ వ్యవస్థలోనే బ్రహ్మాండమైన లోపం ఉందంటాను''

"ఏమిటో అది?''

"ఒకరి భావాలు ఒకరు తెలుసుకోకుండా, పరిచయం లేకుండా కళ్ళు మూసుకుని పెద్దవాళ్లు చెప్పినట్లు పెళ్ళిచేసుకోవటం ప్రధానమైన తప్పు"

"మరి ఎలా? ఆడామగా కలిసి తిరిగి ఒకరినొకరు అర్థం చేసుకునే స్థాయికి మనం ఇంకా ఎదగలేదుగా?''

''ఇప్పుడు ఫర్వాలేదనుకో. మన రోజుల్లో కన్న ఆ పరిస్థితి ఇప్పుడు కొంత మెరుగైంది''

"కలిసిమెలిసి తిరిగే పరిస్థితి మెరుగు పడినా దృక్పథాల్లో మార్పు రావటం లేదుగా"

"ఏమిటో రావ్! తోడుగా ఒకరున్నా మనసులో ఒంటరితనం పెరిగిపోతోంది. ఆ ఒంటరితనాన్ని భరించలేక నీ దగ్గరకు పరుగెత్తుకు వచ్చాను. వయసు పెరిగే కొద్దీ అశాంతి పెరుగుతోందేగాని తగ్గటం లేదు. బాధ్యతలు దృష్టిలో పెట్టుకుని మనమే సర్దుకుపోవాల్సి వస్తోందికాని అవతలి వ్యక్తులు మాత్రం కాస్తన్నా ఎదగటంలేదు"

తనలో రేగే బాధను ఎలా చెప్పాలో అర్థం కావటంలేదు కరుణాకరానికి.

కరుణాకరంవంటివారికి అంతరంగిక జీవితంలో ఉండే సున్నితమైన సమస్యల్ని మాటలలో చెప్పటం కష్టం. కలిసి బతికే వ్యక్తుల మధ్య స్వాభావికమైన అంతరాలు సున్నిత మనస్కుల్ని తీవ్రంగా గాయపరుస్తాయి. వాటిని పైకి చెప్పుకోలేక బాధను భరించలేక నిస్సహాయ స్థితిలో పడిపోతుంటారు.

రావుకి అతని బాధ అర్థంఅయింది.

"కరుణా! ఏ సమస్యనైనా మనకోణం నుండేకాక ఎదుటివారికోణం నుండి కూడా పరిశీలించటం అవసరం" మిత్రుని చేతిని నిమురుతూ అన్నాడు.

"అంటే?"

"ఏంలేదు. నీవు చదువుకున్నవాడివి. కేవలం డిగ్రీలే కాకుండా సాహిత్యాభిరుచి ద్వారా జీవితానుభవాల్ని, వ్యక్తుల మనస్తత్వాల్ని అర్థంచేసుకున్నవాడివి. నీకు



నేను చెప్పవలసిన పనిలేదు. నీ భార్య పెరిగిన వాతావరణం, ఆమె అలవాట్లు, పద్ధతుల్ని బట్టి ఆమెను అర్థంచేసుకొని ప్రవర్తించాలి. నిన్ను అర్థంచేసుకునే శక్తి ఆమెకు లేనప్పుడు నీవు బాధపడి ప్రయోజనం ఏమిటి? ఆమెనుబట్టి నీవు కొంత సర్దుకునిపోక తప్పదు"

"ఆమెకూ ఉన్నాయి డిగ్రీలు. చదువు లేనిది ఏం కాదుగా?"

కోపం తొంగిచూసింది దయాకరం కంఠంలో.

నవ్వాడు రావు. "కేవలం డిగ్రీలే మనిషికి సంస్కారాన్ని ఇవ్వలేవని నీకు తెలియదూ?"

దయాకరం మాట్లాడలేదు.

"ఇందాక ఈనాటి స్త్రీలు భర్తల్ని బానిసలుగా చేసుకుంటున్నారు అన్నావు చూడు ... అది కరెక్టుకాదు. స్త్రీగాని, పురుషుడుగాని మానసికంగా పరిణతిని సాధించినపుడు ఎవరిని ఎవరికీ బానిసలుగా చేసుకోరు. బానిసత్వం ఏరూపంలో వున్నా దాన్ని వారు ఖండిస్తారు. మన దేశ స్త్రీ ఇప్పుడిప్పుడేకదా చదువుకుంటున్నది. ఇంకా పూర్తిగా స్త్రీకి సొంతమైన కట్టుబాట్లనుండి స్వేచ్ఛలభించలేదు. లభించిన నాడు ఆమె నిజమైన సంస్కారాన్ని గుర్తించి దానిని అలవర్చుకోవటానికి ప్రయత్నిస్తుంది. స్త్రీలు ఎదగనంతవరకు సంసారంలో లభించిన స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను దుర్వినియోగం చేయవచ్చు దాని పర్యవసానమే భర్తల్ని బానిసలుగా చేసుకోవాలనుకోవటం"

"స్త్రీలు ఎదిగేంతవరకూ నాబోటివారికి ఈ పాట్లు తప్పవంటావా?"

రావు నవ్వి "స్త్రీ పెరగకుండా ఆమె అభివృద్ధికి ఇన్నాళ్లు అడ్డుగా నిలిచింది పురుషులేగా! తిరిగి పురుషుడే ఆమె అభివృద్ధికి అన్నివిధాలా సహాయపడి పైకి తీసుకుని రావాలి. అలా చేయటం అతనికి శ్రేయస్కరం. తనతోపాటుగా తన స్త్రీకూడా ఎదిగేందుకు పురుషుడు చేయూతనివ్వాలి. అప్పుడే సంసారంలో నీవు చెప్పే సమస్యలు తొలగిపోతాయి"

"బావుంది. భార్యల్ని సంస్కరించాలంటావు. వారు మారగలరనే అనుకుంటున్నావా?"

"నిజమే... అందరూ మారకపోవచ్చు. మార్పుని కోరుకునేవారికి చేయి అందించమంటున్నాను"

"ఇన్ని సంవత్సరాలుగా అనేకసార్లు ఆమెతో సామరస్యపూర్వకంగా కొన్ని విషయాలు చెబుతూనే వచ్చాను. వీసమంత కూడా మారలేదు''

"మాటలు చెప్పటమేకాదు....మార్పు తీసుకువచ్చే వాతావరణాన్ని కూడా ఆమె చుట్టూ కల్పించాలి. అంటే మంచిపుస్తక పఠనం, మంచి మిత్రులు ఇలా..."

"అన్నీ అయినయ్. నీవు చెప్పే ప్రయత్నం నేను చేయకకాదు... చేసినా ప్రయోజనం కన్పించలేదు"

"అయితే నీ నిర్ణయం ఏమిటో చెప్పమంటాను"

"నిర్ణయాలంటూ ఏమీలేవు రావు! మిగిలిన జీవితంకూడా ఇలా నిస్సారంగా బతకటమే"

"అదే.... ఆ నైరాశ్యమే పనికిరాదంటున్నాను. పోనీ ఆమెకు విడాకులిచ్చి ఇంకొక వివాహం చేసుకుంటావా?"

"ఇప్పుడా? ఆ సమయం మించి పోయింది. ఇప్పుడా అవసరంలేదు. అయినాఇంకో స్త్రీతో మాత్రం ఇటువంటి సమస్యలురావని గ్యారంటీ లేదుగా!"





ఫక్కున నవ్వాడు రావు. "హాస్ గ్యారంటీఇచ్చే ఆవిడనే చేసుకో"

"ఏదీ... ఎక్కడా తటస్థపడందే?"

"పడుతుందిలే. ఇంకా టైముందిగా. వృద్ధాప్యం వరించేలోపుగా కనబడక పోతుందా.... ఇహ పడుకో" నవ్వుతూ పక్కపై వాలాడు రావు.

* * *

ఉదయం ఎనిమిదిగంటల సమయం రూములో కూర్చుని మిత్రులిద్దరూ కాఫీ తాగుతున్నారు. ఎదురుగా స్టాండుపై అసంపూర్తిగా ఉన్న చిత్రం.

కాఫీ కప్పులోనుండి కళ్ళెత్తి ఆ చిత్రాన్ని చూస్తున్నాడు కరుణాకరం.

"రావు... ఇదెప్పుడువేశావ్?"

"తెల్లవారుఝామున" జవాబిచ్చాడు.

"నాకు మెలకువే రాలేదు. బాగా నిద్రపట్టింది"

రావు లేచి వెళ్ళి రేడియో ఆన్‌చేసి వచ్చాడు.

'పియా మిలన్‌కో జానా' పంకజ్ మల్లిక్ పాడుతున్నాడు.

పాట వింటూ రావు మౌనం వహించాడు. పాట పూర్తిఅయింది.

"గుర్తుందా కరుణా! ఈ పాట నీవు పాడేవాడివి"

"ఉంది"

రావు చిత్రాలంటించిన ఆల్బమ్ చేతుల్లోకి తీసుకునిచూస్తూ అన్నాడు కరుణాకరం-

"నీ బొమ్మలు చాలా బావున్నాయి రావు!"

"సరేగాని.... ఇంకో కప్పు కాఫీ తెప్పించనా?"

"వద్దు.... చాలు"

"స్నానంచేసిరా! ఈలోపు నేను ఈ బొమ్మ పూర్తిచేస్తాను"

"ఓకే" అంటూ లేచాడు కరుణాకరం.

సంధ్యాకాశంలో ఒకే ఒక తార కింద ఏటిసీటి ఎరుపురంగులో తళుక్కున మెరుస్తోంది. ఏటికవతలగా గూటికి పయనమై వెళుతున్న గువ్వల జంట.

ఏటికి ఇవతల బాటపై సాగిపోతున్న పల్లెపడుచుల జంట.

"అద్భుతంగా ఉంది" వెనగ్గా నిల్చున్న కరుణాకరం అన్నాడు.

నవ్వి చేతిలో కుంచెకు విశ్రాంతి ఇచ్చి వెనక్కి తిరిగాడు రావు.

"టిఫిన్ చేద్దాం పద!"

ఇద్దరూ దిగి డైనింగు టేబిల్ దగ్గరకి చేరారు.

"మీ శ్రీమతి ఇంకా లేచినట్లు లేదు" అన్నాడు కరుణాకరం టిఫిన్ చేస్తుండగా.

"లేచింది. బయటకు వెళ్ళిందిలే!"

ఏ భావమూ లేని రావు ముఖంలోకి ఆశ్చర్యంగా చూశాడు కరుణాకరం.

"ఎక్కడకు వెళ్ళారు ఇంత పొద్దుటే?"

"తెలియదు. బహుశా క్లబ్‌కై ఉంటుంది. ఆమెకు ఎన్నో పనులు. ఆమె వ్యాపకాలు ఆమెవి"

కరుణాకరం మౌనంగా మిత్రుణ్ణి పరిశీలిస్తున్నాడు. రావు దాంపత్యం అతనికి అర్థం కావటంలేదు.

ఆలోచనలలో నిమగ్నుడై ఉన్న కరుణాకరం రావు పిలవటంతో అతనిని అనుసరించాడు. తిరిగి ఇద్దరూ గదిలోకి చేరుకున్నారు.

"నాకో చిన్న సందేహం" అన్నాడు కరుణాకరం



"ఏమిటది?"

"వచ్చిందగ్గర్నుండీ చూస్తున్నాను. మీరిద్దరూ మాట్లాడుకున్నట్లే లేరు. ఆమె దారి ఆమెది...నీదారి నీదిలా ఉందే"

"నిజమే. కొన్ని సంవత్సరాలుగా మేము ఇలా బతకటానికి అలవాటు పడిపోయాం"

"ఏం?" అర్థం కాలేదు కరుణాకరానికి.

"ఆమె అభిరుచులు ఆమెవి. నా అభిరుచులు నావి. ఆమె ఎన్నుకున్న జీవనవిధానం వేరు ... నాది వేరు"

"అంతే?"

మందహాసం చేసాడు రావు.

"అంతే ఏముంది. ఆమె జీవన విధానానికి నేను అడ్డు వెళ్ళను. అలాగే నా విధానానికి ఆమె అడ్డు రాదు"

"మరి ...మరి...."

కరుణాకరం అడగబోయేదేమిటో రావుకి తెలుసు.

"ఆమె నా జీవితంలో అడుగుపెట్టిన మరుక్షణమే ఆమె ఏమిటో నాకర్థం అయింది. అప్పటినుండి ఆమెకు అడ్డు తొలగటం అలవర్చుకున్నాను"

"మరి... నాకేదో మార్చుకోవటానికి ప్రయత్నించమని ఉపన్యాసం ఇచ్చావు"

"ఇచ్చాను...నిజమే. నేను చెయ్యమన్న ప్రయత్నం అందరి విషయంలో వర్తించదు. వారివారి స్వభావాల్ని బట్టి మనం ప్రయత్నించవలసి ఉంటుంది. ఇందిర విషయంలో అటువంటి ప్రయత్నం ఫలించదని తెలిసి విరమించుకున్నాను"

కరుణాకరానికి బోధపడటం లేదు. అతని అంతరంగాన్ని ఏదో ప్రశ్న తొలిచేస్తోంది. ఆ ప్రశ్న అడిగి జవాబు వినాలంటే ఏదో భయంగా, బాధగా ఉంది. భావరహితంగా చెప్పుకుపోతున్న రావు గంభీరవదనం అతన్ని సందిగ్ధావస్థకు గురిచేస్తోంది.



కొంతసేపు మౌనం.

ఏం మాట్లాడాలో తోచడంలేదు కరుణాకరానికి.

రావు అంతరంగంలోకి తొంగి చూడడానికై ప్రయత్నిస్తున్నాడు.

అలా మిత్రులిద్దరూ ఎవరి ఆలోచనలలో వారు మునిగిపోయారు.

"జీవితానికి అర్థం ఏమిటని అడిగా కదూ కరుణా! ఆ ప్రశ్నకు సమాధానానే నేనూ అన్వేషిస్తున్నాను"

కరుణాకరం మాట్లాడలేదు.

"మరైతే ఈ పరిస్థితి నీకు బాధ

లేదూ?" అర్థంలేని ప్రశ్న అడిగాననిపించింది కరుణాకరానికి తర్వాత.

కొన్ని క్షణాల నిశ్శబ్దం.

"జీవితం బహుముఖమైంది. మన ఆనందానికి, బాధకు ఎవరినో కర్తలను చేయటం, వారినుండి ఆనందం లభ్యం కావటం లేదని వాపోవటం సరియైన పద్ధతి కాదు. ఏ ఒక్క వ్యక్తి నుండో మనకు కావలసినవి పొందాలనుకోవటం, అలా జరగనప్పుడు ఇహ జీవితమే లేదనుకోవటం అర్థరహితం"

కరుణాకరం మాట్లాడలేదు - వింటున్నాడు.

"మన అభిరుచులను, ఆశయాలను ఇంకొకరి కారణంగా బలిపెట్టి మనల్ని మనం పోగొట్టుకోవటం తెలివితక్కువ. వ్యక్తిత్వాల్లోగల వైవిధ్యాన్ని మనం గుర్తిస్తే మన బాధ కొంత తగ్గుముఖం పడుతుంది. ఎదుటివారు మన అభిరుచులకు అనుగుణంగా నడవాలనుకోవటం హాస్యాస్పదం"

"మరైతే భార్యాభర్తల బంధానికి అర్థం?"

''మనం అక్కడే పొరపడుతున్నాం. భార్యాభర్తలైనంతమాత్రాన ఇద్దరూ ఒక్కటి కావాలనుకోవటమే పెద్ద పొరపాటు. ఒకచోటే జీవించినాగానీఇద్దరూవేరువేరువ్యక్తులే కదూ... ఇద్దరూ ఒకలా ఎలా అవుతారు? ఎవరి వ్యక్తిత్వం వారిది. ఇద్దరూ ఒకే వ్యక్తిత్వం కలిగి ఉండాలనుకోవటంలోనే సమస్యలు ఉత్పన్నం అవుతున్నాయి"

"అన్యోన్యంగా కలిసి జీవించే దంపతులు లేరంటావా?"

"అనలేను. కానీ, అన్యోన్యత అవగాహన నుండే పుడుతుంది. అవగాహనను ఆస్కారం లేనిచోట ఎవరి దారి వారిదిగానే జీవించక తప్పదు"

''అలా జీవించడం దుర్భరం కదూ''

''దుర్భరమే. కానీ ఒకరినుండి ఒకరు ఏమీ ఆశించనపుడు, తమ బాధకు ఎదుటివారే కారణభూతులుగా వేలెత్తి చూపనపుడు పరిస్థితి కొంత మెరుగుపడుతుంది"

"కలసి బతికే మనిషి నుండి ఏమీ ఆశించకుండా ఎలా బతుకుతాం?"

"నిజమే...బతకలేం. ఆశించి ప్రయోజనం లేనప్పుడు మన ఆశలను, ఆనందాన్ని ఇంకొక వైపుగా కేంద్రీకరింపచేయడం శ్రేయస్కరం"

"ఇంకొక వైపంటే?''

"మన మనస్సుకు నచ్చే, మనకు ఉపశాంతినిచ్చే అంశాలు గురించి వాటిని పెంచుకోవటమే ... చెప్పానుగా జీవితం బహుముఖమైనదని''

"అది అందరికీ సాధ్యమవుతుందా?''

''కాకపోవచ్చు. సాధ్యం కానప్పుడు నిత్యం బాధ భరించేకన్నా ఆ బంధం నుండి బైటపడటం సరియైన పద్ధతి"

"అంటే విడిపోమనా?"

''అనే..."

"ఎలా? పిల్లల భవిష్యత్తు..." పూర్తి చేయలేదు కరుణాకరం.

''పరస్పరం సంఘర్షించుకునే తల్లిదండ్రులమధ్య పిల్లలు సరిగా పెరుగుతారంటావా? అంతకంటె ఇద్దరిలో ఏఒక్కరి దగ్గరో పెరగటం ఉత్తమం కదూ''

"కాని సంఘం ఆ కుటుంబాన్ని సరిగా తీసుకుంటుందంటావా?"

"హుష్...తెలివితక్కువగామాట్లాడకు కరుణా! సంఘానికి వెరచి ఇద్దరు వ్యక్తులు జీవితకాలం నరకయాతనపడటం సమంజసమేనా?''




"అనను కానీ..."

"ఏమిటి కానీ! ఇంకా ఈరోజుల్లో కూడా నువ్వు సంఘం గురించి మాట్లాడటం ఏం బాగాలేదు"

''ఇదే స్త్రీకయితే నీవేం చెబుతావు?''

"స్త్రీ అయినా, పురుషుడయినాజీవితం విలువ ఇద్దరికీ ఒక్కటే. ఎవరికనచ్చిన రీతిలో వారు పరిష్కరించుకోగలగాలి''

''ఆర్థికంగా పురుషుడిమీద ఆధార పడిన స్త్రీ అయితే?''

"ముందు ఆర్థిక స్వాతంత్ర్యం ఉన్న స్త్రీయే తన సమస్యలకు సులువుగా పరిష్కారాలు వెతుక్కోగలుగుతుంది"

''భోంచేద్దాం పద'' కిందకు దారి తీశాడు.

భోజనానంతరం కరుణాకరం కొంత సేపు విశ్రాంతి తీసుకున్నాడు.

గోరు వెచ్చని గాలి గదిలోకి ప్రవేశించి రావుని పలకరించిపోతోంది.

ఏదైనా పుస్తకం తిరగేద్దామని చేతులోకి తీసుకున్నా ఆలోచనల వలన మనసు నిలిపి చదవలేకపోతున్నాడు.

కుర్చీలోనుండి లేచి చేతులు కట్టుకుని మెల్లగా గదిలో పచార్లు ప్రారంభించాడు.

మనిషి ఏర్పరచుకున్న ఈ సంఘం వలన తిరిగి మనిషే ఎన్నో సమస్యలను ఎదుర్కోవలసి వస్తోంది. సంఘం తన నీతిసూత్రాలను, కట్టుబాట్లను వ్యక్తులందరికీ వర్తింపచేయబూనటం అమానుషం. మనుషులంతా ఆకారానికి ఒకటే అయినా స్వభావపరంగా మనిషికీ మనిషికీ మధ్య ఎంతో వైవిధ్యం ఉంది. ఈ వైవిధ్యాన్ని పరిగణనలోకి తీసుకోకుండా సంఘం అందరినీ ఒకేలా శాసించాలని చూస్తుంది. మందలో ఒకడుగా తెలుస్తుందేగాని ఏ వ్యక్తికా వ్యక్తికుండే ప్రత్యేకతను సంఘం పట్టించుకోదు. సంఘం ఉక్కుపిడికిలిలో వ్యక్తి స్వేచ్ఛకు ఆస్కారంలేదు. సాంఘిక చట్రంలో బిగించబడ్డ మనిషి తన స్వంత ప్రతిపత్తిని కోల్పోయి గానుగెద్దులా జీవించాల్సిందే!

అలాగని సంఘాన్ని కాదని ఒంటరిగా జీవించలేడు. తనను కాదన్నవారిపై సంఘం కక్షసాధిస్తుంది. దీనికి తట్టుకోలేని ఎందరో వ్యక్తులు సంఘంతో రాజీపడి తమ అస్తిత్వాన్ని కోల్పోయి బతుకుతుంటారు.

వ్యక్తి అంతరంగిక జీవితానికి సంఘం దృష్టిలో ప్రాధాన్యతలేదు. మరి... అంతరంగం మరచి మనిషి బతకటం సాధ్యమయ్యేపనేనా? అదేకదూ ఈ ఆవేదనలకు కారణం?

తిరిగి కుర్చీలో చేరగిలబడ్డాడు.

క్షణాలు గడుస్తున్నాయి.

హృదయం అట్టడుగు పొరలనుండి ఏదో ఆర్తి బుస్సున పైకి పొంగించి. భరించలవి కాని బాధతో గుండె విలవిలలాడింది.

నిరంతరం గుండెల్లో దాచుకట్టుకున్న ఒంటరితనం విశ్వరూపందాల్చి రావుని భయపెడుతోంది.

నిస్సహాయంగా చేతివేళ్ళతో నుదుట పద్దుకున్నాడు.

శూన్యం...శూన్యం...

హృదయం అంతటా, జీవితం అంతటా నిండిన శూన్యం. భరించలేడు. భరించకచేసేది లేదు...

జీవితం పాదాలచెంత తలవాల్చి ఓటమిని అంగీకరించాలని... ఆవిధంగా అయినా కాస్త మనశ్శాంతి దొరుకుతుందేమోనని ఆలోచన.

వద్దు...వద్దు...అటువంటి ఆలోచనకు

అవకాశం ఇవ్వకూడదు.

ఒక్కసారి... ఒక్కసారి అందుకు అవకాశం ఇస్తే మిగిలేది జీవం కోల్పోయిన తన శరీరం.

ఆ శరీరాన్ని తాను భరించలేడు.

చైతన్యరహితంగా యంత్రంలా జీవించటం తనవల్లకాదు.

జీవితం తనకు ఎంత అందకుండా పరుగెత్తినా తను వెంటాడి అందుకోవటానికే ప్రయత్నిస్తాడు.

అందుకోసమే తాను జీవిస్తాడు.

అందిన జీవితాన్ని అధిగమించి అందని దానికై అన్వేషణ సాగిస్తాడు.

ఆ అన్వేషణే తనకి జీవితం.

రావు లేచి కూజానుండి చల్లని నీరు గ్లాసులోకి వంపుకుని తాగాడు. కాస్త స్తిమితం చిక్కినట్లయి పుస్తకం చేతుల్లోకి తీసుకున్నాడు.

"నీవు పడుకోలేదా రావ్?" ఆవులిస్తూ లేచివచ్చి కుర్చీలో కూర్చున్నాడు కరుణాకరం.

"లేదు. పగలు నిద్రపోను. నిద్ర విషయంలో నీ అంత అదృష్టవంతుణ్ని కానులే"

"ఏం అంత మొద్దునిద్రపోయానా?"

"త్వరగా ముఖం కడుక్కునిరా! టీ తీసుకుందాం"

"ఇదిగో... ఒక్క నిముషంలో వచ్చేస్తాను" అంటూ కదిలాడు కరుణాకరం.

ఇంతలో "హల్లో... రావ్!" అంటూ వచ్చాడు శ్రీపతి.

"హలో! రావా... కూర్చో" అంటూ కుర్చీ ముందుకు నెట్టాడు.

"ఏం చేస్తున్నావు?"

"ఏంలేదు మామూలే"

"ఎవరో గెస్ట్స్ వచ్చినట్టున్నారు"

"అవును. నా కాలేజీమేట్. ఒక్క నిముషం ఆగు పరిచయం చేస్తాను"

ఇంతలో బాత్‌రూమ్ నుండి ముఖం తుడుచుకుంటూ బయటకి వచ్చాడు కరుణాకరం.

"కరుణా! ఇతను శ్రీపతి... నా కొలీగ్. ఇతను కరుణాకరం... చీఫ్ ఇంజనీరుగా పనిచేస్తున్నాడు"

అప్రయత్నంగా ఒకరిచేతులను ఒకరు స్పృశించి వదలివేశారు.

ఇంతలో టీ రావడంతో ముగ్గురూ టీ తాగుతూ మౌనం వహించారు.

"శ్రీపతీ! అలా బీచ్‌వైపు నడుద్దామా?"

"లేదు. నేను ఇంటికి వెళ్ళాలి. ఇటువైపు నుంచీ వెళ్తూ ఒకసారి నిన్ను చూసి పోదామని వచ్చాను"

"ఏమిటోయ్... ఇంటికి వెళ్ళటానికి అంత తొందరపడుతున్నావు?"

"మా శ్రీమతి, నేను కలసి ఒక మిత్రుని ఇంటికి వస్తామని మాట ఇచ్చాం. వెళ్ళక తప్పదు"

"వెరీగుడ్... అలా అయితే వెళ్ళు"

శ్రీపతిలేచి ఇద్దరిదగ్గరా శలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

"కరుణా! మనం బయటకు వెళదామా?"

"వద్దు.... డాబామీద కూర్చుందాం"

"అలాగే. కుర్చీలు వేయమని చెప్పి వస్తాను"

వసంత ఋతువుకి ఆహ్వానం పలికేందుకై ఎక్కడినుండో కోయిల కంఠం సవరించుకుంటోన్న శబ్దం.

పశ్చిమాద్రి అసురసంధ్యకై ఆయత్తమవుతోంది.

పిల్లగాలులు చెట్ల కొమ్మలతో సరాగాలాడుతున్నాయి.




వాతావరణం ప్రశాంతంగా ఉంది.

కరుణాకరం సిగరెట్ వెలిగించాడు. రావు పిట్టగోడనానుకుని పడమటి కొండల కావలగా కనిపిస్తున్న శూన్య ప్రదేశంలో చూపులు నిగిడ్చి నిలబడ్డాడు.

సిగరెట్ పారవేసి వచ్చి కుర్చీలో కూలబడ్డాడు కరుణాకరం.

కుర్చీ చప్పుడుకి, రావు ఏకాగ్రతకు భంగం కలగగా వెనక్కి తిరిగి తానూ వచ్చి ఎదురుగా కూర్చున్నాడు.

"రావ్! చిన్నప్పటి నీ స్వభావంలో ఏమీ మార్పులేదు''

రావు మాట్లాడలేదు.

''రాను. రాను మరీ ఏకాంతజీవిగా మారిపోతున్నట్టున్నావ్"

"నిజం కరుణా! ఏకాంతంగా ఉండటంలో నాకేదో ఆనందం లభిస్తుంది"

"విసుగువేయదా?"

"విసుగెందుకు ? ఆత్మావలోకానికి ఏకాంతం ఎంతో అవసరం''

''ఏమిటీ ఎల్లవేళలా ఒంటరితనం బాధాకరం కాదూ!"

"ఎప్పుడూనా ఆలోచనలు నాకుతోడు ఉండగా ఒంటరివాణ్ణి ఎలా అవుతాను? నేను సృష్టించుకున్న ప్రపంచం నా చుట్టూ ఉండనే ఉందిగా''

అర్థంకానట్టు చూశాడు కరుణాకరం.

''అదే...నా చిత్రాలు - కవితలు ఇవి నా కిష్టమైన వ్యాపకాలు. వాటిని రచిస్తున్నప్పుడు నేను ఈ భౌతిక ప్రపంచాన్నే మరచిపోతుంటాను''

''అది కాదు....'' ఎలా అడగాలో తోచలేదు కరుణాకరానికి.

''మరేమిటి? అడుగు సందేహం ఎందుకు?''

"మన అంతరంగాన్ని పంచుకునే వ్యక్తులు ఎవరూ జీవితంలో లేకుంటే వెలితిగా అన్పించదూ?''

తనలో అంతర్లీనంగా కలిసిపోయిన బాధను తన నోటితోనే చెప్పించాలనిచూసే మిత్రుని ఉద్దేశం రావుకి అర్థం అయింది.

నవ్వాడు. ఆ నవ్వులో భాషకందని మూగభావాలు దొర్లాయి.

"ఊహ తెలిసిన నాటినుండి జీవితం పట్ల నాకున్న దృష్టివేరు. భౌతికసుఖాల వెంట నేను ఏనాడూ పరుగులు పెట్టలేదు. నా అంతరంగంలో నాకే తెలియని అగ్ని ఏదో నిరంతరం ప్రజ్వలిస్తూ ఉంటుంది. ఏదో కావాలనే, దేన్నో తెలుసుకోవాలనే జిజ్ఞాస నన్ను ఎల్లప్పుడూ వెంటాడుతుంటుంది. ఆ అన్వేషణతోనే బాధకు, ఆనందానికి నా కోణం నుండి నేను నిర్వచనం ఇచ్చుకున్నాను. అందుకే నా బాధకు ఎదుటి వ్యక్తులు కారణం అనిగాని, నా ఆనందం ఎవరినుండో లభ్యం కావాలని గాని నేను అనుకోను" రావు కంఠంలో గాంభీర్యం సుళ్ళు తిరిగింది.

కరుణాకరానికి రావు మాటలు కొంత అర్థమయ్యీ కానట్టుగా తోచాయి. మిత్రుని వ్యక్తిత్వం వింతగా గోచరించింది. రావు అన్ని మాటలు చెప్పినా మనసులో జనించిన సందేహం ఇంకా నివృత్తి కానట్టే ఉంది.

మిత్రుని మౌనం రావుకి తాను చేసిన పొరపాటుని తెలియజెప్పింది.

తేలిగ్గా నవ్వేస్తూ, "ఏమిటి కరుణా మాట్లాడవ్?" అన్నాడు.

"నువ్వు ఎన్నైనా చెప్పు... ఈ పరిస్థితి నీకు బాధగా లేదంటే నేనుఅంగీకరించను"

నిట్టూర్చాడు రావు.

"మన అభిరుచులకు, ఆశలకు తగ్గ వ్యక్తులు లభించనపుడు చేసేది ఏముంది?"

"నిజమే అనుకో నీ సంగతిసరే...ఏ వ్యాపకం ఏర్పరచుకోలేని నాబోటి సామాన్యుడికేది దారి?"

"ఆలోచిస్తే మార్గం దొరక్కపోతుందా? నీకు అత్యంత ఇష్టమైన సంగీతాన్ని కూడా మరచి నీకంటూ ఏ ఆనందం లేకుండా ఎప్పుడూ బాధనే స్మరిస్తూ బతకమని ఎవరు చెప్పారు? ఇంత విశాలమైన జీవితంలో ఏవైపునుండీ నీకు ఆనందం లభించే మార్గాలే లేవా?"

కరుణాకరంకి సమాధానం దొరక లేదు.

"మన ఆశలని, ఆనందాల్ని ఒకవైపే కేంద్రీకరించి, అటునుండి ఏమీ లభించటం లేదని వ్యథ పడేకన్నా జీవితంలో ఇంకే రూపంగానయినా ఆనందం లభిస్తుందేమో వెతుక్కోవటం, అందుకు ప్రయత్నించటం మంచి పద్ధతి కాదంటావా?"

కాదని ఎలా అంటాడు?– తనేమిటో గుర్తు వస్తున్నట్లుగా ఉంది కరుణాకరానికి.

ఇన్నాళ్ళు మనసులో నిండిన నిరాశా నిస్పృహలు చెల్లాచెదురై వాటి స్థానంలో కోల్పోయిన ఆనందం ఏదో పొడచూపుతున్నట్టుగా ఉంది.

రావు లేచి మెట్లుదిగి వెళ్ళి మరో రెండు కప్పుల టీ తీసుకు రమ్మని చెప్పి వచ్చాడు.

తిరిగి వచ్చి ఆలోచనల్లో నిమగ్నమై ఉన్న మిత్రుణ్ణి నిశితంగా పరిశీలిస్తూ చేతులు కట్టుకుని పిట్టగోడకు జారబడి నిల్చున్నాడు.

"ఏమిటో జీవితం చాలా చిత్రంగా తోస్తుంది!"

తత్వవేత్తలా ముఖం పెట్టి అంటున్న మిత్రుణ్ణి చూసి చిరునవ్వు నవ్వాడు రావు.

"వ్యక్తుల దృక్పథాన్ని బట్టి ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా జీవితం గోచరిస్తుంది. జీవితం అంటే ఏ ఆలోచన లేకుండా తేలిగ్గా తీసుకుని జీవించేవారి సంఖ్యే ఎక్కువ. వారి వరకు వారు సుఖంగా జీవిస్తున్నామనే తలుస్తుంటారు"

"నిజమే. ఆలోచించి చూస్తే వారి పద్ధతే మంచిదేమో!"

"మంచో కాదో మనమెలా నిర్ణయిస్తాం. ఎవరికి నచ్చిన పద్ధతిలో వారు జీవిస్తూనే ఉంటారు"

"ఇన్ని ఆలోచనలతో తలబద్దలు కొట్టుకుని మనం సాధించేది మాత్రం ఏముంటుంది?"

"ఏం సాధించాలో ఎవరికి వారు నిర్ణయించుకోవలసిన విషయం. జీవితానికి ఏ లక్ష్యం లేకుండా లక్ష్య రహితంగా జీవించి మాత్రం సాధించేది ఏముంటుంది?"

"కనీసం ఈ మానసిక వ్యథ అన్నా తప్పుతుందేమో?"

"పొరపడుతున్నావు. వ్యథ అంటే ఏమిటో అనుభవంలో లేని మనిషికి జీవితం లోతు అందదు. లోతుల్ని తరచే ప్రయత్నమే నిజంగా జీవించడం అంటే"

కరుణాకరం మాట్లాడలేదు.

పంటతను టీ తీసుకుని రావటంతో చెరొక కప్పు అందుకున్నారు.

"రేపు చుట్టుపక్కల ప్రదేశాలు ఏమైనా చూద్దామా?" అడిగాడు రావు.

"ఏం చూద్దాం? ఎక్కువ టైము లేదు. ఎల్లుండి నేను బయలుదేరాలి"

"అప్పుడే వెళతావా?"

"వెళ్ళాలి...సెలవు లేదు"

"వెళుదువులే. రేపు సింహాచలం దేవాలయం చూద్దాం. చాలా బాగుంటుంది.





దగ్గరకూడాను. కాసేపు గార్డెన్‌లోకి వెళదాంపద"

రావుని అనుసరించాడు కరుణాకరం.

ఆరాత్రి భార్యను కదిపాడు.

"ఇందిరా! కరుణాకరంతో కలిసి సింహాచలం చూసొద్దాం వస్తావా?"

"రేపు ఉదయం పదిగంటలకి మా క్లబ్‌లో మీటింగు ఏర్పాటుచేశాం. నాకు కుదరదు మీరు వెళ్ళండి"

మరి తర్కించలేదు రావు.

## 7

...ఏ అవకాశాలూ లేని ఆరోజుల్లోని ఈ నిర్మాణాలు చూస్తుంటేఆశ్చర్యంవేస్తుంది. వారి దీక్షకు జోహర్లు చెప్పాలనిపిస్తుంది. అవకాశాలు అన్నీవున్న ఈ రోజుల్లో నిర్మించడం కంటే నిర్మూలించడాన్నే ఎక్కువగా అభ్యసిస్తున్నట్లున్నారు...

మర్నాడు మధుని తీసుకుని మిత్రులిద్దరూ కారులో బయలుదేరారు. కారు ఘాట్‌రోడ్ సగం ఎక్కేటప్పటికి ఆపు చేయించి అక్కడనుండి నడుద్దాం అన్నాడు రావు.

ముగ్గురూ కలసి మెల్లగా నడక సాగించారు.

రోడ్డుకిరుపక్కలా ఉన్న చెట్లకి నిప్పుకణికల్లాంటి అగ్నిపూలు విరగ బూసి ఉన్నాయి.

పైన నీలాకాశంలో తెల్లని మబ్బులు దొంతరలుగా సాగిపోతున్నాయి.

ఎత్తు ఎక్కేటప్పుడు తలపైకి ఎత్తి నీలాకాశంతో కలిపి ఆ ఎర్రటి పూలను చూస్తుంటే ఆ రంగుల మిశ్రమం కంటికి ఎంతో ఆహ్లాదం గొల్పుతూంది.

రోడ్డు సరిహద్దు గోడవద్ద కాసేపు పరిసరాలను పరికిస్తూ నిలబడ్డారు. వేల మైళ్ళదూరం పరచుకున్నట్టు కనిపిస్తున్న ప్రకృతి-మనిషి అస్థిత్వాన్ని సవాలుచేస్తున్నట్టుగా ఉంది.

సుదూరతీరంలో కొండల కిందుగా వెండిచారలా తెల్లగా మెరుస్తూ నీటిపాయ. గాలి స్వేచ్ఛగా పరుగులు పెడుతూ పల్టీలు కొడుతోంది.

ముగ్గురూ దేవాలయంలో ప్రవేశించారు.

కృష్ణదేవరాయలు ఈ దేవాలయం కట్టించాడని ప్రతీతి. రాయల రసజ్ఞత ఆలయంపైన ప్రతి శిల్పంలోనూ ఉట్టిపడుతోంది. మనసుకి విభ్రమంగొల్పే శిల్పసంపద.

ఒక్కొక్క శిల్పం పరిశీలిస్తూ ఆలయంచుట్టూ తిరుగుతున్నారు.

అంగుళం అంగుళం అనేక భంగిమల్లో అమర్చబడిన శిల్పాల అందం. భాషకూ, భావనకూ అందక తెలియని ఉద్వేగంతో గుండెలనిచలింపచేస్తున్నాయి. వాటి నైపుణ్యాన్ని నిశితంగా చూడాలంటే ఒక్కరోజు ఏమి సరిపోతుంది?

ఏ సంధ్యావేళల్లోనో ఈ మండపంపై కూర్చుని అసురకాంతిలో దేదీప్యమానంగా వెలిగే ఆలయగోపురాన్నిచూస్తూ... హావభావలహరి లాస్యంచేసే అంగాంగాల సోయగాన్ని ఈ శిల్పాల్లో దర్శిస్తూ ... రసప్రపంచంలో విలీనం అయితే తప్ప తృప్తి కలుగుతుందా?

తన ఆలోచనకు నవ్వుకున్నాడురావు.

మానవజీవితంలో ప్రధానఘట్టం స్త్రీ పురుషుల లైంగిక కలయిక.

లైంగిక విజ్ఞానాన్ని వివిధ భంగిమల ద్వారా, సూత్రాలద్వారా పొందుపరచి ప్రచారంచేసిన మన ప్రాచీనుల దూర

దృష్టికి మెచ్చుకోకుండా ఉండలేము.

లైంగిక అవసరాన్ని ఒక కళగా ఉపాసించినవారు ఎంతటి రసికాగ్రేసరులో! అటువంటి శిల్పాలు కొన్ని ఏ కారణంచేతనో పగలగొట్టబడి ఆకారాన్ని కోల్పోయాయి.

''ఆలయంలోకి వెళదామా?'' అడిగాడు రావు.

“వెళదాం పద''

ఆధ్యాత్మిక జీవనానికి ఏకాగ్రత, ప్రశాంతత మూల స్తంభాలవంటివి. ఆలయంలో ఆ చిహ్నాలు నామమాత్రంగానే కనిపిస్తున్నాయి. బహుశః జనసంచారం ఎక్కువ కావటంవల్లనేమో!

మానవ జీవితంలో ప్రశాంతత కొరవడటానికి ముఖ్యకారణం ఎక్కడ చూసినా గుంపులు గుంపులుగా కనబడే జనం. అదుపుచేయలేని జనం. ఇదొక జనమహారణ్యం.



ఆలయం అంతా తిరిగివచ్చి ఎత్తయిన మండపంపై విశ్రాంతిగా కూర్చున్నారు ఇద్దరూ. మధు మెల్లగా ఆలయ పరిసరాలన్నీ తిరుగుతూ పరిశీలిస్తున్నాడు.

"ఆలయం అద్భుతంగా ఉంది" ఆనందాశ్చర్యాలు మిళితమైన కరుణాకరం కంఠం చిత్రంగా ధ్వనించింది.

"మన ప్రాచీన కట్టడాలు, శిల్ప సంపద అన్నీ అద్భుతమైనవే"

"నిజం. కళలని ఆస్వాదించటానికి, ఈవిధంగా కళారూపాల్ని చెక్కించటానికి వారికి ఎంత తీరుబడో కదా!"

"అప్పటికీ ఇప్పటికీ జీవనవిధానంలో ఎంతో మార్పు ఉంది. అయినా ఆ దృష్టి అంటూ ఉండాలేగానీ జీవితంలో కాస్త తీరుబడే కల్పించుకోలేమా?"

"ఏం తీరుబడి! నా మొహం! తెల్లారి లేస్తే ఉరుకులు పరుగులు పెట్టాల్సి వస్తుంటే"

"ఎందుకట...ఆ ఉరుకులు పరుగులు? యుగధర్మం కాబోలు!" నవ్వాడు రావు.

"ఏమిటో జీవితాలు! చప్పగా సారవిహీనంగా..." ఉస్సురని నిట్టూర్చాడు కరుణాకరం.

"ఎంతెత్తు, ఎంతెత్తు! ఎంత గొప్ప నిర్మాణమో!" మండప స్తంభానికి చేరగిలబడి ఆకాశంలోకి చొచ్చుకుపోయిన ఆలయప్రాకారాన్ని చూస్తూ ఆశ్చర్యంతో మెలికలు తిరిగిపోతున్నాడు కరుణాకరం.

"ఏ అవకాశాలులేని ఆ రోజుల్లోని ఈ నిర్మాణాలు చూస్తుంటే ఆశ్చర్యం వేస్తుంది. వారి దీక్షకు జోహార్లు చెప్పాలనిపిస్తుంది. అవకాశాలు అన్నీవున్న ఈ రోజుల్లో

నిర్మించటంకంటె నిర్మూలించడాన్నే ఎక్కువగా అభ్యసిస్తున్నట్లున్నారు"

"కరెక్టు. బాగా చెప్పావు. ఈ పద్ధతి ఈయుగధర్మానిదై ఉంటుంది" నవ్వుతూ లేచి నిలబడ్డాడు కరుణాకరం.

ముగ్గురూ తిరుగుముఖం పట్టారు.

పశ్చిమదిశ ఆకాశం సంధ్య కాంతిలో దీప్తివంతంగా ప్రకాశిస్తుంటే మరొకపక్క అస్పష్టంగా కనిపించే పర్వత శిఖరాలపై నుండి చీకటి తరుముకొస్తోంది.

ఆ సమయ ఆకాశానికి అభిముఖంగా పరుగులు పెడుతోంది కారు.

అద్దంలో నుండి అద్భుతంగా గోచరిస్తున్న ప్రకృతిని తిలకిస్తూ తన్మయుడై కూర్చుని ఉన్నాడు రావు.

నిశాదేవత గాఢాలింగనంలో ఇమిడి ప్రకృతి తన రూపాన్ని కోల్పోయింది.

అలముకున్న చీకటిని చీలుస్తూ ఆకాశంలో చుక్కలు తళుక్కున మెరిసాయి.

రోడుపక్కగా కొంచెం తలపైకి ఎత్తి కారువేగంతో కలిపి అంతరిక్షాన్ని వీక్షించాడు.

అదే వేగంతో కారును వెంబడిస్తున్నాయి తారలు.

అలాగే తలతిప్పకుండా సుదూరతీరాల తారలను తీక్షణంగా చూస్తున్నాడు.

అలా ... చీకటికప్పిన ప్రకృతిలో పరుగులుతీస్తుంటే హృదయంలో చిన్నగా తల ఎత్తుతున్న ఏదో కోరిక ...

గుండెకు దగ్గరగా ఏదో సాన్నిహిత్యపు సవ్వడి...

ఉద్వేగం ఉప్పొంగి మంద్రస్థాయిలో వణికే స్వరాల అలజడి....

అస్పష్టంగా అంతరంగంలో పసిడి వెలుగై రూపం...

ఆ రూపం అందించే అనురాగ సుధారసం...

ఆ రసాస్వాదనలో కలిగిన మైమరపు.

సర్వ ప్రపంచాన్ని మరచి మత్తిల్లిన శరీరం కోశిల్లి .... ఆ దివ్యానుభూతిలో అనుభవం తన ఉనికిని కోల్పోగా, అవధులు దాటిన ఆనందం కన్నీటి బిందువులై కనురెప్పల్ని తాకి తరించాయి.

"అరె రావ్! నిద్రపోతున్నావా ఏమిటి?"

ఉలిక్కిపడి కారు దిగాడు రావు.

మరునాడు కరుణాకరం రావువద్ద శలవు తీసుకొని బయలుదేరాడు.

* * *

"బాబుగారూ..."

ఏమిటన్నట్టు పుస్తకంలోనుండి తలెత్తి చూశాడు.

పోస్టుజవాను తమర్ని పిలుస్తున్నాడు.

చకచకా మెట్లుదిగి వెళ్ళాడు.

"మీకు టెలిగ్రాం సార్!"

సంతకం చేసి తీసుకున్నాడు.

గ్రామం నుండి. తండ్రి పరిస్థితి ప్రమాదకరంగా ఉందని, వెంటనే రమ్మని.

"ఎక్కడ నుండి నాన్నగారూ?" మధు అడుగుతున్నాడు.

"తాతగారికి బాగోలేదట. మీ మమ్మీ ఇంకా రాలేదుకదూ?"

"లేదు... ఇంకా రాలేదు"

ఆమె ఎక్కడ ఉందో తెలుసుకునే ఓపికలేదు-ఆమె చెప్పేసమాధానం తెలుసు కాబట్టి.

"టైములేదు. మనం వెళదాం బయలుదేరు మధూ! ఇప్పుడొక ట్రైను వుంది. వెంటనే వెళితే దానిని అందుకోవచ్చు" అంటూనే గబగబా మెట్లెక్కి పైకి వెళ్లాడు.





తండ్రిని అనుసరించాడు మధు.

ఉదయం పదిగంటల ప్రాంతంలో ఊరు చేరుకున్నారు తండ్రీకొడుకులిద్దరు. మంచానికి అంటుకుపోయినట్లున్న తండ్రిని చూడగానే చటుక్కున ముందుకు వెళ్ళి మంచంపై ఆయన పక్కగా కూర్చున్నాడు.

మధు తాతగారికి రెండోవైపున కూర్చున్నాడు.

బంధువులైన ఇద్దరు ముగ్గురు పెద్దవాళ్ళు మంచానికి సమీపంలో నిలబడి వున్నారు.

తండ్రి స్పృహలోలేడు. మృత్యుఛాయలు ఆయన ముఖంపై తారట్లాడుతున్నాయి.

తండ్రిని ఆ స్థితిలో చూస్తుంటే గుండెలు కలుక్కుమన్నాయి రావుకి.

"ఎప్పటినుండి ఇలావున్నారు బాబాయ్! నాకు తెలియపరచనేలేదు" పక్కనేవున్న రాఘవయ్యగారిని అడిగాడు రావు.

"ఒక నెలరోజులుగా ఆరోగ్యం బాగా చెడ్డింది బాబూ! నీకు రాయమని, నీ దగ్గరకువెళ్ళి పెద్ద డాక్టరికి చూపించుకోమని ఎంతపోరినా మాట వింటేనా. ఒట్టి మొండిఘటం. బాగానే ఉందంటూ చెయ్యిదాటిపోయేదాక జాప్యంచేశాడు. అక్కడికీ మే పిన్ని నేనూ కనిపెట్టుకునే వున్నాము. ఎంత కనిపెట్టుకునీ ఏం ప్రయోజనంలే! వయసు పైబడింది. ఇక మన చేతుల్లో ఏముంది?"

వైరాగ్యం తొంగిచూసింది ఆయన మాటల్లో.

మధ్యాహ్నం రెండు గంటల ప్రాంతంలో ఆయనకు కొంచెం స్పృహ వచ్చి మంచంలో కదిలేటప్పటికి "నాన్నగారూ" అంటూ ముందుకు వంగాడు రావు.

బరువుగా కళ్ళను విప్పి రావుని గుర్తించారాయన.

ఒక శుష్కహాసం ఆయన పెదాలపై పాకింది.

"తాతగారూ" అంటూ మధు రెండోవైపునుండి ఆయన ముఖంపై ముఖంపెట్టి పిలిచాడు.

కళ్లను తిప్పి మధును చూసి బరువుగా చేతిని పైకి ఎత్తి తల నిమిరాయన.

అంతే! ఆ తరువాత కొన్ని సెకండ్లలో ఆయన ప్రాణం పంచభూతాలలో ఐక్యం అయింది.

రెండు కన్నీటిబొట్లు రావు కనుకొలకులనుండి రాలి తండ్రి చేతులపై పడ్డాయి. భార్య వస్తుందనే ఆశలేకపోయినా ఇంటికొక టెల్కిగ్రాం కొట్టి యధావిధిగా కర్మకాండలో పాల్గొన్నాడు.

జరిపించవలసిన తతంగం ముగిసేటప్పటికి ఆకాశంలో చుక్కలు పొడుస్తున్నాయి. స్నానంచేసి ఒక గ్లాసు మజ్జిగ తాగి ముందువా వాకిట్లో వాలు కుర్చీలో నడుం వాల్చాడు. లోపల మధు రాఘవయ్యగారి కుటుంబంతో కబుర్లు చెబుతున్నాడు.

తరుముతున్న ఆలోచనలబారినుండి తప్పించుకోవటానికై కణతలు రుద్దుకుంటూ కళ్లు మూసుకుని పడుకున్నాడు.

చుట్టూ అలముకున్న నిశ్శబ్దం. పరిసరాల్లో పరచుకున్న చీకటి- మనసులో ఏదో బెంగని సృష్టిస్తున్నాయి. తెలియని దైన్యస్థితి అవహించి చెప్పరాని దిగులుగా అనిపిస్తోంది.

ఊహ తెలిసిననాటినుండి గుర్తున్న వివిధ దశలలో తండ్రి రూపం మనసులో గిర్రున తిరిగింది. ఆనాడు... ఆదే.... తండ్రి తన నిర్ణయాన్ని నిర్దయగా తృణీక

రించిననాడు ... ఆయన ముఖంలో కనిపించిన రౌద్రం, తన ఆశాకుసుమా లని కర్కశంగా నలిపి రేకులు చిదిమి నాశనం చేసింది.

ఏనాడూ తండ్రి ఎదుట నిలబడి సూటిగా తలెత్తి ఆయన ముఖంలోకి చూడటం అలవాటులేని తను ఆనాడు ధైర్యంచేసి ఆయన ముందు పెదవి విప్పాడు.

అప్పుడప్పుడే ఆకారం దిద్దుకుంటున్న తన అంతరంగాన్ని ఆయనముందు పరిచాడు.

అంగీకరిస్తాడనే ఆశతో... తన జీవిత సహచరి నిర్ణయంలో తనకు ఆలంబ నగా నిలిచి, తన ఆనందసౌధానికి పునాది రాయియై తనకు తోడ్పడతాడనే కొండంత ఆశతో తను పెదవి విప్పాడు.

కానీ...కానీ అనాదిగా మనసున్న మనిషికి జరుగుతున్న అన్యాయమే తనకూ జరిగింది.

కులం, అంతస్తు అడ్డుపడి విచక్షణా రహితంగా ఆయన హృదయాన్ని మళ్ళించి కొడుకు ఆనందానికి సమాధి కట్టాయి.

తరతరాల తండ్రి రక్తంలో గూడు కట్టుకున్న అజ్ఞానానికి తన జీవితం బలి అయింది. ఆ చిన్న వయసులో భవిష్యత్ జీవితంలో తనకు కావలసింది ఏమిటో గుర్తించేలోపుగానే పరిస్థితి చేయిదాటి పోయింది.

ఆర్ద్రతతో రావు హృదయం పిండె నట్లయింది.

ఛ ... ఏమిటిది? చనిపోయిన తండ్రిపట్ల ఇప్పుడు తనకీ ఆలోచనలు ఏమిటి? లేదులేదు... తండ్రిని తాను ఏనాడూ తప్పు పట్టలేదు. తండ్రినేకాదు ఎవరినీ తప్పు పట్టటం తన ఉద్దేశం కాదు. తాను ఎప్పుడూ తనచుట్టూ ఉండే వ్యక్తుల ప్రవర్తనను సమన్వయం చేసుకుంటూనే జీవిస్తున్నాడు. తన బాధకి ఎవరో కారణం అనుకోవటం శుద్ధ తెలివి తక్కువ. తండ్రిని ఎదిరించే శక్తి తనకు ఆనాడు ఉండి ఉంటే తన జీవితం మరోలా ఉండేదేమో! కాని ఆనాడు తనకు ఆ శక్తి ఎలా వస్తుంది? కనీసం ఒక్కరైనా తనకు అండగా నిల్చి, అర్థం చేసుకున్నట్టయితే ముందు జీవితంలో కావలసిందేమిటో ఏ శక్తయినా నిర్ద్వంద్వంగా తన చెవిలో చెప్పినట్లయితే తాను ధైర్యంచేసి తనకు కావలసింది పొందేవాడు. తనకేం కావాలో స్పష్టంగా తెలిసేటప్పటికే అంతా పోగొట్టు కున్నాడు.

దీర్ఘంగా నిట్టూర్చి లేచి నిలబడ్డాడు రావు.

వెదురు బద్దలతో చేసిన గేటుని తీసుకుని బయటకు అడుగు పెట్టాడు.

తెల్లని ఇసుకపై పాదాలు బరువుగా పడుతున్నాయి. చిరు వెన్నెల కాంతిలో పాదాలకింద ఇసుకమరింతగామెరుస్తున్నది. మెల్లగానడచి తారురోడ్డుని చేరుకున్నాడు. రోడ్డుపై ఒకటీ అరా బస్సులు, లారీలు తిరుగుతూ నిశ్శబ్దాన్ని చెదరగొడు తున్నాయి.

రోడ్డుదిగి దూరంగా కనిపిస్తున్న సర్వే చెట్లవైపు నడిచాడు. ఎడ్లబళ్ళు పోయిన మార్గం అంతా ఎత్తుపల్లాలుగా గుంటలు పడి ఉంది. ఆ గుంటలని తప్పించి మెత్తని ఇసుకలో నడక సాగించాడు.

చిన్నతనంలో ఈ దోవవెంటే వెళ్ళి కొద్ది దూరంలో ఉన్న కుంటేటిలో మిత్రులతోకలసి ఈతకొట్టి వచ్చేవాడు.

బాల్యస్మృతులెన్నో లీలగా మనసులో




మెదలసాగాయి.

ఎడంపక్కగా ఉన్న సర్వీతోట గాలికి కదులుతూ వింతచప్పుడు చేస్తున్నది చెవులు రిక్కించి ఆ చప్పుడు వింటూ ఒక్కక్షణం నిలబడ్డాడు. తిరిగి తోటలోకి అడుగులు వేశాడు.

గాలికి తలలూపే సర్వీచెట్ల కింద చీకటి వెలుగులు దోబూచులాడుతున్నాయి తలపైకెత్తి సన్నని దారాల్లా కదిలే సర్వీ చివర్ల సందులనుండి నక్షత్రాలతో నిండిన ఆకాశాన్ని చూసాడు. లేత వెన్నెల కిరణాలుపడి సర్వీ చివరలు వెండి తీగల్లా తళతళ మెరిసాయి

ఎత్తిన తల దించకుండా ఒక్క నిముషం తదేక ధ్యానంతో ఆ దృశ్యాన్ని చూసి తోట బయటకు వచ్చేసాడు. బాటకు కుడి పక్కగా ఉన్న మామిడితోపు సరికొత్త పూతతో నిండుగా గంభీరంగా నిలబడి ఉంది. మెరుస్తున్న ఆ కొత్త చివుళ్ళను చూసేసరికి గుండెల్లో కోయిల కంఠం పలికినట్లయింది.

నవ్వుకున్నాడు రావు.

మామిడి చివుళ్ళకు, కోయిల కంఠ స్వరానికి గల అవినాభావ సంబంధం తనకు అలా అన్పించి ఉంటుంది.

తిరిగి గ్రామం వైపు అడుగులు వేశాడు. తారురోడ్డు చేరుకుని కుడి పక్కగా నడచి ఎదురుగా కన్పిస్తున్న వీరబ్రహ్మేంద్రస్వామి మఠం రాతి అరుగుమీద చతికిలబడ్డాడు.

మఠం అభిముఖంగా ఊరు ఉంటే, మఠం వెనుకపక్క విశాలంగా పరచుకున్న ఇసుకదిబ్బలు అంతెత్తున బారులు తీరి నిలబడ్డాయి. తనకు చిన్నప్పటినుండి వెన్నెలలో ఆ ఇసుకదిబ్బలను చూడటం ఎంతో ఇష్టం. అసలు ఈ ఊరంటేనే తనకి ఎంతో మమకారం. తను పుట్టి పెరిగిన ఊరుగా కంటె తనకు నచ్చిన అందాలు తొణికిసలాడే ఊరుగా తన హృదయంలో శాశ్వతంగా ముద్ర వేసుకుంది.

ఉదయం నుండి తనలో రేగిన ఆందోళనని మరపిస్తూ చిరుగాలి ఆప్యాయంగా శరీరాన్ని నిమిరిపోతోంది.

హఠాత్తుగా రావుకి రామనాథం మాష్టారు గుర్తుకువచ్చారు ఈమఠంఅరుగు పైనేకదూ రామనాథం మాష్టారు విద్యార్థులకు అనేక విషయాలు బోధిస్తుండేవారు.

ఆనాటి మాష్టారి రూపం కళ్ళెదుట నిలచి మాష్టారి గంభీర కంఠం చెవుల్లో మారు మోగినట్లయింది.

అప్రయత్నంగా రావు కళ్ళు చెమర్చాయి.

ఈ గడ్డమీద పుట్టి పెరిగిన మాష్టారి ప్రస్తుత దుస్థితి తలపుకు వచ్చేటప్పటికి గుండెలు భారమనిపించాయి

జీవితం ఎంత చిత్రమైంది- నిట్టూర్చాడు రావు.

కొన్ని గంటల్రకితం తండ్రి చితికి నిప్పంటించి భగ్గున ఎగసిన మంటలవైపు అశ్రునేత్రాలతో చూస్తూ నిలబడినప్పుడు కూడా తన హృదయంలో ఇవే మాటలు సుళ్ళు తిరిగాయి.

మనిషి జీవితంలో మరణం ఎంత అనివార్యమైనా, ఆ జీవి సంతృప్తిగా కళ్ళు మూసేనే ఆ జీవితానికి సాఫల్యత. అసంతృప్తి జ్వాలల్లో క్షణక్షణం మండి మసి అయ్యే జీవితాలు ప్రతినిత్యం మరణ యాతన అనుభవిస్తూనే ఉంటాయి. ఏదీ శాశ్వతంకాని ఈ ప్రపంచంలో మానవ జీవితాన్ని నిర్దేశించే శక్తులు ఎంతనిర్దయగా తమ పాత్రను నిర్వహిస్తున్నాయి! ఎంత



అమానుషంగా మనిషి ఆనందాన్ని హరిస్తున్నాయ్!

మనిషి జీవితానికి ఎందుకూ ఉపక రించని ఈ సంఘ కట్టుబాట్లు మరణ పర్యంతం మనిషిని వెన్నాడుతూనే ఉంటాయి. అంతరంగాన్ని అణిచి, ఆశలను చిదిమి నిత్యం పందలాది జీవచ్ఛవాలని తయారుచేస్తుందీ సంఘం.

చస్తే కాలిబూడిదఅయ్యే ఈ శరీరంపై ఎన్నో ఆంక్షలు, నీతిసూత్రాలు, ధర్మ పన్నాలు ఓహ్... అన్నీ... అన్నీ మిథ్యా విలువలు.

ఇవికావు జీవితాన్ని పాలించవలసినవి. ఇవికావు మనిషికి ఆనందాన్నిచ్చేవి. వీటికి మించిన విలువలని మనిషి సాధించనిదే, మనిషికీ మనిషికీ మధ్య మమతల వంతెనల్ని నిర్మించుకోనిదే మానవ జీవితానికి విముక్తిలేదు. అంతవరకు మనిషి జీవితంలో ఈ సంఘర్షణ తప్పదు.

రావు లేచి ఇంటివైపు అడుగులు వేశాడు.

అక్కడ ఉన్న వారంరోజుల్లో చేయ వలసిన విధులన్నీ నిర్వహించాడు. రావు అక్కడ ఉండగానే ఇందిర రాసిన ఉత్తరం అందింది. మావగారు పోయినం దుకు విచారం ప్రకటిస్తూ, తను వచ్చి చేసేదేమీలేదు కనుక, అంతదూరం ప్రయాణంచేసి వచ్చినా ఆ పల్లెటూరులో తాను ఉండలేదు కాబట్టి భర్తనే చేయ వలసిన పనులన్నీ చక్కబెట్టి రమ్మని ఆ ఉత్తరం సారాంశం.

"ఇంటిని అమ్ముతావా?" అని రాఘవయ్యగారు అడిగినపుడు ఏమీ సమాధానం ఇవ్వలేకపోయాడు.

ఆ ఊరికి తనకి ఉన్న ఒకేఒక్క బంధం ఆ ఇల్లు. ఏనాటికైనా- జీవితం చివరిదశలో అయినా ఆ ఇంటిలో, తనకు ఇష్టమైన ఆ ఊరి పరిసరాల్లో ప్రశాం తంగా కాలం వెళ్ళబుచ్చాలనే కోరిక ఒకటి లోలోపల ఉంది.

అమ్మనని రాఘవయ్యగారికి చెప్పి ఇల్లు అద్దెకు ఇచ్చి మధుతో తిరుగు ప్రయాణం కట్టాడు రావు.

**8**

...వివాహం జీవితంలో ప్రధానమైన మలుపు. ఈ మలుపు దగ్గరే మనం వివేకంతో ప్రవర్తించాలి. లేకుంటే భవిష్యత్ జీవితానికి మన ఆనందాన్ని బలిఇచ్చి జీవించినన్నాళ్లూ వేదనతోనే గడపవలసివస్తుంది...

క్షణాలు గంటలై, గంటలు రోజులై, రోజులు నెలలై, నెలలు సంవత్సరాలై అనంతకాలవాహినిలో కనుమరుగవుతు న్నాయ్. రావు దినచర్యలో మార్పులేదు. మనసులో అసంతృప్తి నివురుగప్పిన నిప్పులా వుండి ఆరని ఆవేదనను రగిలి స్తూనే వుంది. వైవిధ్యం కోరే మనసు యాంత్రికతను భరించలేక నిస్పృహ కౌగిలిలోకి ఒదిగిపోతుంటే వివేకం కూడదని వారిస్తోంది.

జీవితంలో పేరుకునిపోతున్న వెలితి ఇంతింతై వటుడింతై అన్నట్టు పెరిగి పెరిగి అంతరంగాన్ని కోత పెడుతోంది.

కలకాలం గుర్తుంచుకునే, తిరిగి తిరిగి నెమరు వేసుకునే సంఘటనలేవీ లేవు జీవితంలో. ఎడారిలా శూన్యంగా పరచుకున్న జీవితపథంలో నడిచినడిచి అలసిపోయిన తనకు దప్పిక తీర్చుకునేం దుకై ఒయాసిస్సు ఏదీ కనుచూపుమేరలో కనబడటంలేదు.




నడవగా నడవగా ఏనాడో ఈ వ్యర్థ జీవితానికి తెరపడుతుంది. అప్పటివరకూ మండే తన గుండెలు శాంతించవేమో! ఈ అన్వేషణకు అంతం బహుశా అదే అయి ఉంటుంది. ఛ...ఏమైంది తనకీరోజు! ఎందుకిలా ఆలోచిస్తున్నాడు? ఓటమిని అంగీకరిస్తున్నాడా? పరిస్థితులతో పోరాడే శక్తి తనలో నశించిపోయిందా? ఏమిటిది! ఎంతకాదనుకున్నా రావు హృదయంలో వేదన క్షణక్షణం పెరిగిపోతోంది. అప్రయత్నంగా కన్నీళ్ళు తిరిగాయి. ఆ కన్నీటిని చూచి ఆశ్చర్యం కలిగింది. చటుక్కున కన్నీరు అద్దుకుని డాబా పైకి నడిచాడు.

"నాన్నగారూ!"

"ఏం మధూ!" మ్లానమైన ముఖంలోకి చిరునవ్వు తెచ్చుకుని కొడుకు వైపు చూశాడు.

సందిగ్ధావస్థలో ఉన్న మధు మాట్లాడలేదు.

కొడుకు ఏదో చెప్పటానికి వచ్చాడని అర్థమైంది రావుకి.

"ఇలా కూర్చో మధూ!"

మధు దగ్గరకువచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

వయసువచ్చి ఎంత ఎదిగిన కొడుకుని అప్పుడే చూస్తున్నట్టు పరిశీలనగా చూస్తున్నాడు రావు.

తను వచ్చిన విషయం తండ్రికి ఎలా చెప్పాలో బోధపడక సంకటావస్థలో పడ్డాడు మధు.

కొడుకు ఎందుకు సందేహిస్తున్నాడో అర్థంకాలేదు. "ఏమిటి చెప్పు మధూ! పరీక్షలు బాగా రాశావుకదూ?"

"రాశాను"

ఈ సంవత్సరంతో మధు చదువు పూర్తవుతుంది.

తండ్రికొడుకులిద్దరి మధ్యా కొంతసేపు మౌనం.

ఏదో చెప్పబోతున్నట్టుగా కంఠం సవరించుకున్నాడు మధు.

కొడుకు స్థితి రావుకి నవ్వు తెప్పించింది.

నవ్వుతున్న తండ్రి ముఖం చూస్తూ చెప్పదలచుకున్న మాటలు కూడగట్టుకుంటున్నాడు.

"నా క్లాస్‌మేట్ రాధ అని... ఆ అమ్మాయిని నేను పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను" భావోద్వేగంతో మధు కంఠం వణికినట్టయింది.

రావు మాట్లాడలేదు. కొడుకు ముఖంలో భావాలని చదవటానికి ప్రయత్నిస్తున్నాడు.

తండ్రి మౌనం మధుకి ఇబ్బంది కలిగించింది.

"మధూ! నీవు చెప్పాలనుకునే విషయం స్పష్టంగా చెప్పు. ఇటువంటి ముఖ్యమైన నిర్ణయాల్లో అస్పష్టత పనికిరాదు"

తండ్రి కంఠంలోగల సౌమ్యతకు కోల్పోయిన ధైర్యం కూడదీసుకున్నాడు మధు.

"రాధకి, నాకు దాదాపు రెండు సంవత్సరాలుగా పరిచయం ఉంది. ఆ పరిచయంతోనే మేమిద్దరం కలసి జీవితాన్ని పంచుకోవాలనే నిర్ణయానికి వచ్చాం"

నిట్టూర్చాడు రావు.

"మధూ! నీవు చిన్నవాడివి కాదు. నీ జీవితాన్ని ఏ విధంగా మలచుకోవాలో నిర్ణయించుకునే పాటి వివేకం నీకుందని నా నమ్మకం. నీ మనసుకి వ్యతిరేకంగా నేనెట్టి పరిస్థితుల్లోనూ ప్రవర్తించను.





అయితే...."ఆగి కొడుకు దెస చూశాడు.

"ఏమిటి నాన్నగారూ?"

"వివాహం జీవితంలో ప్రధానమైన మలుపు. ఈ మలుపు దగ్గరే మనం వివేకంతో ప్రవర్తించాలి. లేకుంటే భవిష్యత్ జీవితానికి మన ఆనందాన్ని బలి ఇచ్చి జీవించినన్నాళ్ళు వేదనతోనే గడపవలసి వస్తుంది"

తండ్రి చెప్తున్నది కాదనలేనట్లుగా మధు మెల్లగా తల ఊపాడు.

"యౌవనంలో ఉన్న వారికి ఈ ప్రపంచం వింతవింత అందాలతో దర్శనమిస్తుంది. అందమైన స్త్రీని చూసినపుడు హృదయం లయతప్పి వివేకం మరుగున పడి ఆ అందాన్ని ఆస్వాదించాలనే కోరిక కలగటం ఈ వయసుకి సహజం. స్త్రీ పురుషుల మధ్య ఆకర్షణ బలీయమైంది. ఒక్కసారి ఆ ఆకర్షణకులోనై వివేకశూన్యంగా జీవితంపట్ల నిర్ణయం తీసుకున్నామంటే చివరకు మన అస్తిత్వాన్నే పోగొట్టుకుంటాం"

"కానీ నాన్నగారూ..."తండ్రి ధోరణికి అడ్డుపడుతున్నట్లుగా అన్నాడు మధు.

చెప్పటం ఆపి కొడుకు ఏం చెబుతాడో అన్నట్లుగా మధు ముఖంలోకి చూస్తుండిపోయాడు రావు.

"నాన్నగారూ! ఇది కేవలం ఆకర్షణతో తీసుకున్న నిర్ణయంకాదు. రాధతో సహచర్యాన్ని నా మనసు కోరుకుంటున్నది. ఒక్కరోజు రాధను చూడలేక




పోతే ఏదో పోగొట్టుకున్నట్లుగా నామనసుకి తెలుస్తున్నది. రాధ అందమైనదే కావచ్చు కానీ నాకు కావలసింది రాధ తప్ప రాధ అందం కాదు'' నన్నర్థం చేసుకోండి అన్నట్లుగా తగ్గస్వరంతో తన బాధను విప్పిచెప్పటానికి ప్రయత్నించాడు మధు.

కొడుకు కళ్ళలో ప్రతిఫలిస్తున్న భావం రావుకి అర్థం అయింది. కొడుకు స్వభావం తెలిసి ఉండటంచేత ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చినట్లు నమ్మకం కలిగింది.

"సరే... రేపొకసారి ఆ అమ్మాయిని తీసుకునిరా నేను చూస్తాను"

ఆనందంతో మధు ముఖం వెలిగింది. ఆ సంతోషంతో తిరిగి వెళ్ళబోతూ ఏదో గుర్తువచ్చినవాడిలా చటుక్కున ఆగాడు.

ప్రశ్నార్థకంగా చూశాడు రావు.

''కాని నాన్నగారూ... ఆ అమ్మాయి కులం...''

నవ్వాడు రావు. మెల్లగాలేచి కొడుకు చేతులను చేతుల్లోకి తీసుకుని కళ్ళల్లోకి చూస్తూ–''దీనికి నా సమాధానం ఏమిటో

నీకు తెలియదా మధూ" అన్నాడు.

ఆ సమయంలో మధుకి తండ్రి ఒక ఆప్తమిత్రునిలా గోచరించాడు. కృతజ్ఞత నిండిన హృదయంలో తండ్రిపట్ల గౌరవ భావం అధికమై తండ్రి చేతులను ముద్దిడుకుని "థాంక్యూ...థాంక్యూ" అంటూ కిందకుదిగి వెళ్లాడు.

* * *

''నమస్కారమండీ!"

"నమస్కారం...కూర్చోమ్మా!"

నమ్రమతను, తెలివిని సూచించే ముఖ కవళికలు. వంటిరంగు ఛామన ఛాయే అయినా పొందికగా అందంగాఉంది రాధ.

ట్రేలో మూడు కప్పుల కాఫీ తీసుకు వచ్చాడు మధు.

''మా మధు నీకు పూర్తిగా నచ్చాడా అమ్మా? అందే నా ఉద్దేశం...''

అర్థమైంది అన్నట్టుగా రాధ చిరునవ్వు నవ్వి మెల్లగా తల ఊపింది.

ఆమె నవ్వులో అనవసరపు సిగ్గుగాని, మరే ఇతర అసహజత్వంగాని లేదు.

ఎదురుగావున్న మధుని చూస్తూ, ''మధూ, నేను ఒకరిని ఒకరం పూర్తిగా తెలుసుకునే,అర్థంచేసుకునే ఈ నిర్ణయానికి వచ్చామండీ!" స్థిరంగా స్పష్టంగా పలికింది రాధ.

జీవితభాగస్వామిని ఎన్నుకునే ప్రయత్నంలో కొడుకు త్వరపడలేదనే అనిపించింది రావుకి.

"కాని మధు చదువు ఇప్పుడేకదూ పూర్తయింది! ఉద్యోగం వచ్చి స్థిరపడిందాక మీ పెళ్ళి వాయిదా వేయటం మంచిదేమో?"

ఆలోచించండి అన్నట్లుగా ఉంది రావు కంఠస్వరం.




"పెళ్ళి ఇప్పుడే చేసుకోవాలనే ఉద్దేశం మాకూలేదు నాన్నగారూ. మీరు చెప్పినట్లే వాయిదా వేస్తాం"

"గుడ్" ఇద్దరినీ అభినందిస్తున్నట్లుగా చూశాడు రావు.

"నాన్నగారూ..." నసుగుతున్నట్టుగా అన్నాడు మధు.

"అమ్మతో ఈ విషయం..."

"నేను చెబుతాను"

"థాంక్యూ" అంటూ గొణిగాడు.

"మరి నే నా స్తా నం డీ" చేతులు జోడించింది రాధ.

"మంచిది...అప్పుడప్పుడూ వస్తుండు అమ్మా!"

"అలాగేనండీ!"

* * *

మెట్లెక్కి కాలింగ్‌బెల్ నొక్కాడు రావు.

"మీరా...రండి!"సంతోషంగా ఆహ్వానించింది మాధురీదేవి.

ఆమెను అనుసరించి పెళ్ళి తను అక్కడికి వచ్చినప్పుడల్లా కూర్చునే కుర్చీలో చేరగిలబడ్డాడు.

"దాదాపు రెండునెలలుగా మీరు ఇటు రానేలేదు" నిష్ఠూరంగా అంది ఆమె.

"అవును...ఇటు రావటంపడలేదు"

"ఉండండి...వేడిటీ తీసుకునివస్తాను"

దగ్గరలోని టేబిల్‌పై తెరచిపెట్టిన పుస్తకం చేతుల్లోకి తీసుకుని చూశాడు. తత్వశాస్త్రానికి సంబంధించిన గ్రంథం.

"తత్వశాస్త్రం మీకు ఇష్టమా?" టీ కప్పు అందుకుంటూ అడిగాడు.

"లేదు. ఏదో చదువుతున్నానేకాని అర్థం అయ్యీకానట్టుగావుంది"

"ఎందుకని? మనసుపెట్టి చదవటం లేదేమో!"

"తెలుసుకోవాలనే ఆసక్తితోనే చదువు

తున్నాను. కాని అర్థంఅయి చావటం లేదు"

నవ్వాడురావు. "మనం మనజీవితాలని నిశితంగా పరిశీలించగలిగితే మనకు తెలియకుండానే మనలో తాత్త్వికచింతన బయలుదేరుతుంది"

"మీరన్నది నిజమే. జీవితం చెప్పలేనిది ఏముంటుంది?"

పుస్తకంమూసి టేబిల్ పైపెట్టాడు.

"అన్నట్టు ఈమధ్య కొత్త చిత్రాలు ఏమన్నా వేశారా?''

''ఏవో వేస్తూనేవుంటాను. వేయకుండా ఉండలేక"

"మీవంటి కళాకారులకు జీవితం అంతా ఆనందమయంగా గడచిపోతుం దేమో!''

"అలాఅని ఎందుకనుకుంటున్నారు?"

"ఏ వ్యాపకంలేని నావంటివారి జీవితాలు నిరర్ధకంగా గడుస్తున్నాయిగనుక"

"మీరూ మీకు నచ్చిన వ్యాపకం కల్పించుకోవచ్చుగా?"

"అది ఎలా సాధ్యం? లోకంలో అందరూ కళాకారులే కాగలరా?"

"కాకపోవచ్చు. కాని ఎవరి అభిరుచిని బట్టివారు వ్యాపకం ఏర్పరచుకోవటానికి అనేక మార్గాలున్నాయి"

"ఊ..." ఆమె నోటినుంచి గాఢమైన నిట్టూర్పు.

"నిజం చెప్పాలంటే, జీవితం చాలా నిస్సారంగా అనిపిస్తుంది రావుగారూ!"

ఆమెదెసె పరికించిచూశాడు. ముఖంలో నిస్పృహఛాయలు తారట్లాడుతున్నాయి.

''నిరాశపడుతున్నారా?''

''నిరాశకాక మిగిలింది ఏముంది?''

"ఈరోజు ఎందుకో చిత్రంగా మాట్లాడుతున్నారు. మీకేం కావాలో నిర్ధారించుకుని దానికై ప్రయత్నించకుండా ఈ నిరాశ దేనికి?''

''నిజమే. కానీ ఒంటరితనం చిత్రవధ చేస్తోంది''

''ఈ ఒంటరితనం పోవాలంటే ఒకటే మార్గం'' నవ్వుతూ అన్నాడు రావు.

''ఏమిటది?''

"మీరు తిరిగి వివాహం చేసుకోవటం''

నవ్విందామె.

''ఇప్పుడా...? ఈవయస్సులోనా?''

''ఒంటరితనం నుండి విముక్తి పొందటానికై చేసుకునే వివాహానికి వయస్సుతో నిమిత్తం ఏముంది?''

''బాగుంది మీరు చెప్పేది. అయినా చేసుకునేవారెవరు?''

''ప్రయత్నించండి. మీరు నచ్చిన, మిమ్మల్ని మెచ్చిన వ్యక్తులు ఎవరయినా తటస్థ పడకపోతారా''

"అది అంత తేలికైన విషయం అంటారా?''

రావు మాట్లాడలేదు.

క్రమంగా గదిలో... వెలుగుకి వీడ్కోలు ఇచ్చి చీకటి ప్రవేశిస్తోంది.

ఆమె లేచి లైటు వేస్తుందేమో అని చూశాడు.

కాని ఆమె ఆ ప్రయత్నంలో ఉన్నట్టు లేదు. ఊదారంగు మీద చుక్కలు గల చీర నక్షత్రాలు పొదిగిన ఆకాశాన్ని తలపింప చేస్తోంది. గత ఏడెనిమిది సంవత్సరాలుగా ఆమె శరీరంలో వచ్చే మార్పులు రావు గమనిస్తూనే ఉన్నాడు.

ఆమె ముఖంలో రానురాను గూడు కట్టుకుంటున్న అసంతృప్తి ఛాయలు, ఆనందం హరించుకుపోగా కళావిహీనమైన చూపులు, భరించలేని ఒంటరితనం

ఆమె మానసంపై శరీరంపై వేసే ముద్రలు రావు దృష్టిపథాన్ని దాటిపోలేదు.

సాటి మనిషిగా ఆమెపట్ల తనకు సానుభూతి ఉంది కాని, అది ఆమెకు కావల్సిందాన్ని ఇవ్వలేదు.

నిట్టూర్చాడు.

''అలాఉన్నారేంమాధురీ...ఏమైంది?'' ఆప్యాయంగా అడిగాడు. సమాధానం లేదు.

తల వంచుకుని కూర్చుని ఉన్న ఆమె కళ్ళనుండి రెండు అశ్రుకణాలు జారి ఒడిలో పడటం చూశాడు.

''ఎందుకీ బాధ? నాతో చెప్పండి'' అనునయంగా అడిగాడు.

తెలిసి అడిగిన ప్రశ్న. అంతకంటె ఏమనాలో తోచలేదు.

ఆమె మెల్లగా లేచి లైటు స్విచ్ వేయ టానికి అటుకేసి రావు పక్కగానడుస్తూనే చటుక్కున రావు భుజంపై తలవాల్చి అతని కంఠంలో ముఖం దాచుకుంది. అతని భుజంపై వాలిన ఆమె సగం శరీరం సన్నగా ప్రకంపిస్తోంది. వెచ్చని ఆమె ఊపిరి కాలిన కొరకంచులా రావుని తాకెంది.

ఈ హఠాత్పరిణామానికి నివ్వెర పోయిన రావు వెంటనే సర్దుకున్నాడు. తన రెండు చేతులతో ఆమె ముఖాన్ని పైకెత్తి లేచి నిలబడ్డాడు. సున్నితంగా ఆమె చేతిని పట్టుకుని నడిపించుకుని వెళ్ళి కుర్చీలో కూర్చోపెట్టాడు.

ఆమె అతని చేతిని వదలక అరచేతిని వణకుతున్న తన పెదవులతో స్పృశి స్తుండగా...మెల్లగా చేతిని విడిపించుకుని వచ్చి లైటు వేశాడు.

దేదీప్యమానమైన కాంతి ఒక్కసారిగా గది అంతా పరచుకుంది.

చలిస్తున్న కళ్ళతో తలెత్తి ఒకసారి రావుని చూసి తిరిగి తల వంచుకు కూర్చుందామె. రావు కొంతసేపు ఆమెను పరికిస్తూ ఉండిపోయాడు.

కొన్నిక్షణాలు గడిచాయి.

''సారీ'' అస్పష్టంగా ఉంది ఆమె కంఠం.

''మీరంటే...మీరంటే నాలో తెలియని ఇష్టం ఏర్పడింది. బహుశా మీరొక్కరే నన్ను అర్థం చేసుకోగలవారనే నమ్మకం తోనే ఆ ఇష్టానికి బీజాలు ఏర్పడ్డాయను కుంటాను. అవి ఈనాటికి మహావృక్షమై మీరు అనుక్షణం కావాలని మనసు తీవ్రంగా కోరుకుంటోంది. అందుకే ... నాకు తెలియకుండానే నేను అలా ప్రవర్తించాను... క్షమించండి''

''......''

''తప్పుచేశానా? మీ ఉద్దేశం తెలుసు కోకుండా...పొరపాటైతే మన్నించండి''

రావు పెదవులపై స్నేహపూర్వకమైన నవ్వు విరిసింది.

''మీరు చేసింది తప్పని నేను అను కోవటం లేదు''

''మరి... మీ అభిప్రాయం....''

''ఒంటరితనంతో వ్యథ చెందే హృదయం తోడు కోసం వెతుక్కోవటం సహజం. కానీ....''

తలెత్తి అతని కళ్ళలోకి చూసిందామె.

''చూడండి మాధురీ! మన మధ్య ఉన్న పరిచయంవల్లనో, లేకుంటే నాలో గల ప్రత్యేకతలేమైనా మిమ్మల్ని ఆకర్షించో మీరు ఈ నిర్ణయానికి వచ్చుంటారు. మనం పరస్పర అంగీ కారంతో మరికొంత ముందుకు వెళ్ళినా గాని అది తాత్కాలిక అనుభవం మాత్రమే అవుతుంది. మన మధ్య




స్నేహానికి ఈ విధమైన రూపం ఇచ్చే ట్టయితే దాన్ని మనం పోగొట్టుకుంటాం"

"ఎలా? అర్థంకాలేదు"

"ఈవిధంగా అయితే మనం ఎంతో కాలం స్నేహితులుగా ఉండలేం''

''ఎందుకని?''

"జీవితం పట్ల నాకు ఉన్న నిర్ణయాలు వేరు మీ నిర్ణయాలు వేరు. ఏ చిన్న అనుభవమైనా నా మనసుకి ప్రగాఢంగా హత్తుకుంటుంది. అలా హత్తుకోగల అనుభవాలనే నేను కోరుకుంటాను. నా మనసుని కదిలించే శక్తిలేనివాటి జోలికి నేనుపోను"

"అంటే, నేనంటే మీకు...''

"మీపట్ల నాలో మీరనుకునే అభి ప్రాయం ఇంతవరకు కలగలేదు. బహుశా ఇకముందు కూడాకలగదేమో!చెప్పానుగా జీవితం పట్ల నాకున్న నిర్ణయాలు వేరని. ఆక్రమంలో నేను మీకు న్యాయం చేయలేను."

"అయాం వెరీసారీ...."సిగ్గుపడు తున్నట్టుగా అంది.

"ఫరవాలేదు. ముందేచెప్పానుగా-నేను మిమ్మల్ని తప్పుపట్టటంలేదని. మీ మన సేమిటో మీరు చెప్పారు. నా మనస్థితి కూడా మీకు తెలియాలనే నా ఉద్దేశం. శాశ్వతమైన ఆనందంకోసం అర్రులుచాచే నా మనసు తాత్కాలిక ఆనందం కై చలించదు. దయచేసి నన్ను అర్థం చేసు కోండి" అనునయిస్తున్నట్టుగా ఆమె చేతిని చేతులలోకి తీసుకుని ఆప్యాయంగా నొక్కి వదలివేశాడు రావు.

ఇద్దరిమధ్యా మౌనం నెలకొంది. ఏం మాట్లాడాలో ఇద్దరికీ తోచటంలేదు. ఏదో ఇబ్బందిగా, ఎబ్బెట్టుగా అనిపిస్తోంది.

వాతావరణం గ్రహించిన రావు, "మన మధ్య జరిగిన ఈ విషయం ఇద్దరం మర్చి పోయి మనం ఎప్పటిలా స్నేహితులుగా వ్యవహరించాలని నా విన్నపం" అన్నాడు.

అతనిపట్ల కలిగిన గౌరవభావం కళ్లల్లో తొణికిసలాడుతుండగా మెల్లగా తలవూపి తన ఆమోదాన్ని ప్రకటించిందామె.

"మీవంటి మిత్రుణ్ణి పొందగలగడమే గొప్ప అదృష్టం"

"పొగడ్తా'' నవ్వుతూ అన్నాడు.

"కాదు వాస్తవం. పురుషులలో మీ వంటివారు అరుదు"

''పొరపడుతున్నారు. జీవితానికి ఒక లక్ష్యాన్ని ఏర్పరచుకుని ఆ లక్ష్యంవేపుగా ముందడుగువేస్తూ మహోన్నతంగా ఎదిగిన మహాపురుషులు ప్రపంచంలో ఎంతోమంది ఉన్నారు. మనం వారంతటి వారంకాక పోయినా కనీసం వారినిఆదర్శంగా తీసుకు నయినా ముందుకు వెళ్ళగలగాలి...ఏమం టారు?"

"నిజమే. కాని నాకో సందేహం'

"ఏమిటది?"

''మనసులో తలఎత్తే కోరికల్ని భౌతికానుభవంలోకి తీసుకోవటం తప్పంటారా?"

''కోరికలకు అంతం ఎక్కడ? ఒకటి నెరవేరితే మరొకటి తలఎత్తక మాను తుందా"

''అంటే మీ ఉద్దేశం... కోరికలు లేకుండా మనిషి జీవించగలడా?

''జీవించలేకపోవచ్చు. కానీ, మన వివేకాన్ని చంపి మన అస్తిత్వానికి భంగం కలిగించే కోరికలు జీవితాన్ని అస్తవ్యస్తం చేస్తాయి. నేననేది ... కోరికలు మనల్ని స్వాధీనం చేసుకుని మనపై పెత్తనం చెలాయించకుండా మనమే కోరికల్ని స్వాధీన పరచుకోవాలని"



"అది అందరికీ సాధ్యం అవుతుందా?"

"సాధ్యమా, అసాధ్యమా అనేది వారి వారి మనోబలంమీద ఆధారపడి ఉంటుంది. ఆ మనోబలం స్వభావాలు, నిర్ణయాలు, జీవనపద్ధతులమీద ఆధారపడి ఉంటుంది. మనిషి తలచుకుంటే సాధించలేనిది ఏముంటుంది?

"కోరికలని నిగ్రహించుకోలేని వారి మాటేమిటి?"

"చెప్పానుగా... ఈ విషయం వారివారి మనోబలంమీద ఆధారపడి ఉంటుందని. ఈ మనోబలం ఒకరి నుండి నేర్చుకునేది, ఒకరితో నేర్పబడేది కాదు. అది ఒక మానసిక సాధన. జీవిత రహదారులలో ఎవరికి నచ్చిన ఆనందం వారు వెతుక్కుంటూనే ఉంటారు. అది తప్పనే అధికారం మనకెక్కడిది?''

"ఇన్నాళ్ళుగా మీరు ఒక మంచి స్నేహితుడిగా నన్ను ఆదరించారు. నావంటి స్త్రీల పరిస్థితి అవకాశంగా తీసుకుని తమ స్వార్థానికి వినియోగించుకోవాలని చూసే అవకాశవాదులే ఎక్కువ. ఈనాటి సమాజంలో అటువంటివారు నా జీవితంలోకూడా ఇద్దరు ముగ్గురు తటస్థ పడకపోలేదు. అందుకే ఎంత బాధ అయినాగాని ఒంటరితనాన్ని భరించక తప్పటంలేదు. ఏమిటో... ఈ పరిస్థితి ఎప్పటికీ ఇలానే ఉంటుందేమో" నిస్పృహగా అంది ఆమె.

ఆమె నిస్సహాయస్థితికి రావు చలించాడు. ఆమెను ఎలా ఓదార్చాలో తెలియలేదు.

''జీవితం ఎప్పుడూ ఒక్కలానే ఉండదు. మీ పరిస్థితి ఎప్పటికైనా మారుతుందేమో అనే ఆశతోనే జీవించండి. నిరాశా నిస్పృహలను సాధ్యమైనంత దూరంగా ఉంచండి''

అంతకంటే ఏమనగలడు?

''చాలా టైమైంది. మరి నేను వెళతాను''

"అలాగే'' ఆమెకూడా లేచి గుమ్మం వరకూ వచ్చి అతనిని సాగనంపింది.

* * *

ఏ వ్యక్తి జీవితంలోనూ అన్నీ రసవత్తరమైన ఘట్టాలుండవు. చాలా కాలం మామూలుగా జీవించిన తరువాత ఒక్క క్షణంలో మహత్తరమైన అనుభవాలకు గురికావచ్చు. ఎక్కడో చదివిన ఈ వాక్యాలు గుర్తుకువచ్చాయి రావుకి.

నిజమే...జీవితం అంతా మహత్తరమైన అనుభవాలతో మాత్రమే నిండి ఉంటే ఆ మహత్తర అనుభవాలు కేవలం మామూలు అనుభవాలుగా మిగిలే ప్రమాదం ఉంది. ముందు జీవితంలో ఏదో అద్భుతం జరగబోతుందనే ఆశే మనిషిని జీవింపచేసేది. ఆశలూరిస్తూ అందీ అందక పరుగులెత్తే జీవితాన్నే మనిషి ప్రేమించేది. జీవితంలో కోరినవన్నీ అందుబాటులోకి వచ్చిననాడు అవి వాటి విలువను కోల్పోవటం ఖాయం. ఒక అనుభవాన్ని మనసు కోరినపుడు అనుకోకుండానే అంతరంగంలో దానికి ఎంతో విలువ ఏర్పడుతుంది. దానిచుట్టూ ఎంతో సుందరంగా తన ఆశల అల్లిక గూడుని నిర్మిస్తాడు. మనిషి జీవితం చివరి మజిలీ వరకూ సాగే ప్రయాణంలో తన ఆనందంకొరకై ప్రతి మలుపునూ అన్వేషిస్తూనే ఉంటాడు. ఆ అనంతమైన అన్వేషణే జీవితం.

కానీ...కానీ తన ఈ అన్వేషణ దేని కోసం? తన ఆనంద గమ్యం యొక్క అసలు స్వరూపం ఏమిటి? తనకీ జీవితం




నుండి కావలిసింది ఏమిటి? ఏం అపేక్షిస్తున్నాడు తను? నిరంతరం తనలో వృధ రేకెత్తించే ఈ ఆర్తి ఎందుకోసం?

సమాధానం లేని ప్రశ్నలు తలెత్తాయి.

ఇన్ని సంవత్సరాలు గడిచినా తనలో ఈ ఆవేదన చల్లారటం లేదే. అనుభవానికి అనుభూతికి మధ్యగల సున్నితమైన పొరలను తాను ఎందుకని తొలగించలేక పోతున్నాడు? అనుభూతించే శక్తివుండీ అందులోనే ఎందుకని బతకలేక పోతున్నాడు? ఏవో అనుభవాలు కావాలని కోరుకుంటోందా తన మనసు ? లేదే! మరి ఏమిటీ స్థితి?

రావు లేచి లైటు తీసివేసి బెడ్ లైటు వేశాడు. చల్లనికాంతి గది అంతా పరచుకుంది. మంచంపై వెల్లకిలా పడుకొని గోడపై పాకుతున్న నీలినీడలను తీక్షణంగా చూస్తున్నాడు.

నిద్ర రావటంలేదు. పక్కమంచంపై గాఢనిద్రలో భార్య కదలినట్లయి అటు చూశాడు. ఒక్కక్షణం ... ఒకే ఒక్క క్షణం ఆమె గుండెలలో ముఖం అద్దుకుని ఈ అశాంతినుండి బయటపడాలని... తన హృదయం కార్చే ఈ కన్నీళ్లు, ఈ క్షోభ అవతలి హృదయానికి నివేదించాలని...ఏదో ఆశ తలెత్తి తిరిగి అతనిలోనే అంతరించింది. దీర్ఘనిశ్వాసం విడచి ఇటుతిరిగి పడుకున్నాడు. పక్కనే నిద్రించే ఆ గుండెకు ఈ గుండెపడే మూగబాధ విన్పించటంలేదూ...! ఒక్కసారి తనని, తన అస్తిత్వాన్ని మరపించే ప్రేమ ఆ గుండెనుండి పొంగి ప్రవాహమై తనలో ఇముడ్చుకోగలిగితే...ఒక్కసారి ఆప్యాయంగా లాలించి తనని హృదయానికి హత్తుకోగలిగితే...

జీవరహితమైన నవ్వొకటి రావు ముఖంపై పాకి మాయమయింది.

తనకేమయింది? తనెందుకిలా అయిపోతున్నాడు? తనంటే ఏమిటో ఏనాడూ తెలుసుకోవటానికి ప్రయత్నించని మనిషి తన బాధను అర్థంచేసుకుని ఆదరించగలదా? తనలో సంభవంకాని ఈ కోరిక చ...దిగ్గునలేచి తలుపు తీసుకుని గది బయటకు అడుగుపెట్టాడు.

బయట నిశ్శబ్దం స్వేచ్ఛగా విహరిస్తోంది. ప్రపంచాన్ని కప్పిన నల్లని చీకటి భయపెడుతోంది. ఎక్కడనుండో ఒక కుక్క విడవకుండా మొరుగుతోంది. చిరుగాలికి చలిస్తున్న కొబ్బరాకుల సందులగుండా చుక్కలు మిణుకు మిణుకుమంటున్నాయి. చీకట్లోకి చూస్తూ నిలబడ్డాడు.

చెట్టు మొదట్లో గూడు కట్టుకున్న పక్షులు నిద్రలో శబ్దంచేసాయి. బాగా చిన్నతనంలో ఆకాశంలో స్వేచ్ఛగా పల్టీలు కొట్టే పక్షులని చూసి ఈర్ష్యపడేవాడు. మనిషికన్నా వాటి జీవితం విలువైందిగా తోచేది. నిరంతరం స్వేచ్ఛాగానం ఆలపించే మనసు బళ్లో పాఠాలకు, తండ్రి అదుపాజ్ఞలకు లోబడి వుండాలంటే తీవ్రంగా వ్యతిరేకించేది. అంతకంటే ఇంకా ఇంకా ఆనందంగా హాయిగా బతకాలనిపించినా అది ఎలాగో తెలిసేదికాదు. అంతకుమించిన ఆనందం అంటే ఏమిటో కూడా ఆ వయసుకి అంతుపట్టకపోయినా, ఏదో భిన్నంగా జీవించాలని మాత్రం మనసుకి తెలిసేది. స్నేహితులతో కలిసి గంటలకొలదీ కాలువలో ఈతకొట్టటం, పిచ్చిపట్టినట్టుగా చెట్టుపుట్టలవెంట అదే పనిగా తిరగటం, ఊరికి మూడు నాలుగు మైళ్ళదూరంలో వున్న సముద్రానికి బండి కట్టుకుని కెరటాలు కొడుతూ వెళ్ళడం,



ఎండిపగ్గాలు చేతిలోకి తీసుకుని ఎడ్లను అదిలించటం, కోతలుకోసే కూలీలు మధ్యాహ్నం వేళల్లో తెచ్చుకున్న భోజనం చెట్లకింద కూర్చుని తింటుంటే వారిని అదే పనిగా చూడటం; ఇటువంటి పనులే ఎక్కువ ఆనందం కలిగించేవి.

సముద్రపు అలలతో అలసిపోయేంత వరకూ ఆడుకుని, మసక చీకట్లు కమ్ముతుండగా తిరుగుముఖం పట్టేవాడు. తెల్లటి ఇసుకలో ఎడ్లబండిని మెల్లగా లాగుతుంటే తను బండిలో వెల్లకిలా పడుకుని ఆకాశం నుండి కురిసే వెన్నెలని, చంద్రుడిని చూస్తూ. ఏవో పిచ్చిపిచ్చి పాటలని గొంతెత్తి పాడుతుండేవాడు.

కనుచూపుమేరవరకు పరచుకున్న వెన్నెల ఒక మహా సముద్రంలా గోచరించేది. వేసవికాలం ఆరుబయట వెన్నెల్లో పడుకుని తమ ఇంటి ఎదురుగా ఒక్క ఆకు అయినా లేక బోడిగా ఉన్న కొమ్మలతో నిలబడ్డ చెట్టు వెనకాల నుండి తొంగిచూసే చంద్రుడిని పలకరిస్తూ కళ్ళు మూయటం మరిచేవాడు ... తెల్లవారుఝామున మౌనం వహించిన ప్రకృతిని పిలుచుకుంటూ మహోధృతంగా ఎగసిపడే సాగరతరంగాల సవ్వడికి మెలకువ వచ్చి చెవులు రిక్కించి వినేవాడు. క్షణం కూడా ఆగక అంతం లేకుండాసాగే ఆ ఘోషకు గుండెలలో తెలియని భావం కదలి ఏదో బెంగగా, బాధగా తోచేది.

ఒకసారి స్నేహితులతో కలిసి ఊరికి దూరంగా ఉన్న తోటలలో తిరుగు

తుండగా తోట వెనకాలగా ఉన్న ఒక చిన్న నీటిమడుగులో విరగబూసిన కలువలని చూసి సంతోషంతో హృదయం గంతులేస్తుంటే నీటిలోకిదిగి తెల్లని,ఎర్రని ఎన్నో కలువలని తెంపి స్నేహితులకు




పంచాడు. వాటిని చేతులతో ఊపుకుంటూ ఊరి మొగదలకొచ్చేసరికి పాడుబడిన సత్రంలో ఎవరో పది సంవత్సరాల పిల్ల చక్కగా గొంతెత్తి పాట పాడుతూ కన్పించింది. తాను నడక ఆపి పాట వింటూ నిలబడిపోయాడు. ఆ పిల్ల కంఠంలోగల తీయదనమో, పాటపాడిన తీరో ఏదో తనను ఆకర్షించి తెలియని ఆనందం కలిగించటంతో తబ్బిబ్బైపోయి రెండు అరచేతులను తాటిస్తూ తన హర్షాన్ని వ్యక్తంచేశాడు. పాట ఆపిన పిల్ల ఆశ్చర్యంగా తనవంక చూస్తూండిపోయింది. తను చటుక్కున ముందుకు వెళ్ళి చేతిలోని తెల్ల కలువలను ఆపిల్లకు అందించాడు. ఒక్క క్షణం తటపటాయించి అమాయకంగా నవ్వుతూ తన

కళ్ళల్లోకి చూసి ఆ పూలను తీసుకుందా పిల్ల. ఆ పిల్ల చూపు, పాట తనకు ఇప్పటికీ జ్ఞాపకం ఉండటం విశేషం ... ఆ తరువాత రెండు రోజులు ఆ పిల్లను అంటిపెట్టుకుని తిరిగి చాలా పాటలు అడిగి పాడించుకుని విన్నాడు. ఆ పిల్లతో తిరగటం తెలిసిన తండ్రి తనపై కళ్ళెర్ర చేసి కొట్టినంతపని చేశాడు.

ఆ సంఘటన గుర్తు వచ్చేసరికి రావు పెదవులు నవ్వుతో విచ్చుకున్నాయి. రేగిన బాల్య స్మృతులతో మనసుకి కాస్త ఉపశమనం కలిగినట్లయి టైము చూసుకున్నాడు. మెల్లగా వెళ్ళి మంచంపై పడుకుని కళ్ళు మూసుకున్నాడు.

* * *

మరునాడు కాలేజీకి సిద్ధమై వాకిట్లోకి వచ్చేటప్పటికి ఎదురుగా ఎవరో అపరిచిత వ్యక్తి.

"ప్రొఫెసర్ సుందర్రావుగారు...?"

"నేనే... ఏంకావాలి?"

"నేను శరణాలయం తాలూకు మనిషిని. మీరు వెంటనే అక్కడికి రావాలి"

"ఎందు...కు..." మాట తడబడింది. మనసు ఏదో గ్రహించినట్లయింది. గ్రహించినది చేతనానికి అందేలోపే శరీరం యాంత్రికంగా ముందుకి అడుగువేసింది.

"పదండి"

కనిపించే భౌతిక ప్రపంచానికిఆవలిగా చూస్తున్నట్లున్న చూపులు తిప్పి రావుని క్షణం పరికించి గుర్తించిన మాష్టారి పెదవులపై కొడిగడుతున్న దీపపుకాంతిపంటి చిరునవ్వు...

[illegible]ాన్ని వదలలేక ప్రాణం పడే లాపత్రయం...

మృత్యుదేవత సాన్నిధ్యంలో జీవిచేసే ఆరాటం...

పోరాట ఆరాటానికి అతీతంగా మాష్టారి ముఖంలో నిలిచిన స్థిరమైన వెలుగు.

ఆ వెలుగును తీక్షణంగా చూస్తూ మాష్టారి పక్కన కూర్చున్నాడు రావు.

చివరిసారిగా శరీరం కోల్పోతున్న శక్తిని సమీకరించుకుని మాష్టారు చేతిని ఎత్తారు. అప్రయత్నంగా తన చేతుల్ని ముందుకు చాచి ఎత్తిన ఆయన చేతిని చేతుల్లోకి తీసుకున్నాడు రావు.

మంచుకంటే చల్లని ఆ చేతిస్పర్శకు ఉలిక్కిపడ్డాడు.

మృత్యుదేవత కరాన్ని స్పృశించినట్లుగా ఉందది. స్వల్పంగా చలిస్తున్న చేతినరాలు ఏదో సందేశాన్ని ఇస్తున్నట్లు తోచాయి.

"మాష్టారూ" సమాధానంగా ఆయన చేతివేళ్ళు రావు చేతివేళ్ళను బిగించి పట్టుకున్నాయి. మరుక్షణం ఆ వేళ్ళు పట్టు తప్పి చేయి కిందకు జారింది. రావుకి అర్థం అయింది.

మాష్టారి శరీరంలో రెపరెపలాడే ప్రాణం తన పోరాటాన్ని చాలించి మృత్యువు చేతుల్లోకి ఒదిగింది.

ఒక్కక్షణం మాష్టారి భౌతిక కాయాన్ని నిర్నిమేషంగా చూసి స్తంభం దగ్గర నుంచుని గుడ్లనీరు కుక్కుకుంటున్న విశ్వం దగ్గరకు నడిచాడు.

"నేను పిరికివాడిని రావుగారూ! నాన్నగారికి చివరిరోజులలో మనస్తాపం కలిగించిన దుర్మార్గుడిని" తనలో తను గొణుక్కుంటున్నట్టుగా అన్నాడు.

ధైర్యం చెబుతున్నట్టుగా అతని భుజంపై చేతులువేసి నొక్కాడు రావు.

"చూడు విశ్వం! జరిగిపోయిందాన్ని గురించి ఇప్పుడు బాధపడి ప్రయోజనం





లేదు. జరగవలసింది చూడు'' కర్తవ్యం గుర్తు చేశాడు.

శరీరం అగ్నిజ్వాలలకు ఆహుతి కావటంతో మనిషి జీవయాత్ర అంతమవుతుందా? ఎర్రని ఎర్రని ఓలిమంటల వెలుగులో ఏదో తెలుసుకోవటానికై యత్నిస్తున్నాడు రావు.

హృదయంలో తనకే తెలియని ఏదో స్థిరత్వం చోటుచేసుకోసాగింది. కళ్ళెదుట వుండే ఆ కాంతిపుంజాల వెలుగులో తనలోని బాధను, భయాన్ని బయటకు తరిమివేయటానికై ప్రయత్నిస్తున్నాడు. తనలో సుఖదుఃఖాలకు అతీతమైన ఏదో స్థితిని కల్పిస్తోంది ఆ ఎర్రని వెలుగు.

క్రమంగా ఆ మంటలు మాష్టారి భౌతిక రూపాన్ని దగ్ధంచేసి అనంతవిశ్వంలో విలీనంచేశాయి. చైతన్యం తిరిగి తన పూర్వస్థితిని పొందింది. ఎన్నోలక్షల సంవత్సరాలుగా పరస్పర వైరుధ్యమైన స్వరూపాన్ని పొందుతూనేవుంది పదార్థం. ఆ క్రమంలో కోటానుకోట్ల కొత్త రూపాలను ధరిస్తూనేవుంది.

స్థిరంగా, నిశ్చలంగా నిలబడ్డ రావు అంతరంగంలో ఆలోచనలు సాగర కెరటాల్లా సుళ్ళుతిరుగుతున్నాయి. నిర్వికారంగా మనసు తన పని తాను చేసుకుపోతూనేవుంది.

అనంత దిగంతాల కౌగిలిలో కొరిగి అస్తమించిన సూర్యునితో పాటుగా మాష్టారి భౌతికశరీరం అదృశ్యమైంది.

భూమిని కప్పిన చీకటి తెరలతో తిరుగుముఖం పట్టాడు రావు.

ఆ రాత్రి... తనలో శాశ్వతంగా ముద్రింపబడ్డ మాష్టారి రూపురేఖలకు ఆకారం కల్పించడానికి ఉద్యుక్తుడై కుంచె చేతుల్లోకి తీసుకున్నాడు.

ఒకటి...రెండు....క్షణాలు గడుస్తున్నాయి.

రేఖామాత్రంగా రూపుదిద్దుకున్న మాష్టారి ముఖంలో తన చిన్ననాటి రామనాథం మాష్టారి ఛాయలే ప్రస్ఫుటమౌతున్నాయి. తనలో బలీయంగా ముద్రపడ్డ ఆయన గంభీరమూర్తి, ఆ ముఖకవళికల్లో వ్యక్తమయ్యే సౌమ్యత, ఆ అధరాల వంపులలో నిలిచిపోయిన స్నిగ్ధహాస ఛాయలు...

ఏటినే రావు కుంచె చిత్రించగలిగింది.

బరువుగా నిశ్వాసం విడచి కుంచె టేబిల్ పై పడవేశాడు.

మానసాకాశంలో ఒక్క మబ్బుతునకైనా లేక నిర్మలంగా నిర్వికారంగావుంది. జీవితంపట్ల తనలో రేగే సందేహాలన్నీ తీరి జీవితరహస్యం ఏదో అర్థం అయినట్లుగా తోచింది.

జీవితం అశాశ్వతమనే విషయం స్పష్టం. ఈ జీవితంలో బాధ, ఆనందం అనివార్యమైన విషయాలు. కలిగే బాధను అధిగమించే ప్రయత్నంలోనే మనిషి భిన్నమార్గాలు అవలంబిస్తాడు. ఆ క్రమంలోనే జీవితానికిగల పరమార్థాన్ని అన్వేషిస్తాడు.

బాధ, ఆనందం యొక్క అసలు తత్వాన్ని అవగాహన చేసుకోవటంలోనే జీవితరహస్యం ఇమిడివుంది...

మనిషి మరణించేవరకూ చేసే ఈ ప్రయత్నంలో కొన్ని విలువల్ని సాధిస్తాడు.

ఆ విలువలని వెదకి పట్టుకోవటమే నిజంగా జీవించడం...అదే జీవనకళ.

ఈ కళను అందిపుచ్చుకోవడంలో మనిషిముందు అంతర్ముఖుడు కావాలి.

తనలోకి తాను తొంగిచూసుకోగల

శక్తి ఉన్నవాడే జీవితం నిర్దేశించిన విధంగా కాక తానే జీవితాన్ని నిర్దేశించే వాడుగా పెంపొందగలుగుతాడు.

ఇన్నాళ్ళూ అస్పష్టంగా మనసులో తిరిగే ఆలోచనలకు ఒక స్పష్టమైన రూపం ఏర్పడి కొన్ని స్థిరమైన నిర్ణయాలు రావు మనసులో తిరగనారంభించాయి.

ఇన్నాళ్ళుగా తనను భయపెట్టిన విస్తృత్వం అంతా ఏకరూపంగా మారిపోతోంది. చెపరని ఆనందం మనఃకుహరం వాకిట నిలబడి ప్రవేశానికి తలుపు తడుతున్నట్లుగా ఉంది....

"బాబుగారూ! మీకు ఉత్తరం"

విప్పి చదివాడు. మధు దగ్గర్నుండి.

డ్యూటీలో క్షణం తీరికలేకుండా ఉన్నాననీ, అందుకే ఉత్తరాలు రాయటం లేటవుతోందనీ, అందుకు మన్నించమనీ, అంతక్రితం ఉండే ఇంటిని ఖాళీచేసి క్వార్టర్స్‌లోకి మారామనీ, చాలా సౌకర్యంగా ఉందనీ రాశాడు. తండ్రినీ, తల్లినీ వచ్చి ఒక పదిహేనురోజులు ఉండి వెళ్ళవలసిందిగా కోరాడు. చివరగా-కాలం చాలా ఆనందంగా గడచిపోతున్నదనీ, ఇంత మంచి జీవితం అందించిన తండ్రికి కృతజ్ఞతలు చెబుతూ, అటువంటి తండ్రిని పొందినందుకు తనను తనే అభినందించుకుంటున్నాననీ ముగించాడు మధు.

ఉత్తరం సాంతం చదివి సంతోషంతో నిట్టూర్చాడు రావు.

మనస్సుకి హాయిగా, ఏదో తేలికగా, సంతృప్తిగా అనిపించింది.

బహుశా తండ్రిగా తన కర్తవ్యం నెరవేర్చినందుకేమో!

అవును...ఎవరి జీవితాలు వారు నిర్ణయించుకుని, ఎవరి ఆనందం వారు వెతుక్కునే క్రమంలో వారికి తల్లీ, తండ్రీ అనే బంధాలు, కుల, మత, జాతి వ్యత్యాసాలు, పాతబడి పుచ్చిపోయిన సాంప్రదాయాలు... ఇవేవీ అడ్డురాకూడదు.

ఎవరి వ్యక్తిగత జీవితం వారిదే.

సాటివారి జీవితాన్ని శాసించి, వారి ఆనందాన్ని హరించే అధికారం ఇతరుల కెలా ఉంటుంది?

ఎన్నుకున్న జీవితంనుండి ఎదురయ్యే కష్టసుఖాలకు కూడా బాధ్యత వ్యక్తిదే.

మనిషి జీవితలక్ష్యం ఆనందంతప్ప మరేమిటి? అనాదిగా మానవ జీవితాన్ని నిర్వచించిన తత్వవేత్తలంతా చెప్పిన సారాంశం ఇదేకదూ! మానవుడు సంఘజీవి. నిజమే...కాని ఆ సంఘం మనిషిని ఒక కొరముట్టుగా ఉపయోగించుకుని అతని జీవితసారాన్ని పీల్చిపిప్పి చేస్తున్నది. సంఘం కబంధహస్తాలలో చిక్కి ఉక్కిరిబిక్కిరై ఊపిరి సలపక నిర్జీవంగా తయారవుతున్నాడు మనిషి.

స్వేచ్ఛావాయువులకై అలమటించి ఆ ప్రయత్నంలో సంఘానికి ఎదురు తిరిగి సాంఘిక సూత్రాలను నిలదీసి ప్రశ్నించినవారు స్వేచ్ఛాజీవులు కాగలిగారు. వ్యక్తి ఉనికికి ప్రత్యేకత ఉందనే విషయం మరచిపోయిన సాంఘిక నిబంధనలు, ప్రభుత్వ నిర్దేశాలు వ్యక్తి జీవితాన్ని బలిచేయటం నిజంగా అమానుషం. వ్యక్తి అంతరంగిక జీవితానికి సమిష్టి నియమాలను అన్వయింపచేయ బూనటంకంటే తెలివితక్కువ చర్య ఇంకొకటేముంటుంది?

చిత్రలేఖనం సామగ్రితోపాటుగా ఆలోచనలు కూడా కట్టిపెట్టి లేచి ఇంటికి నడిచాడు.

**9**

...నిరంతర చలనంతో పరిభ్రమిస్తున్న ఈ అద్భుత సృష్టిలో తానూ ఒకభాగమని స్ఫురించినపుడు కలిగే అనుభూతి ఏ భాషా శాస్త్రాలకు అందుతుంది? విశ్వసౌందర్యాన్నివీక్షించి అనుభూతించే శక్తి ఒక్క మనిషికి తప్ప మరే ప్రాణికి వుంది?...

శరవేగంతో ట్రైను పరుగెడుతోంది. కిటికీ దగ్గరగా కూర్చుని దిగంతాల వరకూ పరచుకున్న చీకటిని చూస్తున్నాడు రావు. కప్పుకున్న శాలువా గాలి వేగానికి కదలుతోంది.

ఆకాశంలో అక్కడొకటి, అక్కడొకటిగా నక్షత్రాలు మెరుస్తున్నాయి. దూరంగా చిక్కని చీకటిని కప్పుకొని మౌనంగా నిలబడ్డ చెట్లను, అస్పష్టంగా కనిపిస్తున్న చిన్నచిన్న ఊళ్ళను దాటుకుంటూ ముందుకు వెళుతోంది ట్రైను.

చలి ఎక్కువగా అనిపించి కిటికీ అద్దం దించి వేశాడు.

కంపార్ట్‌మెంటులో మందమైన కాంతిని చిమ్ముతోంది ఎలక్ట్రిక్ బల్బ్. ప్రయాణీకులు అప్పుడే తమ బెర్తులపై పరుపలు సిద్ధం చేసి నిద్రకుపక్రమించారు. రావుకు నిద్ర రావటంలేదు. ఏదైనా పుస్తకం చదువుదామంటే ట్రైను వేగానికి చదవటం కుదరటంలేదు.

ఏం చేయాలో తోచక తోటి ప్రయాణీకులను, వారి వేషభాషలను చూస్తూ కూర్చున్నాడు.

ఎదురుగా కొత్తగా పెళ్ళయిన జంట కాబోలు... ఆ కుర్రాడు మెల్లని స్వరంతో ఏదో చెబుతుంటే ఆ యువతి అతని ఒళ్ళో తలపెట్టుకుని పడుకుని వింటున్నది. ఇద్దరికీ ఎంతో వయసు ఉన్నట్టు లేదు. పరిసరాలను మరచి తమ ఆనందంలో నిమగ్నమైన ఆ జంటను ఓరకంట చూస్తూ నవ్వుకున్నాడు రావు.

సిగ్గు, ప్రేమ మిళితం చేసిన చూపులని ఆ యువకుడి వదనంపై కేంద్రీకరించి అతను చెప్పే మాటలని శ్రద్ధగా వింటూ అతను నవ్వుతుంటే తనూ శ్రుతి కలుపుతూ ఊః కొడుతోంది. అమాయకత, ఆనందం కలసికట్టుగా వారి ముఖకవళికలలో తారట్లాడుతున్నాయి.

కొంతసేపటికి ఆ యువకుడు చెప్పే మాటలు వింటూనే ఆ యువతి నిద్రలోకి జారిపోయింది. అతను మెల్లగా లేచి ఆమెను పదిలంగా బెర్తుపై పడుకోపెట్టాడు. ఆ కదలికకు మెలకువ వచ్చిన యువతి కొద్దిగా కనురెప్పలని విప్పి నవ్వి సర్దుకుని పడుకుంది. ఆ యువకుడు నీలంగళ్ళ దుప్పటి ఆ యువతికి జాగ్రత్తగా కప్పి తను పైబెర్తు ఎక్కాడు.

వారినే గమనిస్తున్న రావుకి ఆ యువ దంపతులు ఎంతో ముచ్చటగా అనిపించారు. తనూ లేచి బెర్తుమీద నడుం వాల్చాడు.

ఎంత ప్రయత్నించినా నిద్ర రావటం లేదు. లాభం లేదనుకుని లేచి కిటికీఅద్దం పైకెత్తి చూస్తూ కూర్చున్నాడు.

బాహ్య ప్రపంచంలో నిండిన చీకటి మనోమయ రూపాలను దర్శించటానికి ఏమీ ఆటంకం కావటంలేదు. తనకంటూ తనలో ఒక ప్రపంచం నిర్మించుకుంటే బాహ్య ప్రపంచం మనిషిపై ఎక్కువ ప్రభావాన్ని చూపించలేదేమో! కళ్ళు చీకటినిచూస్తున్నా మనసు అందుకువ్యతిరేకంగా మనోహరమైన దృశ్యాల్ని ఆవిష్కరి

స్తోంది. అసంఖ్యాకంగా కదిలేఊహాతరంగాలకు కన్నులుంటే భౌతిక జగత్తులో చూడలేనిదంటూ ఏమీ ఉండదేమో...! చీకటిస్థానంలో వెన్నెలని, ఆ వెన్నెలలో మెరిసే సర్వ ప్రకృతిని చూడగలదు. నిరంతర చలనంతో పరిభ్రమిస్తున్న ఈ అద్భుత సృష్టిలో తానూ ఒక భాగమని స్ఫురించినపుడు కలిగే అనుభూతి ఏ భాషాశాస్త్రాలకు అందుతుంది...? విశ్వ సౌందర్యాన్ని వీక్షించి అనుభూతించే శక్తి ఒక్క మనిషికి తప్ప మరే ప్రాణికివుంది? సృష్టిశక్తుల విజృంభణతో ఊపిరి పోసుకుని ప్రప్రథమంగా కళ్లు తెరచిన నాటి నుండి ప్రపంచాన్ని వింతగా చూసి అణువణువూ శోధించే ఈ కళ్లు...చుట్టూ పరచుకున్న సౌందర్యవాహినిలో మత్తుగా మునకలువేసి బాహ్యస్మృతిని మరపించే శక్తిగల ఈ కళ్ళద్వారా మనస్సు చూడలేనిది ఏముంటుంది...? మనస్సు కోరుకుంటే ఆ ఊహలతో గగనవీధిలో ప్రయాణించి తారల తళుకు తళుకు కాంతులను తనివితీరా ఆస్వాదించదా...? నీలి నీలి మబ్బులను హృదయానికి హత్తుకుని మంచుకప్పిన పర్వత శిఖరాలపై పరుగులెత్తదా...?

ఈ ఊహాశక్తివుండబట్టేకదూ మనిషి ఈనాడు గ్రహగోళాలతో స్నేహ సంబంధాలు నెరపగలుగుతున్నాడు... ఈ ఊహాశక్తితోనేకదూ సృష్టి సౌందర్యాన్ని తన భావనలో బంధించి ప్రతిసృష్టి చేయగలుగుతున్నాడు...

ఏదో స్టేషనులో బండి ఆగడంతో ఆలోచనలు ఆపి ముందుకు చూశాడు.

జాతీయ చిత్రకళా ప్రదర్శనలో తన చిత్రాలు కూడా ప్రదర్శింప కోరుతున్న నిర్వాహకుల ఆహ్వానం మేరకు ఈ ప్రయాణం పెట్టుకోక తప్పలేదు. ఈవారం రోజులూ ఎంతో ఉల్లాసంగా గడిచింది.

దేశం మారుమూలలనుండి వచ్చిన చిత్రకారులతో పరిచయాలు, ప్రసంగాలు మనసుకి ఎంతో మార్పుగా అనిపించింది. మనిషి నివసించే పరిసరాలు, వాతావరణంకూడా అతని వ్యక్తిత్వంపై వాటి ముద్రలను వేస్తూనేవుంటాయి. పరిసరాలను మార్చినపుడు మనసుకి ఎంతో మార్పుగా తెలికగా వుంటుంది. వాతావరణం తెటగాకాకచికాకు కలిగించినపుడు మనసుకి ఎంతో అసౌకర్యంగావుంటుంది.

ఏమైనా జీవించే పరిసరాలను అప్పుడప్పుడూ మారుస్తుండటం మనిషి మానసిక ఆరోగ్యానికి ఎంతో అవసరం. కొన్నిరోజులుగా నిరుత్సాహంగా, విసుగ్గా వుంటున్న తనలో ఈ ప్రయాణం ఉత్సాహం నింపింది. తిరిగి మనసు అందంగా, ఆరోగ్యంగా పనిచేయటం ప్రారంభించింది.

రివ్వున వీచిన చలిగాలికి శరీరం చలించినట్లయి అద్దందింపి బెర్తుపై వాలి కళ్లు మూసుకున్నాడు.

తెలతెలవారుతుండగా మెలకువ వచ్చింది.

లేచి పక్కచుట్టి కిటికీ తెరిచాడు. బండి మెల్లగా నడుస్తూంది. బహుశా ఏదైనా స్టేషను వస్తుందేమో! ఎదురుగా సీట్లో యువతి ఇంకా లేవలేదు. నిద్రలో కూడా ఆ యువకుని ముఖాన్ని చూస్తున్నదేమో...చిరునవ్వు ఆ లేత పెదవులపై చెదరిపోలేదు.

రావు లేచి టవలు భుజంపై వేసుకుని టూత్‌బ్రష్ తీసుకుని ముందుకునడిచాడు. సీటి చల్లదనానికి వేళ్ళు కొంకర్లుపోయి




నట్లయి టవలుతో ముఖం అద్దుకుంటూ వచ్చి సీట్లో కూర్చున్నాడు.

కిటికీ పక్కగా వెళుతున్న పేపరు బోయ్‌ని కేకవేసి పేపరుకొని చదవటానికి ఉపక్రమించాడు.

తిరిగి బండి గమ్యస్థానం వైపుగా పరుగు అందుకుంది.

పూర్తిగా తెల్లవారింది. ఆ యువతిలేచి నవ్వుతూ ఆ యువకుడిని చేతితోతడుతూ లేపుతోంది. కొన్ని నిమిషాల అనంతరం ఆగిన స్టేషనులో ఆ యువ జంట దిగిపోయారు. ఎవరో కొత్త ప్రయాణీకులు వచ్చి సీట్లను ఆక్రమిస్తున్నారు.

పేపరు చివరి పేజీ తిప్పుతూ ఎదురుగా చూశాడు.

ఒక్కసారిగా శరీరంలో రక్తం అధిక స్థాయిలో పరుగులు పెట్టింది. తీవ్రంగా చలించిన గుండె పగిలి ముక్కలైపోతుందేమో అన్నట్టు కంపించింది.

నరాలు చిట్లి రక్తం స్వేదరూపంలోకి మారినట్లు శరీరమంతా నిండిన చెమట బిందువులు.

అంతరాళంలోనుండి చివ్వున పైకి ఎగజిమ్మిన బాధ భగ్గున హృదయాన్ని మండించింది.

ఆబాధ... ఆమంటకన్నీరుగా రూపాంతరం చెంది కళ్ళను మసక చేశాయి. మొహానికి అడ్డుపెట్టుకున్న పేపరును కొద్దిగా తొలగించి తిరిగి ఎదురుగా చూశాడు.

ఎదురుగా ఆమె...

నల్లని కనుపాపలను కిందికి దించి చేతిలోని పుస్తకాన్ని చూస్తోంది.

ఆ కనుపాపల మధ్యగా, నిటారుగా నిలిచిన నాసిక, దానికిందుగా బిగించబడినట్లున్న పెదవులు.

అక్కడక్కడా వెండితీగల్లా మెరుస్తున్న జుట్టు.

వయసు తెచ్చిన మార్పు మినహాయిస్తే అదే రూపం...ఆనాటిరూపం... తన గుండెలలో శాశ్వతంగా ప్రతిష్ఠించుకున్న రూపం.

అణచుకోలేని ఆనందం, ఆపలేని అభిమానం పోటీపడి చిత్రమైన స్థితికి గురి చేస్తున్నాయి.

ఆమె...ఆమె తన ఆరాధ్యదేవత... సంవత్సరాల తన మూగ బాధకు ప్రతిరూపం...ఇన్నాళ్లూ తన కలలు, కన్నీళ్లు కలబోసి నివేదించుకున్న ఆ మూర్తి... తన గుండె చప్పుడులో లయించి తన అణువణువులో ఐక్యమైన... ఆ మూర్తి.

"వసూ...వసంతా"

పిలిచాడా...లేదు!

గుండె పిలుపు పెదవులుదాటిబయటకు రాలేదు.

కాలం ఆగింది.

ఆనాటి సాన్నిహిత్యం అంతరంగంలో కదలాడింది.

ఇన్నాళ్ళ తన ఆవేదన, అన్వేషణ అన్నీ ఆ క్షణంలో మరుగునపడ్డాయి. వాటి స్థానంలో అనిర్వచనీయమైన ఆత్మీయత ఉప్పొంగింది.

... సర్వేంద్రియాలూ చలనం మరచి ఆమెపై దృష్టి కేంద్రీకరించాయి .... కనిపించే బాహ్య ప్రపంచం యావత్తూ మాయమై ఆమె రూపం ఒక్కటే కళ్ళ ముందు నిలిచిపోయింది.

గుండెల్లో గూడుకట్టుకున్న మమత నంతా రంగరించి 'వసంతా'...అని పిలవబోయి ఆగాడు.

ఒక్కక్షణం ... ఏదో ఆలోచన మనసులో తటాలున మెరిసింది.

ఆమె....ఆమె తన మనో ప్రపంచం లోని వసంతకాదు. ఈ మానవ సంఘంలో భార్యగా, గృహిణిగా, తల్లిగా తన బాధ్యతలను నిర్వర్తించే ఒక స్త్రీ. ఒక్కసారిగా కలిగిన భావోద్వేగం అంతా పొగమంచులా విడిపోయింది. వాస్తవం కళ్ళముందు నిలిచి పగలబడి నవ్వింది.

మనసు మేల్కొంది.

బరువైన కనురెప్పలని మూసుకుని దీర్ఘంగా నిట్టూర్చి కళ్ళు తెరిచాడు.

ఆ నిట్టూర్పులో యుగయుగాల మానవ అంతరాత్మల ఆవేదన.

ఆ కనురెప్పలమాటున నిలిచిపోయిన కన్నీటి బిందువుల సందోహం.

పేపర్లోంచి ఆలోచిస్తున్నాడు.





పలకరించాలా ... వద్దా? కనిపించ కుండా పక్క వింగులోకి వెళ్ళి కూర్చుంటే? ఎలా...ఏం చేయాలి? కోతపడిన తనగుండె నుండి ఇంకా రక్తం స్రవిస్తూనే ఉంది. ఆ గాయం సలిపినప్పుడల్లా తీవ్రమైన మానసిక క్షోభను ఎదుర్కొన్నాడు తను...తనలో నిరంతరం ఆరి కుండా జ్వలించే ఆమె స్మృతులతోనే జీవితానికి ఒక లక్ష్యాన్ని ఏర్పరచుకున్నాడు.

ఆ లక్ష్యసాధనలో ఆమె స్ఫూర్తి తనలో ఊపిరిపోస్తోంది, తనను ముందుకు నడుపుతోంది. తన అనుభూతులకు, ఆలోచనలకు అన్నింటికీ కేంద్రం ఆమె.. ఇంతకాలం తరువాత కనిపించిన ఆమెను ఒక్కసారి పలకరిస్తే...ఒక్కసారి ఆమె యోగక్షేమాలని తెలుసుకుంటే....తెలుసుకుని...ఏంచేస్తాడు? చేయగలిగింది, ఈ జీవిత చరమాంకంలో ఇక మిగిలింది ఏముందని...?కాని ఆమైనా ఆనందంగా జీవిస్తున్నదేమో తెలుసుకుని సంతృప్తి పడతాడు. ఆమె జ్ఞాపకాల పేటికలో తన కంటూ స్థానం ఉందా? తనను గుర్తిస్తుందా? సంసార జీవితంలోపడి తలమునకలై తనని మరచిందేమో?

ఆనాడు తామిద్దరి మధ్య ఏర్పడ్డ స్నేహం, ప్రేమానురాగాలు ఆమెకు ఇంకా గుర్తుండి ఉంటాయా..?జీవన ప్రవాహంలో చెరొక దరికి కొట్టుకుపోయిన తామిద్దరూ మళ్ళీ కలవటం ఎంత చిత్రం?

ఛ...ఏమిటీ ఆలోచనలు? ఎందుకీ కాలయాపన...?

పేపరు మడచి ఆమె దెస చూశాడు.

ఆమె కళ్ళు ఇంకా పుస్తకంలోని అక్షరాలనే చూస్తున్నాయి.



ఇన్ని సంవత్సరాల తరువాత ఎలా పిలవాలో బోధపడలేదు. ఏదో ఇబ్బందిగా అనిపించింది.

గుండె ఉద్వేగంతో ఎగిసిపడుతుండగా.

కంఠం సవరించుకున్నాడు.

ఆమె కొంచెం తలపైకెత్తి పేజీ తిప్పింది.

ట్రైను తన విధి నిర్వహణలో మరింత వేగాన్ని పుంజుకుంది.

"వసూ...వసంతా!"

తృళ్ళిపడి తలఎత్తిందామె. హృదయాన్ని చిక్కబట్టుకుని ఆమె కళ్ళల్లోకి చూశాడు. అవే చూపులు... మెత్తని... చల్లని చూపులు.

"మీరు....మీరు..." ఆమె ముఖం లోకి అనేక భావాలు ఒక్కసారిగా ఉప్పొంగాయి.

"నేను రావుని" మెల్లగా ఉచ్చరించాడు.

"రావ్...రావ్..."ఆమె హృదయం ఆ రెండక్షరాలను పదేపదే జపించింది. సంభ్రమాశ్చర్యాలతో అతని ముఖంలోకి చూపులు గుచ్చిచూస్తున్న ఆమె అణువణువునా ఆనందం వెల్లువలై ప్రవహించింది. ఆ ఆనందం వదనం పైకిపాకి కాంతివంతంగా దీపించింది.

"రావ్! నువ్వు... నువ్వు... ఎంత మారిపోయావు?" ఉద్వేగభారంతో మాటలు తడబడ్డాయి.

"అవును...నేనే. గుర్తున్నానా?"

ఆ మాటలకు శరాఘాతం తగిలినట్లుగా ఆమె హృదయం విలవిలలాడింది! చివ్వున వచ్చిన కన్నీరు కనురెప్పలను ఒడిపింది. కొనగోటితో కన్నీటిబిందువులనురాలుస్తూ నవ్విందామె. ఆ నవ్వులో చల్లని శశి జ్యోత్స్నలు మెరిసాయి.

ఏళ్ళుగా వేదన భరిస్తున్న రావు హృదయాన్ని అవి అవ తపు జల్లులా తాకాయి.

"బావున్నావా వసంతా?" గుండెలలో నిండిన ఆత్మీయత అంతా ఆ మాటలలోకి ఒలికింది.

"ఊఁ... నువ్వు బాగున్నావా?"

నవ్వి ఊరుకున్నాడు.

ఎన్నో ప్రశ్నలు అడగాలని మనసు త్వరపడుతున్నా ఇద్దరికీ పెదవిదాటి మాటలు బయటకు రావటంలేదు.

ఒకరి గురించి ఒకరు తెలుసుకోవాలనే ఆరాటం మాటల రూపంలోకి మార్చటం ఇద్దరికీ చేత కావటం లేదు.

ఏదో మాటలకందని స్థితి ఇద్దరినీ మూగవారిని చేస్తోంది.

ముందుగా ఆ పరిస్థితి నుండి బయట పడిందామె.

"ఇప్పుడు ఎక్కడున్నావు రావ్? ఏం చేస్తున్నావు?"

చెప్పాడు. తన ముఖంలోకి చూపులు నిగిడ్చి చూస్తున్న ఆమె ఈ లోకపు వాసిలా అన్పించటం లేదు. బాహ్య స్మృతిని మరచి తదేకంగా రావుని చూస్తోందామె. తన గురించి చెబుతుందేమో అని రెండు క్షణాలు ఎదురుచూశాడు.

"వైజాగ్‌లోనా?" ఆమె పెదవులు గొణిగాయి.

"అవును"

''నేనూ ఇప్పుడు అక్కడే ఉంటున్నాను''

"నిజంగానా?" ఆనందం ఆ ప్రశ్నలోకి ప్రవహించింది.

"అవును....ఇటీవలనుండే"

"అక్కడ మీవారు..."

నవ్విందామె. ఆ నవ్వులో నిగూఢంగా తొంగి చూసినభావం రావుకి అర్థంకాలేదు.

"మావారంటూ ఒకరు నాకెవ్వరూలేరు" చిన్నగా అంది.

"అంటే నువ్వు...నువ్వు..."

"వివాహం చేసుకోలేదు"

రావు సర్వావయవాలూ ఒక్క క్షణం చలనం మరచి నిలచిపోయాయి.

హఠాత్తుగా ఏదో స్ఫురించినట్లయింది.

అయితే ... అయితే ... వసంత ఇన్నేళ్ళుగా ఒంటరిగా...

హృదయం పిండినట్లయింది.

క్షమించరాని ఆనాటి తన అశక్తత భయంకర రూపందాల్చి కళ్ళ ముందు గిర్రున తిరిగింది.

సర్వ ప్రపంచం ఏకమై తనని నేరస్తునిగా వేలెత్తి చూపుతున్నట్టు...

వసంత హృదయం తనని నిలేసి నిందారోపణ చేస్తున్నట్టు...

కుంచించుకుపోయాడు. దోషిలా తల వంచుకు కూర్చున్నాడు.

రావు ముఖంలో మారే రంగుల్ని ఆమె గమనిస్తున్నట్టులేదు.

నిశ్చలంగా గతాన్ని అవలోకిస్తున్నట్టుగా ఉంది.

బండి ఏదో స్టేషనులో ఆగింది. ప్రయాణీకుల రద్దీ ఎక్కువయింది. రావును ఎవరో పక్కకు జరగమని అడగటంతో వర్తమానంలోకివచ్చి సర్దుకు కూర్చున్నాడు. కంపార్టుమెంటు అంతా ఒకటే జనం.

చూపులు తిప్పుకుని కిటికీనుండి బయటకు చూస్తున్నాడు. ఇద్దరి మానసిక స్థితికి బాహ్య పరిసరాలు ఆటంకం కలిగించటంతో ఇద్దరి మధ్యా మౌనం రాజ్యం చేసింది.

గమ్యం చేరగలిగాననే ఆనందంతో కూతవేసి బండి స్టేషనులో ఆగింది. హాయిగా పాడే తీయని రాగంలో అపశ్రుతిలా వైజాగ్ ప్లాట్‌ఫారం వివిధ ధ్వనుల సమ్మేళనంతో ప్రయాణీకుల్ని ఆహ్వానించింది.

ఇద్దరూ దిగి ప్లాట్‌ఫారం మీద అడుగు పెట్టారు.

ఒకరిని అనుసరించి ఒకరు బయటకు అడుగులు వేస్తున్నారు.

ఇద్దరి హృదయాలు చిత్రమైన భావావేశంతో వేగంగా స్పందిస్తున్నాయి.

ఒకరిపక్కగా ఒకరు, ఇన్నేళ్ళ తరువాత...జీవితం చివరి పాదంలో ... ఆ క్షణాల్లో గుండె లోతుల్లో సుళ్ళు తిరుగుతున్న తలపుల వేగానికి శరీరం వణికినట్లయి అడుగులు తడబడ్డాయి.

స్టేషను బయటకు వచ్చారు.

ఇద్దరూ అక్కడ విడిపోక తప్పదు. భౌతిక ప్రపంచపు పరిమితుల్ని వారు అనుసరించక తప్పదు.

పొంగే బాధను అణిచి పెట్టుకుని అడిగాడు-

"ఎక్కడకు వెళ్ళాలి?"

ఆమె అడ్రసు చెప్పింది. ఆటోను కేకవేశాడు.

ఆటోలో కూర్చుంటూ అతని కళ్ళల్లోకి చూసింది. పెదవులు చిన్నగా నవ్వుతూ విచ్చుకున్నాయి.

"మరి నేవెళ్ళిరానా?" ఆప్యాయతకు మరో రూపంగా ధ్వనించిన ఆమె కంఠస్వరానికి అతని కళ్ళలో నీరు చిప్పిల్లింది.

కళ్ళతోనే వీడ్కోలు ఇచ్చాడు.

ఆటో స్టార్టయింది.

* * *

రావు శరీరంపై హృదయంపైఏకాంతం తెరకప్పింది.

ఆ ఏకాంతంలో నుండి చీకట్లోకి చూస్తూ జీవితం ఆద్యంతాలను అవలోకిస్తున్నాడు. ఎల్లవేళలా తనని వెంటాడిన ఒంటరితనం మళ్ళీ స్ఫురణకు వస్తోంది.

శాంతికోసమై అలమటించిన ఈ గుండె కార్చిన కన్నీళ్ళు జారి కాల ప్రవాహంలో కలసి కొట్టుకునిపోయాయి.

వేదన అనుభవించిన హృదయం శిలగా మారి గడ్డకట్టుకుని పోయింది....

తనకు తెలియకుండానే జీవితం చేత మోసగింపబడి నిరాశా తిమిరంలో దిక్కుతోచక తడుముకుంటున్న తనకు పోగొట్టుకున్న పూర్వ స్మృతులే బాసటగా నిలిచాయి.

ఆస్మృతుల పరిమళంతోనే తాను మళ్ళీ లేచి నిలబడి జీవన పథంపై అడుగులు వేయటం ప్రారంభించాడు...

వేసివేసి మూడు పదుల జీవిత కాలం ముందుకు నడిపాడు.

జరిగిపోయిన ఈ కాలమంతా అంతంకాని విషాదం మోస్తూ ప్రయాణించాడు.

ఏ కాస్తయినా ఆనందం అంటూ లభిస్తే అది తన మనోమయ ప్రపంచం నుండే లభించింది... ఇన్నాళ్ళుగా జీవితంలో మనసుని కదలించే మహత్తరమైన అనుభవాలేమీ లేక కోరుకున్న వాటికి కవితా ప్రపంచంలో ఒక రూపం ఇచ్చి పొందుపరిచాడు.

ఈనాటికి... ఈనాటికి తన జీవితం మళ్ళీ మలుపు తిరగబోతోందా....?

ఈ మలుపుదాటి ముందుకు వెళ్ళగలిగితే తన ఆనంద గమ్యం చేరవస్తుందా?

ఏం జరగబోతోంది?

హఠాత్తుగా అతని అంతరాంతరాలలో ఏవో తలుపులు తెరచుకున్నట్లయ్యాయి.

ఆ తలుపులగుండా సంవత్సరాల తన తపస్సు ఫలించి శాంతి పవనాలు వీస్తున్నట్టు...

మబ్బు తెర వీడినట్టు...

హృదయంలో ఏదో ప్రశాంతత...

కానరాని వెలుగు....

మంచుశిఖరాన్ని కౌగిలించుకున్నట్టు...

మల్లెపొదలు కదలినట్టు...

ఆహ్లాదం గొల్పుతున్న మానసిక స్థితి... అది!

అతనికి ఆశ్చర్యం వేసింది....

'ఏమిటీ అకారణమైన ఆనంద వాహిని?' తనను తనే ప్రశ్నించుకున్నాడు.

సమాధానం అందీ అందక అస్పష్టంగా మనసుకి తడుతోంది.

అవలి తీరం అందుబాటులో నిలచి చేతులు చాచి ఆహ్వానిస్తున్నట్టుగా ఏదో తెలియని నిశ్చింత అతనిలో చోటుచేసుకోసాగింది...

ఎండిన గుండె చిగిర్చి ఆనందం రేకులు విప్పింది.

మనోనేత్రం భవిష్యత్తులోకి తొంగి చూస్తోంది.

## 10

...నా అంతరంగిక జీవితానికి ఆమె వెలుగు దివ్వె. నాకంటూ ఒక వ్యక్తిత్వం ఏర్పడని దశలో అనాలోచితంగా ఆమెను పోగొట్టుకున్నాను. దాని ఫలితంగా ఇన్నేళ్లూ నేను అనుభవించిన బాధ ప్రపంచానికి తెలియదు...

పట్టణ వాతావరణానికి కొంచెం దూరంగా తెల్లని సున్నం వేయబడ్డ చిన్న ప్రహరీ గోడతో వున్న ఇల్లు.

నీలంరంగు పూయబడ్డ చిన్నచిన్న పూలు డిజైనుల ఇనుపగేటు.

గేటులోకి వేలాడుతున్న ఎరుపురంగు బోగన్‌విల్లా పూలగుత్తులు...




హృదయంలో చిన్నగా తల ఎత్తుతున్న ప్రకంపనలు! నరాలు ఉద్వేగ భారంతో స్వాధీనం తప్పుతుంటే తనను తాను నిలదొక్కుకుని గేటుపై చేతులు వేశాడు.

లోనికి అడుగు పెడుతుండగా శరీరం అంతా చిత్రమైన కదలిక. మెల్లగా అడుగు ముందుకు వేశాడు.

రాతిబండలు పరువబడ్డ మార్గం. ఇరువైపులా వివిధ రంగుల మిశ్రమంతో కూడిన పూలపరిమళం. స్వాగతం చెబుతున్నట్లు చిన్నగా గాలికి తలలూపుతూ కనువిందు చేస్తున్న మొక్కలు!

కుటీరాన్ని తలపిస్తూ ఎదురుగా రెల్లుతో వేయబడ్డ ఇల్లు. కెంపువర్ణంపూలు తెల్లని మాలతీలతలతో ముడివేసుకుని అందంగా సుందరంగా ఇంటిపైకిపాకాయి. పవిత్రత, ప్రశాంతత నిండినట్లున్నాయి పరిసరాలు.

ఎవరిని పిలవాలో, ఎలా పిలవాలో తెలియక తికమకపడ్డాడు.

భౌతిక ప్రపంచపు పద్ధతులు,అలవాట్లు అర్థరహితంగా కించిత్తు చికాకు కలిగించాయి. శరీరం, స్థలం, దూరం, కాలం- ఇవన్నీ మనసుకి ప్రతిబంధకాలుగా అనిపించాయి. తన హృదయాధి దేవత నివసించే ఆ పరిసరాలు ఎంతో ఆత్మీయంగా తోచాయి.

ఆమె చేతులతో పెంచబడ్డ ఈ మొక్కలు....

ఈ మట్టి...

సువాసనలు వెదజల్లే పూలు...

ఆమె నడిచిన ఈనేల...

అన్నీ ఎంతో ప్రియంగాతోచసాగాయి.

"అదేమిటి రావ్? అలా నిలబడిపోయావు లోపలికిరా"

ఆమె పిలుస్తోంది.

తనను పలకరిస్తోంది.

తెల్లని చీరలో అంతకంటే తెల్లని మనసుతో నిర్మలమైన నవ్వు పెదవులపై నర్తిస్తుండగా ఆమె తనను ఆహ్వానిస్తోంది.

స్వప్నంలోనుండి ఆమెను చూస్తున్నట్లుగా రెప్పలు అల్లార్చి ఆమె దెసచూపులు తిప్పాడు.

మెల్లగా వెళ్ళి ఆమె చూపిన కుర్చీలో చేరగిలబడ్డాడు.

"నువ్వు వస్తావనే అనుకున్నాను"

ఆమె అతని కళ్ళల్లోకి చూస్తూ అంది. వాటిలో నీవు రావాలని కోరుకున్నాను- అనే భావం కదలాడినట్టయింది.

"రాకుండా ఉండలేకపోయాను"

నిట్టూర్చిందామె.

ఆ నిట్టూర్పులో యుగాలుగా అనుభవించిన వేదన తొణికిసలాడింది.

తన ఎదురుగా చాప పరుచుకుని నిశ్చలంగా కూర్చున్న ఆమెను చూస్తున్నాడు. పవిత్రంగా...

ప్రేమగా...

ఆరాధనా దృక్కులతో..

ఆమెనే చూస్తున్నాడు. ఇది కలా? వాస్తవమా?

ఇన్నాళ్లూ తన కలలలో నిండినభ్రాంతి తనను కవ్వించటం లేదుకదా.

కల కరగి ఆనందం చెదరి తిరిగి యదార్థం తన ముందు పగలబడి పరిహసించదుకదా!

భయపెడుతున్న హృదయాన్ని చిక్కబట్టుకుని ఆమె అణువణువు ఆప్యాయంగా కళ్ళతో స్పృశిస్తున్నాడు.

పదిలంగా ఆమె రూపాన్ని తన గుండెలలో భద్రపరుస్తున్నాడు. ఒకరి స్థితి ఒకరికి అర్థం అవుతోంది.

మౌనంలో కొట్టుకుపోతున్న ఇద్దరికీ మాటలు దొరకటంలేదు.

అంతులేని భావాలతో ఎగసిపడు తున్న ఇద్దరి హృదయాలూ క్రమంగా సద్దుమణిగి స్థిరత్వం పొందాయి.

"నీ విషయాలు చెప్పు రావ్! పిల్లలు ఎంతమంది... ఏం చదువుతున్నారు?" అన్నీ పచ్చిభౌతిక విషయాలు... అయినా ఆమె అడగక తప్పదు. అతను చెప్పక తప్పదు. చెప్పాడు.

"బాగుంది. నువ్వయినా సుఖంగా ఉన్నావు అంతేచాలు."

నిర్వేదమైన నవ్వు అతని పెదవులపై పాకింది.

"వసంతా! ఒంటరిగా ఇలా...ఎందు కని?"

ఆమె తల ఎత్తిచూసింది.

ఆ చూపులో 'నీకు తెలియదా' అనే భావం కదలాడినట్టయి అతనిని కలవర పరచింది.

"ఆ తరువాత..." ఆమె ప్రారంభిం చింది.

ఆ తరువాతకు అర్థం రావుకి తెలుసు. ఒక్కక్షణం గుండె దివుక్కుమంది.

"ఆ తరువాత ... నాన్నగారు పోయారు. కుటుంబబాధ్యత నేను వహించకతప్పలేదు. ఉద్యోగప్రయత్నాలు చేసాను. అదృష్టవశాత్తు వెంటనే ఉద్యోగం దొరికింది. నా చెల్లెళ్ళ ఇద్దరి భవిష్యత్తు నాపై ఆధారపడి వుంది. ఆలోచించాను. నేను పెళ్ళిచేసుకుంటే వారి జీవితాలకు ఏ దారి చూపలేని దాన్నవుతానని గ్రహిం చాను. అదీగాక...అనుక్షణం వెంటాడే నీ స్మృతులు నాలో సజీవంగా మెదులు తుండగా ఇంకొకరితో జీవితం పంచుకో లేననే నిర్ణయానికి వచ్చాను."

ఆగి బరువుగా శ్వాసవదలి తిరిగి చెప్పటం మొదలుపెట్టిందామె—

"చెల్లెళ్ళిద్దరికీ నా శక్తిమేరకు మంచి జీవితాలనే ఏర్పాటుచేసాను. ఇప్పుడు వారిద్దరూ ఎవరి సంసారం వారు దిద్దు కుంటున్నారు. ఇకపోతే నేను— నాన్నగారు ఎప్పుడో ఈ ఊళ్ళో ఉద్యోగం చేస్తున్న కాలంలో ఈ స్థలం కొన్నారు. వాళ్ళిద్దరి వివాహాలు అయిపోయిన తరువాత నేను ఉద్యోగం వదలివేసి ఇక్కడకు వచ్చి ఉంటున్నాను. ప్రస్తుతం కాలక్షేపంకోసం దగ్గరలో వున్న స్కూల్లో టీచరుగా పని చేస్తున్నాను. చెల్లెళ్ళిద్దరూ అప్పుడప్పుడు వచ్చి చూసి వెళుతుంటారు"

ఆమె పెదవులు ఉచ్చరించే ప్రతి వాక్యం రావు హృదయాన్ని గాయం చేస్తోంది.

"ఇన్నేళ్లు ఒంటరిగా ఎలాభరించావు?"

నిశ్చలంగా, నిర్మలంగా నవ్విందామె.

"ఒంటరిదాన్నెలా అవుతాను? నిరం తరం నీవు నాకు తోడు ఉండనే ఉన్నా వుగా?"

తప్పు చేసినట్టు తలవంచుకున్నాడు.

''రావ్! తలచుకుంటే ఎంతో చిత్రంగా ఉంది. ఇన్నేళ్ళ తరువాత నిన్ను తిరిగి ఇలా చూడటం నిజంగా విచిత్రమైన విషయం'' తనలో తను అనుకుంటు న్నట్టుగా అందామె.

నిజమే ... జీవితం స్వభావం ఎంత శోధించినా అంతుచిక్కదు.

అనాదిగా మానవుని జీవనయానంలో ఎన్నో మిట్టపల్లాలు, గుట్టలు, అగాధాల లోతులు, అందని ఎత్తులు అతనికి ఎదు రవుతూనే ఉన్నాయి.

అయినా నడుస్తూనే ఉన్నాడు. నిరంతర యాత్ర చేస్తూనే ఉన్నాడు.




ఈనాడు తామిద్దరూ నడచివచ్చిన మార్గం తిరిగి చూసుకుంటే ఏముంది?

అంతా కటిక చీకటి. ఒక్క వెలుగు రవ్వైనా కనిపించని అంథకారం.

ఆ అంథకారాన్ని వెలిగిస్తూ ఎదురుగా నిలచిన ఏదో కాంతిపుంజం...

"ఆ...ఏమైనా తాగుతావా?"

"కొంచెం మంచినీళ్ళు కావాలి"

ఆమె లేచి లోపలికి వెళ్ళింది.

నిరాడంబరంగా ఉన్న ఇల్లు చల్లగా, హాయిగా ఉంది.

నీరు నింపిన గ్లాసు అందించిందామె.

ఎంతో అపురూపంగా గ్లాసు అందుకుని గటగటా నీళ్ళన్నీ తాగివేశాడు.

"మాటలలోపడి నీకేమీ ఇవ్వనేలేదు. కాఫీ తీసుకుంటావా?"

"అవేమీ వద్దు వసూ! నన్ను ఇలా కూర్చోనియ్యి. ఇక్కడ నా మనసుకు ఎంతో శాంతిగా ఉంది"

ఆమె సామీప్యం అతడిని సేద తీరుస్తున్నది.

ఒక్క క్షణం రావుని పరిశీలించి చూసి ఆమె గ్లాసు లోపల పెట్టి వచ్చి తిరిగి రావు పాదాల దగ్గరగా కూర్చుంది.

"వసూ!" ఆరాధనగా పిలిచాడు.

చలించిందామె. మెల్లగా కళ్ళెత్తింది. మెత్తని చూపులతో అతని ముఖంలోకి చూసింది.

"నిన్నో కోరిక కోరనా?" అర్థిస్తున్నట్లుగా అన్నాడు.

'ఏమిటది?' అన్నట్టు చూసిందామె.

"ప్రతిరోజూ కొంతసేపు ఇలా నీ సమక్షంలో గడపటానికి అనుమతి ఇస్తావా?"

చెమ్మగిల్లిన కంఠస్వరంతో అడిగాడు.

ఆమె హృదయం ద్రవించి కన్నీటి బిందువులు రాల్చింది.

సంవత్సరాల కాలం పెంచుకున్న మమత ఒక్కసారిగా పెల్లుబికింది.

మౌనంగా తన కుడిచేతిని చాచి అతని చేతులపైవేసి ఆప్యాయంగా నిమిరింది. ఆ స్పర్శలో ఇన్నాళ్ళ తన వేదన అంతా నామరూపాలు లేకుండా కొట్టుకునిపోగా లౌకిక ప్రపంచంతో సంబంధంలేని అలౌకికమైన శాంతి అతడిని ఆవరించింది. తన్మయతతో అతని కనురెప్పలు మూతలు పడ్డాయి.

అలా ఎంతసేపు ఉన్నాడో అతనికే తెలియదు. సర్వాన్ని మరచి అలా కూర్చుండిపోయాడు.

క్షణాలు గడుస్తున్నాయి.

ఆమె ఏదో అడిగింది. తపోభంగం కలిగిన ఋషిలా అతను కళ్ళు తెరచి ఆమె దెస చూశాడు.

"రావ్! ఏమిటి నీ బాధ? నాతో చెప్పవూ" ఆమె కంఠధ్వని తల్లి పిల్లవాడిని లాలిస్తున్నట్టుగా ఉంది.

అతను కరగి కన్నీరు మున్నీరై ఆమె చేతిని గుండెలకు గట్టిగాఅదుముకున్నాడు.

"వసూ! నిన్ను పోగొట్టుకున్న తరువాతే తెలిసింది నాకు-జీవితంలో సర్వస్వం కోల్పోయానని. అందుకు శిక్షగా ఇన్నేళ్ళు ఒంటరితనం వెంటాడి నా హృదయాన్ని ముక్కలు ముక్కలుగా చిత్రవధ చేసింది. అశాంతితో మండే ఈ గుండెకు నీ సాన్నిధ్యం ప్రశాంత శిఖరాన్ని అధిరోహిస్తున్నట్టుగా ఉంది. ఇప్పుడే... ఈ క్షణంలోనే... జీవితంలో నేను కోల్పోయిన ఆనందం ఎంత విలువైందో తెలిసివస్తోంది"

అతని మాటల ధోరణికి అడ్డువేస్తూ "నీ భార్య..." గొణిగిందామె.




"హుఁ...భార్య...జంటగా ఒకరుండి
డా ఒంటిగా బతికిన దౌర్భాగ్యుడిని
. నా ఆనందం, నా అంతరంగం
టో ఆమె ఏనాడూ తెలుసుకోవటానికి
యత్నించలేదు. నిన్ను పోగొట్టు
ందుకు జీవితం మంచి శిక్షే విధిం
"

ఆమె మాట్లాడలేదు. చీరచెంగుతో
కు వత్తుకుంది.

చెప్పు వసూ! నా కోరికను మన్ని
స్తా"

ఆమె నిట్టూర్చి, "వాస్తవం మరిచి పోతున్నావ్! లోకం ఊరుకుంటుందా? అంది.

"వద్దు వద్దు...వసూ! భౌతికలోకాన్ని మన మధ్యకు రానీయకు. నువ్వు అంగీకరిస్తే అన్ని బంధాలనీ తెంచుకుని నీ పాదాలచెంత ఈ చివరిదశ మనశ్శాంతితో గడుపుతాను...కాదనకు వసూ!"

ఆమె చిరునవ్వు నవ్వింది.

వయస్సు మళ్ళిన రావు గంభీరరూపం ఆమె కళ్ళకు పసిపాపలా గోచరించింది.

"ఇంత వయస్సు వచ్చినా నీలో అప్పటి భావావేశం పోనేలేదు రావ్!"

నవ్వుతున్న ఆమె ముఖంలోకి అయోమయంగా చూశాడు.

"ఇన్నేళ్ళూ ఒకరినొకరు స్మరిస్తూ బతకలేదూ! ఇకముందు కూడా అలానే" కంఠానికి ఏదో అడ్డుపడినట్టుగా ఆగిపోయిందామె.

తిరిగి ఆమె మరల చేజారిపోతుందేమో అన్నట్టు ఆమె చేతిని బిగించి పట్టుకుంటూ "అలా అనకు వసూ! ఇహ భరించేశక్తి నాలో సన్నగిలింది. జీవిత చరమాంకంలో దొరికిన ఈ కొద్దిపాటి ఆనందాన్ని నా నుంచి దూరం చేయకు" ప్రార్థిస్తున్నట్టుగా అన్నాడు.

ఆమె దీర్ఘంగా విశ్వసించింది.

చేతిని మెల్లగా విడిపించుకుని లేచివెళ్ళి లైటువేసింది.

* * *

"నేవిన్నది నిజమేనా?"

"ఏంవిన్నావు?"

"ఎవరో స్త్రీతో కలసి రెండు మూడు సార్లు సముద్రపు ఒడ్డున కనిపించావని... ఇంకా ఏమేమో చెప్పుకుంటున్నారు"

వ్యక్తి అంతరంగిక బాధను ఏనాడూ పట్టించుకోని సంఘం తన కట్టుబాట్లకు వ్యతిరేకంగా నడిచేవారి జీవితంలోకి తొంగి చూసి విమర్శిస్తుంది. చెడ్డవారిగా, అవినీతి పరులుగా ముద్రవేస్తుంది. ప్రస్తుతం సంఘం ఆ దృష్టిని తనపై కేంద్రీకరించిందన్న మాట.

దీర్ఘ నిశ్వాసం వదలి "నిజమే" అన్నాడు.

"ఎవరామె?" ఆశ్చర్యంగా అడిగాడు శ్రీపతి.

రావు మాట్లాడలేదు. శ్రీపతి ముఖం

లోకిచూస్తూ ఉండిపోయాడు.

"సారీ ..." తప్పుచేసినట్లుగా గొణిగాడు శ్రీపతి.

"ఫరవాలేదు...నీ కుతూహలం నేను అర్థం చేసుకోగలను. ఆమె నేను కాలేజీలో చదివేరోజుల్లో ప్రేమించిన స్త్రీ. కొన్ని కారణాలవలన నేను ఆమెను వివాహం చేసుకోలేకపోయాను. తిరిగి యాదృచ్ఛికంగా ఇటీవల ఆమె కనిపించింది..." ఇంకా చెప్పబోయి ఆగాడు రావు.

"ఆమెకు భర్త, పిల్లలు..."

"ఎవరూ లేరు. నన్ను మరచిపోలేక ఆమె ఇన్నేళ్లుగా వివాహం చేసుకోకుండా ఒంటరిగానే జీవించింది"

"వివాహం చేసుకోకుండానా?"

"అవును"

"ఆశ్చర్యంగా ఉందే"

నవ్వాడు రావు.

"మరయితే నువ్వు..."

శ్రీపతి మనసులో ఉద్దేశం రావు పసిగట్టకపోలేదు. తన నిర్ణయాన్ని స్పష్టంగా చెప్పదలచుకున్నాడు.

"శ్రీపతీ! ఇన్ని సంవత్సరాల మన స్నేహంలో నేనంటే ఏమిటో నీకు కాస్తో కూస్తో అర్థమయివుండాలి. ఇన్నేళ్లూ నేను బయటకు జీవించిన జీవితంవేరు, నా అంతరంగికజీవితంవేరు. ఆమె, నేనువిడిపోయిన దగ్గర్నుంచి మానసికంగా ఒకరిని ఒకరం ఆరాధిస్తూనే గడిపాం. నా అంతరంగిక జీవితానికి ఆమె వెలుగుదివ్వె. నాకంటూ ఒక వ్యక్తిత్వం ఏర్పడని దశలో అనాలోచితంగా ఆమెను పోగొట్టుకున్నాను. పోగొట్టుకున్నదానికి ప్రతిఫలంగా ఇన్నేళ్లు నేను అనుభవించిన బాధ ప్రపంచానికి తెలియదు. తిరిగి ఈనాటికి ఈ వయసులో ఆమె కనిపించింది. కనిపించి...నాకోసం తన జీవితాన్ని త్యాగంచేసి కేవలం నా స్మృతులతో జీవిస్తున్నట్టు తెలిసిన తరవాతకూడా కృతఘ్నుడనై మరల ఆమెకు ద్రోహం చేయలేను. ఆనాడు నేను చేసిన పొరపాటు ఈనాడు సరిదిద్దుకునే అవకాశాన్ని జీవితం నాకు కల్పించి నా కర్తవ్యం బోధపరచింది. ఈ అవకాశాన్ని కూడా పోగొట్టుకునే తెలివిహీనుణ్నికాను" చెబుతూ మిత్రుడి దెస చూశాడు.

"నీ ఉద్దేశం?"

"అదే చెప్పబోతున్నాను. జీవితంలో మూడువంతుల కాలం గడిచేపోయింది. మిగిలినకాలం ఆమెతో కలసి జీవించాలని నిశ్చయించుకున్నాను" దృఢంగా అన్నాడు.

"ఎలా...నీ భార్య ఊరుకుంటుందా? సంఘం నిన్ను చులకన చేయదూ?"

"నీవు చెప్పింది నిజమే. సంఘానికి వెరచి నా ఆనందాన్ని పోగొట్టుకోలేను. ఇహ నా భార్య అంటావా...ఏనాడూ నాగురించి ఆలోచించని ఆమె ఈనాడు తనకుండే అధికారాన్ని, హక్కుని నాపై ప్రయోగించవచ్చు. అందుకు నేను సిద్ధపడే ఉన్నాను"

"అంటే ఏంచేయాలని?" చిత్రంగా రావుని చూశాడు శ్రీపతి.

"ఆమె నా పరిస్థితిని అర్థంచేసుకోగలిగితే నావద్దనే వుంటుంది. లేకుంటే తనకిష్టమైనట్టుగా జీవించవచ్చు. ఆమె స్వాతంత్ర్యాన్ని నేను ఎన్నడూ కాదనను"

"రావ్ ... సరిగా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చావా?"

నిర్లిప్తంగా నవ్వి ఊరుకున్నాడు.

"నలుగురూ ఏమనుకుంటారు? మధు





దృష్టిలో నీవేమౌతావు?"

రావు సమాధానం ఇవ్వలేదు. ఇద్దరి మధ్యా కొంతసేపు మౌనం.

"నీవు చెప్పే నలుగురితో నాకు ప్రమేయంలేదు. మధు నన్ను అర్థం చేసుకోగలదనే నమ్మకం నాకుంది"

"అయినా ఈ వయస్సులో నీవీ నిర్ణయానికి రావటం ఏం బాగాలేదు"

"నా వయస్సుకి, నా నిర్ణయానికి ఏ సంబంధంలేదు. భౌతికమైన సుఖాలకోసం నేనీ నిర్ణయానికి రాలేదు" కించిత్ తీవ్రత ధ్వనించింది రావు కంఠంలో

"మరెందుకీ నిర్ణయానికి వచ్చావు?" శ్రీపతి కంఠంలో హేళన తొంగిచూసింది. రావు మౌనం వహించాడు. మిత్రుడికి ఇంకా చెప్పబోవటం అనవసరం అనే నిర్ణయానికి వచ్చాడు.

జీవితాన్ని లోతుకంటా కాకుండా పైపైన చూసేవారి దృష్టిలో తననిర్ణయం ఒక అర్థరహితమైన చర్య. స్త్రీపురుషులిద్దరి మధ్యా పెరిగే అనుబంధం కేవలం శారీరక అవసరాల నిమిత్తమే అని తలచే వారి దృష్టిలో తనొక అవినీతిపరుడు, సుఖలాలసుడు. అయినా తన సుఖదుఃఖాలను ఏనాడూ పట్టించుకోని ప్రపంచం ఏమైనా తనకి సంబంధంలేదు. ప్రపంచం అంతా ఏకమైనా తన నిర్ణయాన్ని మార్చలేదు.

"నీ శ్రేయస్సు కోసం చెబుతున్నాను. ఈ విషయం మళ్ళీ ఒకసారి సరిగా ఆలోచించురావ్" వేడుకోలుగా అన్నాడు శ్రీపతి.

నవ్వాడు రావు. ఆ నవ్వులో మిత్రుడి నిర్ణయం మారదనే విషయం తెలిసిపోయింది. శ్రీపతి గత్యంతరంలేక లేచినిలబడి "వెళతాను" అన్నాడు.

"ఆ...వెళ్ళిరా"

శ్రీపతి వెళ్ళిం తరువాత రావు లేచి చేతులు కట్టుకుని మెల్లగా పచార్లు చేయటం ఆరంభించాడు.

తలలో సుళ్ళు తిరిగే ఆలోచనలు స్థిమితం లేకుండా చేస్తున్నాయి. సంఘానికి, వ్యక్తికీ మధ్య పోరాటం ఆరంభం అయింది.

వ్యక్తి అంతరంగానికి, సంప్రదాయానికి మధ్య పోరాటం...

వ్యక్తి హృదయానుభూతులకంటే సంప్రదాయాలకే సంఘం విలువిస్తుంది.

సంఘానికి కావలసింది తన నిబంధనలను అనుసరించి నడిచే వ్యక్తులు.

వారినే సంఘం గౌరవించి కీర్తిస్తుంది. తనను ప్రతిఘటించినవారిని శాయశక్తులా ఖండించి అడుగడుగునా వారి ఆనందానికి అడ్డు తగులుతుంది.

తను గీచినగీటు దాటాడనే అక్కసుతో అనుక్షణం వెంటాడి హింసిస్తుంది.

దాని ధాటికి తట్టుకోలేని బలహీనులు అంతరంగం నోరు నొక్కి పొంగే ఆశలని, ఆనందాన్ని అణగదొక్కి సంఘానికి దాసోహం చేస్తారు.

పెళ్ళి, భార్య, పిల్లలు, ఆ పిల్లలకు పిల్లలు...అనాదిగా ఇది ఒక గిరగిర తిరిగే చక్రం. ఒకే గాడిలో తిరిగే చక్రం. ఇందులో ఇమడక స్వతంత్రం ప్రకటిస్తే సంఘంతో బహిష్కరింపబడి ఒంటరి వారవుతారు.

సంప్రదాయం, ఆచారం, నీతి, కట్టుబాట్లు-ఇవి ఆ చక్రాన్ని తిప్పేశక్తులు.

జీవితంలో ఏ అనుభవాన్నయినా సరే వ్యక్తి వీటి పరిధిలోనే అనుభవంలోకి తీసుకోవాలి. అది తాత్కాలికమైనా, యాంత్రికమైనాసరే. వీటిని మించిన గాథ

అనుభవాలు వ్యక్తికి ఎదురై వాటికోసం అతను జీవితాన్ని అర్పిస్తానంటే సమాజం అతడిని హేళనచేసి దుయ్యబడుతుంది.

నలుగురూ ఆమోదించే సాంప్రదాయకమైన విలువలే సంఘం దృష్టిలో నైతిక విలువలు. వ్యక్తి నీతికి ఇందులో తావులేదు. వివాహితుడైనా, అవివాహితుడైనా యౌవనంలోవున్నా, వార్ధక్యంలో వున్నా సాంఘిక చట్రాన్ని ఎదిరించి స్వంత వ్యక్తిత్వం ప్రదర్శించే స్వేచ్ఛ లేదు.

హృదయాన్ని, స్వేచ్ఛాస్వాతంత్రాల్ని తాకట్టుపెట్టి సంఘంవేసే మిథ్యా గౌరవపు ముసుగుల్లో మనుషులు తమ అస్తిత్వాన్ని మరచి ఆటబొమ్మల్లా సంచరిస్తుంటారు, తప్పనిసరై.

మనిషి ఎదిగేకొలదీ, తనకై కొన్ని అభిరుచుల్ని ఏర్పరచుకొనే కొలదీ, తన చుట్టూ ఉండేవారికి దూరమౌతుంటాడు.

సంఘ కబంధ హస్తాలకు అందకుండా తన అంతరంగం ఆశించే ఆనందం అందుకోవటానికై శాయశక్తులా యత్నిస్తుంటాడు.

వర్తమాన సమాజానికంటే ముందుగాతనదృష్టిని ఉన్నతపథం వైపుగా కేంద్రీకరిస్తాడు.

యుగాలుగా ఎదిగినవారికీ, ఎదగనివారికి మధ్య ఎడతెగని సంఘర్షణ... పూడ్చలేని వెలితి.

వర్తమానంతో రాజీపడలేక భవిష్యత్తులో జీవించే వ్యక్తి చుట్టూ శూన్యం ఎడారిలా పరచుకుంటుంది.

తనవాళ్ళనుకునేవారెవరూ తన చుట్టూ ఉండరు. ఏకాకియై వేదన భరించవలసి వస్తుంది.



తను సంఘాన్ని మార్చలేడు.

వ్యక్తులతో తలపడి వాదించలేడు.

ఈనాటికీ జీవితంలో మహత్తరమైన ఆనందం తనకై వేచివుంది. దానికైతనే సంఘంనుండి వైదొలగిపోతాడు. సాంఘిక బంధనాలనుండి స్వతంత్రుడై స్వేచ్ఛాగానంఆలపిస్తూ జీవనపథంలో కొనసాగుతాడు.

ఈ పిచ్చి ప్రపంచం తననేమీ చేయలేదు. దీనినుండి తానేమీ ఆశించటం లేదు. దీని దూషణ భూషణలకు అతీతంగా అమరత్వం కోసమై అడుగులు వేస్తాడు.

తనచుట్టూ వినిపించే విమర్శలను హేళనలను నవ్వుతూ భరించి వారందరినీ ఔదార్యంతో క్షమిస్తాడు.

ఏన్నో సాధించినట్టుగా రావు హృదయంలో ప్రశాంతమైన వెలుగు వాహిని. ఇన్నాళ్ళు తనను ఊపి నిలువెల్లా కదలించిన ఆలోచనాతరంగాలు నిశ్చలత్వం పొంది హృదయ సాగరం లోకి ఒదిగిపోతున్నాయి. తనేమిటో తెలిసి తనతో తనచుట్టూవుండేపరిస్థితులతో ఏర్పడిన సమరసదృష్టి అన్ని భిన్నత్వాలని తనలోదాచుకుని ఏకరూపంపొంది ...ఏదో, ఏన్నో సాధించినట్టుగా ఉంది. హృదయంలో మంచుశిఖరాలు విరిగిపడి కరిగికరిగి సరసరాన్న శాంతి పవనాలు వీస్తున్నట్టు అణువణువునా ఆనందం చిందులేస్తున్నట్టుగా ఉంది.

రావు గుండెలనుండి వెలువడింది దీర్ఘ నిశ్వాసం.

బాహ్యప్రపంచంలో కనిపించే భిన్నత్వాన్నంతా తనలోకి ఇముడ్చుకోగలిగే ఔన్నత్యం, అపూర్వమైన శాంతి, తృప్తి, ఏదో స్థిరత–అన్నీ ఆ నిశ్వాసంలో ప్రతిఫలించాయి.

* * *

"నాన్నగారూ!"

"ఏం మధూ!"

తండ్రిరూపం కొత్తగా, వింతగా గోచరిస్తోంది మధు కళ్ళకి. పరిచయంలేని ఆ రూపం మధుని తటపటాయింప చేస్తోంది. కొన్ని క్షణాలు మాటలు రానట్టు ఉండిపోయాడు.

కొడుకుని చూసిన రావులో అనేక ప్రశ్నలు తలెత్తాయి.

మధూ ఏం చెప్పబోతున్నాడు?

మనసులో తన గురించి ఏమనుకుంటున్నాడు?

తన రక్తాన్ని పంచుకుపుట్టిన తన కొడుకైనా తనను అర్థం చేసుకుంటాడనే ఆశ, విశ్వాసం ఈ క్షణాలతో అంతరించబోతోందా?

తన బాధను అర్థం చేసుకునేవారేరా ఈ ప్రపంచంలో?

చిన్నతనం నుండి తనతో అనేక విషయాలు చొరవగా చర్చించే కొడుకు తనని ఎందుకు కొత్త వ్యక్తిని చూస్తున్నట్టు చూస్తున్నాడు?

ఇన్నాళ్ళూ తన పట్లగల అభిప్రాయానికి తిలోదకాలిచ్చాడా...?

ఎందుకా సందిగ్ధం?

తండ్రీకొడుకుల మధ్యకాలం భారంగా గడుస్తోంది. ఒకరికొకరు అపరిచితుల్లా అనిపిస్తున్నారు. ఇద్దరి హృదయాల్ని నిగూఢమైన బాధ ఏదో పట్టి పీడిస్తున్నది. అనుబంధం, ఆప్యాయత తమ స్థానాన్నుండి వైదొలగి తిరిగి పూర్వస్థానాన్ని వెదుక్కుంటున్నాయి. ఒకరికొకరు ఎదుటివారి అంతరంగాన్ని పట్టిపట్టి చూస్తున్నట్టుగా ఒకరి దెస ఒకరు చూస్తూ నిలబడిపోయారు.

క్షణాలు గడుస్తున్నాయి.

అంతరాంతరాలనుండి మమకారం పొంగి వెల్లువలై శరీరం అణువణువునూ ముంచెత్తుతోంది. దాని వేగానికి తట్టుకోలేని గుండె చెమర్చి ఆర్ద్రిత కంఠనాళాలలోకి ఉబికింది. గొంతు మూగపోయినట్టుగా మాటలురాక చేష్టలుడిగి నిల్చుండిపోయారిద్దరూ.

ఆ పరిస్థితి నుండి బయటపడుతూ, "ఏమిటి చెప్పు మధూ?" అన్నాడు రావు.

"అమ్మ నాతో వస్తానంటోంది"

తనను తాను సంబాళించుకుని చూపులు తిప్పి ఎటో చూస్తూ మెల్లగా అన్నాడు.

రావు మాట్లాడలేదు.

"తనిక్కడ మీతో ఉండదట. నాదగ్గరే ఉంటానంటోంది"

"అలాగే .... తీసుకెళ్ళు. ఆమె అభిమతాన్ని నేను ఎన్నడూ వ్యతిరేకించను"

"మరి ఇంట్లో...ఒక్కరూ..."

నిట్టూర్చాడు రావు.

"మీ అమ్మ నాతో ఉండటానికి ఇష్టపడనప్పుడు నేను మాత్రం ఒక్కడినీ ఈ ఇంట్లో ఎందుకు? అద్దెకు ఇద్దాం"

"ఇచ్చి, ఎలా... మీరెక్కడ ఉంటారు?"

కళ్ళెత్తి కొడుకు ముఖంలోకి చూశాడు రావు. ఆ ముఖంలో తన క్షేమం కోసం ఆరాటం తొంగిచూసింది.

కొడుకు కళ్ళల్లోకి చూస్తూ ఆప్యాయంగా చిరునవ్వు నవ్వాడు.

"మధూ! విషయం అంతా మీ అమ్మ ద్వారా నీకు తెలిసే ఉంటుంది. నా పరిస్థితిని నీవు సహృదయంతో అర్థంచేసుకోగలవనే విశ్వాసం నాకుంది. మీ అమ్మ నాతో కలసి యధావిధిగా జీవించాలనుకుంటే నా అభ్యంతరం ఉండదు. దానికి ఆమెఅంగీకరించకపోతే ఆమె కోరినట్టుగా

జీవించవచ్చు. ఇక నావిషయం అంటావా- నా నిర్ణయానికి కట్టుబడి నేను ఇక్కడ ఉండక తప్పదు"

"అంటే మీరు..."

"అవును. ఆమెతోనే ఉంటాను"

మధు మాట్లాడ లేదు.

కొంతసేపు ఇద్దరి మధ్యా మౌనం నెలకొంది.

తండ్రి వదనంలో మెరుస్తున్న వెలుగుని చిత్రంగా చూస్తున్నాడు మధు. ఆ స్థితిలో తండ్రిని తనెన్నడూ చూడ లేదు. ఎప్పుడూ ఆలోచనామగ్నమై గాంభీర్యం తొణికిసలాడే రూపాన్నే తన ఊహ తెలిసిననాటి నుండి చూసిన గుర్తు.

జీవితం సఫలీకృతమైనట్టూ, అన్వే షణాపథంలో చొచ్చుకునిపోయేవానికి తన అన్వేషణ ఫలించి, కోరింది లభించి నట్టు, ఆ ముఖంలో ఏదో సంతృప్తి. ఆనంద సామ్రాజ్యానికి అధిపతిఅయి నట్టుగా ఆ కళ్ళలో ఏదో కాంతి! అనంత సాగరగర్భాన్ని తలపించే ఏదో నిశ్చలత ప్రశాంతత ఆ ముఖకవళికలలో ద్యోతకమవుతున్నాయి.

జీవితాన్ని ప్రతి అణువూ శోధించి దేన్నో సాధించాలని తపించి తపఃసిద్ధి పొందినట్లుగా ఉంది తండ్రి ఆకారం.

తండ్రిని అలా చూస్తున్న మధు హృదయంలో తనకే తెలియని తృప్తి, ఆనందం నిండుకోసాగాయి.

"నాన్నగారూ! మీకేది ఆనందమని తోస్తే అలాగే చేయండి. అమ్మ విష యంలో మీరు బాధపడవద్దు. ఆమె నావద్ద నిశ్చింతగా జీవించేటట్టుగా నేను చూసుకుంటాను" అతి ప్రయత్నం మీద కంఠం పెగల్చుకుని అన్నాడు మధు.

మధు మాటలు మంచుకణాలా తాకి రావు హృదయారాటాన్ని తగ్గించి సేద తీర్చినాయి. కృతజ్ఞత తొణికిసలాడు తుండగా కొడుకు కళ్ళలోకి చూశాడు.

ప్రేమతో కొడుకు భుజం నిమురుతూ "థాంక్యూ....థాంక్యూ" అన్నాడు.

* * *

"ఇందూ!"

భార్య మంచం దగ్గరకి నడచి వంటిపై చేతిని వేసి ఆప్యాయంగా పిలిచాడు.

"ఏమిటి?" ఇటు తిరగకుండానే ప్రశ్నించిందామె.

ఆ కంఠంలో ధ్వనించిన నిర్లక్ష్యానికి గాయపడి తిరిగి సర్దుకున్నాడు. తామిద్దరి మధ్యా సామరస్యం కోసం ప్రయ త్నించటం తన విధి. తప్పదు...సాధ్య మైనంతవరకూ ఈ ప్రయత్నాన్ని సున్ని తంగా సాధించాలి.

"మధుతో వెళతానన్నావట...'' మృదువుగా అడిగాడు.

"అవును....అన్నాను"

''ఎందుకని? నాతో ఉండటం నీకిష్టం లేదా?''

"ఇష్టంలేదు. ఇక్కడ మీతో ఉండ వలసిన అవసరం నాకులేదు"

''అదేమిటి? నిన్ను నేను కాదన్నానా?"

"కాకుంటే...మీ ప్రవర్తనకు అర్థం?"

రావు కొద్దిక్షణాలు మాట్లాడలేదు.

"దయచేసి నన్ను అర్థం చేసుకోవ టానికి ప్రయత్నించు ఇందూ!''

"..............."

"నిన్ను ఎన్నడయినా అలక్ష్యం చేశానా?"

''మీ సంజాయిషీ నాకు అవసరం లేదు. మీ సానుభూతిని ఆశించవలసిన అవసరం నాకు లేదు" తీవ్రంగా అంది ఆమె.




ఆమెకు ఎలా నచ్చచెప్పాలో రావుకి బోధపడలేదు.

అదే ధోరణి...ఇన్నేళ్ళుగా తనను వేధించి వేధించి ఒంటరివాడిని చేసిన ధోరణి. ఆమె ఇక మారదా? ఎప్పటికీ ఇంతేనా?

ఏం చేయాలో తోచలేదు.

కాలం గడుస్తోంది.

రావు తిరిగి ఆమెపక్కన కూర్చుని ఒంటిపై చేతిని వేశాడు.

విసురుగా చేతిని తోసివేసిందామె.

మనస్సు చివుక్కుమంది. మమత మూగపోయి మౌనం దాల్చింది.

ఇన్నాళ్లుగా తామిద్దరిమధ్యగల అనుబంధంతో ఆమె తనను కాస్తయినా అర్థం చేసుకుంటుందేమోనని ఆశించాడు. ఆ ఆశ ఆరిపోయింది.

"సరే...నీ ఇష్టం. ఇన్నేళ్ళు కలసి బతికిన మన మధ్య ఏమీ లేదని, ఉండదని నేను అనుకోవటంలేదు. నిన్నొక వ్యక్తిగా ఎప్పుడూ గౌరవించాను. భార్యగా అభిమానించాను. వాటిని నువ్వు కాదంటే నేను చేయగలిగింది ఏమీలేదు. కాని ఎప్పటికైనా నేను నీకు కావాలనిపిస్తే, తిరిగినాతో కలసి జీవించాలనుకుంటే అందుకు నా అభ్యంతరం ఎప్పుడూ ఉండదు''

మెల్లని స్వరంతో సానునయంగా చెప్పి లేచి నిలబడ్డాడు రావు.

* * *

విశ్వగోళాలన్నీ ఆనందంతో నృత్యం చేస్తున్నట్టు....

సమస్త సౌందర్యం భరింపరాని వెలుగుతో కళ్ళు మిరుమిట్లు గొల్పుతున్నట్టు...

ఆనందం, విషాదం మధ్యగల సరిహద్దురేఖ చెదరి ఆత్మ విశ్వాత్మలోలీనమై అమరత్వం సిద్ధించినట్టూ...

అనాదిగా మానవ హృదయంలో దాంగే కాంక్షలూ, కలలూ, కోరికలూ బాంధలూ అన్నీ విశ్వమంతా విజయ విహారం చేస్తున్నట్టూ...

రక్తానికి బదులు నాళాలలో ప్రవహిస్తున్న ఆనందపు ఉద్విగ్నత...

మల్లెలుఎదపైజల్లినట్టుగాసుకుమారంగా ప్రకంపించే హృదయతంత్రుల సవ్వడి...

ఏదో అలౌకికమైన, అపూర్వమైన అనుభూతి తెర రావు శరీరాన్ని మనసుని ఆవహించింది.

"వసూ!"

"ఊఁ...."

"ఇంతశాంతిఇన్నేళ్లుగా నేనుఎన్నడూ అనుభవించలేదంటే నమ్ముతావా?"

సాగర జలాలపై వెన్నెల కురిసినట్టు ఆమె నవ్వింది. మెత్తగా అందంగా; నవ్వింది.

"ఇన్నాళ్ళూ జీవితంలో వేదన తప్ప మరేమీ లేదనుకునేవాడిని. జీవితం చివరి పుటల్లో నాకోసం ఇంత ఆనందం ఉందని నాకు తెలియనేలేదు సుమా"

ఆమె ఒడిలో తల పెట్టుకుని కళ్ళు మూసుకుని ఏదో లోకంనుండి మాట్లాడుతున్నట్టుగా వున్న రావు తలవెంట్రుకలను ఆమె సున్నితంగా సవరించింది.

ఆ స్పర్శలో సర్వప్రపంచాన్నీ మరచి సేదదీరాడు.

తన అస్తిత్వం మాయమై...

ఆమెలో ఐక్యమై...

ఏకరూపం దాల్చినట్టుగా...

తాదాత్మ్యతతో అతని కనురెప్పలు మూతలు పడ్డాయి.

★




## అభిప్రాయం

"నమస్కారంమాష్టారూ! మొన్న మీదో కథ చదివాను. బాగుంది...కంగ్రాట్స్" రామానుజాన్ని అభినందించాడుప్రకాశం. అతను కాలేజీలో చదివే రోజుల్లో రామానుజం ఇంగ్లీషు లెక్చరర్. ప్రస్తుతం ప్రకాశం ఆవూళ్ళోనే బాంకులో క్లర్కుగా పనిచేస్తున్నాడు.



"థాంక్యూ! నువ్వు చదివింది తెలుగు వెలుగులో వచ్చిన 'గంగిగోవుపాలు' కథే కదూ?"

"అవును మాష్టారూ! మరింకేమైనా ఈ వారం వచ్చాయా?"

"అబ్బే...లేదు. అసలు నేను రాస్తేగా? నా బద్ధకం మీకందరికీ తెలిసిందేగా?"

"మీలాంటివాళ్ళురాసుండాలిమాష్టారూ! 'గంగిగోవుపాలు'కథలోట్విస్ట్ థ్రిల్లింగ్‌గా వుంది"

"ఇదే విషయం చాలామంది చెప్పారోయ్! అవును..నాతో చెప్తే ఏం లాభం? బాగున్నా, బాగుండకపోయినా మన ఖచ్చితమైన అభిప్రాయం పత్రికకు రాస్తే అందరికీ తెలుస్తుందిగా?"

"అలాగే రాస్తాను సార్"

"పత్రిక అడ్రసు తెలుసా?"

"పత్రికమీద వుంటుందిగదా సార్!"

"పోనీ అడ్రసున్న కార్డు ఉంది... ఇవ్వనా?"

"అలాగే. మా బస్ వస్తోంది మరి" అంటూ పరిగెత్తాడు ప్రకాశం.

ప్రకాశం ఆ కథమీద వుత్తరం రాయలేదు. కాని ఆర్నెల్ల తర్వాత మరో ప్రచారం వున్న వీక్లీలో ప్రచురింపబడిన రామానుజం మరో కథమీద ఘాటైన విమర్శ రాశాడు-అది ఒక ఆంగ్ల కథకు అనుసరణ అని.

అది చూసిన రామానుజం గుండె బరువెక్కి వెంటనే బాంకుకి వెళ్ళాడు.

వినయంగా నమస్కరించిన ప్రకాశం మీద విరుచుకుపడ్డాడు, తుఫానులా.

"ఏవోయ్ప్రకాశం! కనీసంగురువన్న మర్యాద కూడా లేకుండా అలా విమర్శిస్తూ వుత్తరం రాశావే? ఊళ్ళో వాడివి ... లోటుపాట్లుంటే నాతోనే చెప్పొచ్చుగా?" అన్నాడు ఆవేశంగా.

"మాష్టారూ! క్రితంసారి మీరువి అభిప్రాయమైనా పత్రికకు రాయటం మంచిదన్నారుగా! అందుకే గురువాజ్ఞ

అనుకుని అలా రాశాను" అన్నాడు ప్రకాశం.

"అదా! అభిప్రాయమంటే నా వుద్దేశం ...."సీన్ను సమి లేశా డు రామానుజం.

— పైడిపాల

## పిల్లా-పీచూ

విజయగర్వంతో ఇంట్లోకి అడుగెట్టిన వీరేశ్వరావు మొహంలో ఆనందాన్ని భార్య, పిల్లలు వింతగా చూశారు. పిల్లల గోల భరించలేక అర్ధరాత్రి దాటాకతప్ప ఇంటికి ఏనాడూ రాని వీరేశ్వర్రావ్ ఆఫీసునుంచి సరాసరిరావటం అపూర్వమే.

పిల్లల వంక ఓరచూపు చూ



స్తై రక్టుగా బెడ్‌రూంలోజేరి తలుపులు బిడాయించుకున్నాడు. అంతే! అప్పటిదాకా నిశ్శబ్దంగావున్న ఆ గది పిల్లల గోలతో ఎగిరెగిరిపడసాగింది.

వీరేశ్వర్రావ్ అర్ధరాత్రిదాటాకతలుపులు తీసుకొని బయటికి వచ్చాడు. అప్పటికి అలసిన అల్లరి మూక తలావాక మూల పడుకొని వున్నారు. అరచి అరచి కొస ప్రాణంతో వున్నట్టున్న భార్యామణి వీరేశ్వర్రావ్ కాళ్ళకి తగిలింది. అతను ఆమెను లేపి నెమ్మదిగా లోపలికి తీసుకెళ్ళి స్వాంతనపరచి తను తెచ్చిన పుస్తకం చూపిస్తూ ధైర్యం చెప్పాడు.

ఆనందంతో ఎగిరిపోయే హృదయాన్ని అదిమిపెట్టుకుంటూ ఆ పుస్తకం వంక మురిపెంగా చూసిందామె.

"పిల్లల్ని దారిలోకి తేవటం ఎలా?" అని ఉందా పుస్తకం అట్టమీద.

* * *

మర్నాడు ఉదయమే సత్తుగిన్నె ఒకటి వీరేశ్వర్రావ్ నెత్తిమీదపడి సుప్రభాతం పలికింది. ఉలిక్కిపడుతూ లేచి కూర్చున్నాడు. తలమీద బొప్పిని తడుముకుంటూ దిండుకింద పుస్తకాన్ని తీసి తెరిచాడు.

"అల్లరి చేసే పిల్లలకు సంగీతం విన్పిస్తే బుద్ధిగా వుండిపోతారు"

నూతనోత్తేజంతో లుంగీ బిగించి కదుతూ హాలులోకినడిచాడు వీరేశ్వరరావ్.

అప్పటికే ఆ హాలు రణరంగంలా అల్లరి, కేకల మధ్యలో చింపిరి జుట్ల పిల్లల్తో ఉంది. ఎవరెవరో గుర్తుపట్టలేక పోయాడా తండ్రి. వెంటనే టేప్ రికార్డరు తీసి కాసెట్ 'సంధించాడు'.

"ఊరించే... వయసిది... లాలించే మనసిది... రేయంతా మేలుకున్నది... పగలంతా కలలు ... కన్నది ... నీ కోసమే..."

ఆశ్చర్యం! పిల్లలు అల్లరి మానేశారు. అందరూ గుండ్రంగా నిలబడ్డారు. ఒకడు మధ్యలోకి వెళ్ళి పాటకనుగుణంగా డాన్సు చేయసాగాడు.

వీరేశ్వరరావ్ ఆనందంతో తలపంకించి సౌండ్ పెంచాడు. అంతే!

డాన్సుచేస్తున్న కేతిగాడు తనదుస్తుల్ని ఒక్కటొక్కటే విడిచి 'కాబరే' వైపులోకి మారాడు. రెట్టించిన ఉత్సాహంతో మిగిలిన వారు కూచిపూడి నృత్యాన్ని అభినయించ సాగారు.

వీరేశ్వరరావు పుస్తకాన్ని చేతిలోకి తీసుకొని ఓ పేజీ తెరిచాడు. "వాళ్ళయెడ సహనం వహించాలి". పిల్లలు అతని మొహంమీద నవ్వు చూసి మరింత ప్రేటేగిపోయారు. వంట సామానుతో రణరంగ క్రీడ మొదలుపెట్టారు. తనమీద పడే గిన్నెల్ని, చెంబుల్ని, తప్పేలాల్ని ఒడుపుగా కాచ్‌చేస్తూ నెమ్మదిగా వెళ్ళి ఒకడిని తలనిమిరి ముద్దుపెట్టుకున్నాడు. వెంటనే మిగిలినవాళ్ళు వాడికి శతృవులై పోయి వీరేశ్వరరావును పక్కకునెట్టేసి శత్రువుని చితకకొట్టసాగారు. కాసేపటిలో ఎవరు ఎవరిని కొట్టుతున్నారో అర్థంగాని పరిస్థితిని అయోమయంగా చూస్తూ మడిచి పెట్టుకున్న పుస్తకాన్ని తెరిచాడు వీరేశ్వరావు-గుడ్లనీరు కుక్కుకుంటూ.

"పిల్లలు పోట్లాడుకుంటూంటే వారికి ఆకలేసిందని అర్థం"

లేని సహనాన్ని కొనితెచ్చుకుంటూ, ఆ యుద్ధభూమిలోంచి తప్పించుకుని వంటింట్లోజేరాడు. అప్పటికే భార్య రాత్రి అతనిచ్చిన సలహామేరకు వంట సిద్ధంచేసి వుంచింది. వెరైటీగా వుండాలని కంచంతీసుకొచ్చి చెంచాతో 'గణగణ'మని మోగిస్తూ పిల్లలని పిలిచాడు. అందరూ వంటఇంట్లోకి పరుగెత్తారు.

అన్నం, కూర, పచ్చడి అన్నీ వడ్డించిన కంచాల్నిచూసి వాటిమీదకు దూకారు. ఊరుకోలేని ఒకడు పక్కవాడి కంచంలో కూరని తీసుకుని తినేశాడు. వాణ్నిచూసి కోపంతో మిగిలిన కూరని వాడి మొహం మీదకి విసిరేశాడు. "బలే...బలే...ఈ ఆట బాగుందే" అనుకుంటూ మిగిలిన వారూ రడీఅయిపోయారు.

పదినిమిషాల్లో ఇంట్లోవున్న వంట పదార్థాలన్నీ పిల్లల ముఖాలమీదకు జేరి పోయాయి. ఇక భరించలేక వీరేశ్వరరావు పెద్దగా అరిచాడు. పిల్లలు మరింత పెద్దగా అరిచారు. వాళ్ళగోలతో సగం జుట్టు వూడిపోయిన తలమీది జుట్టును మరింత పీక్కున్నాడు. పిల్లలు కూడా వచ్చి తండ్రికి సాయంచేస్తూ అతని జుట్టు పీకసాగారు. 'అమ్మో' అంటూ కేక పెట్టి వారినుంచి విడిపించుకుని పరిగెత్తి పిచ్చి పట్టినవాడిలా పుస్తకం తిరగేశాడు.

"ఎంత అల్లరిచేసినా వాళ్ళు పసివాళ్లు. పిల్లలు దేవుళ్ళతో సమానం"

తిక్కరేగిన వీరేశ్వరరావు పుస్తకాన్ని పరపరా చింపేశాడు.

—కస్తూరి రాజశేఖర్

విపుల

చతుర

1986 మే నెలలో 100వ సంచిక విడుదలయ్యే సందర్భములో

రూ. 1,00,000ల బహుమతులతో

# కథల, నవలల పోటీ

## ధన్యవాదాలు

100వ సంచికలు వెలువడుతున్న సందర్భంగా విపుల- చతురలు నిర్వహిస్తున్న కథలు, నవలల పోటీలకు సమధికోత్సాహంతో తమ రచనలను పంపుతున్న సాహితీపరులకు...

అపూర్వమైనరీతిలో గతకొద్ది మాసాలలో రెట్టింపుకుపైగా పెరిగిపోయిన మా పాఠక మహాశయులకు...

నిర్విరామకృషితో విపుల-చతురలు రెండూకలిపి నెలనెలా లక్ష కాపీలదాకా అమ్మకం జరిగేలా తోడ్పడిన ఏజెంట్ మిత్రులకు...

మా ధన్యవాదాలు

ఈ పోటీలకు తెలుగు కథలు-నవలలు మాకు చేరవలసిన ఆఖరు తేదీ 30-4-1986

ఆంధ్రేతర భాషా పాఠకుల కథలు, నవలలు అందవలసిన ఆఖరు తేదీ: 30-5-1986

## విపుల

| | |
|---|---|
| ఒక అత్యుత్తమ తెలుగు కథకు | రు. 3,000 |
| ఒక అత్యుత్తమ ఆంధ్రేతర భారతీయ భాషాకథకు ఏ భాషవయినా | రు. 3,000 |
| మూడు ఉత్తమ కథలకు రు.1,000 చొప్పున | రు. 3,000 |
| పది మంచి కథలకు రు. 500 చొప్పున | 5,000 |
| 120 కథలకు కన్సొలేషన్ బహుమతులు రు. 300 చొప్పున | రు. 36,000 |

## చతుర

| | |
|---|---|
| ఒక అత్యుత్తమ నవలకు | రు. 10,000 |
| ఒక ఉత్తమ నవలకు | రు. 6,000 |
| ఒక మంచి నవలకు | రు. 4,000 |
| పది నవలలకు కన్సొలేషన్ బహుమతులు (నవలకు రు. 3000/- చొప్పున) | రు. 30,000 |

# సితార

• మీరు అభిమానించేది ఏ తారనైనా సరే
మీకు కావల్సింది సితార

• మల్టీకలర్ ముఖచిత్రమే కాదు, అనేక రంగుల సెంటర్
స్ప్రెడ్‌తో మిమ్మల్ని మురిపించి, మైమరపిస్తుంది
సితార

ఆకాశంలో వెలిగేది ధ్రువతార
సినీ జగతిలో వెలిగేది సితార

• సినిమాకు సంబంధించిన అన్నిరకాల వార్తలకు,
వ్యాఖ్యలకు, కబుర్లకు, విమర్శలకు పెట్టింది పేరు
సితార



ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ
హైదరాబాద్ - 500004



Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly

# గ్లూకోన్-డి సూపర్‌హీరో.

ఉక్క పోస్తూ అలుపు
పుట్టించే రోజున కూడా
ఉరకలు వేసే శక్తి.




అలుపు తెచ్చే వేసవి రోజున మీ అబ్బాయికి కావలసింది గ్లూకోన్-డి: గ్లూకోజు, విటమిన్ డి, కాల్షియం ఫాస్ఫేట్లు గల తక్షణ శక్తినిచ్చే పానీయం.

గ్లూకోన్-డిని పళ్లరసం, పాలు, టీ, కాఫీ, లేదా నీళ్లలో కలిపారంటే కుటుంబం మొత్తానికి ఒక ఉల్లాస పానీయంగా తయారై పోతుంది. 100, 200, 500 గ్రాముల ప్యాకులలో లభిస్తుంది గ్లాక్సో వారి గ్లూకోన్-డి.

అసలైన, కొత్త, ఘుమఘుమల ప్యాక్ కోసం చూడండి.

## గ్లూకోన్-డి ®

సూపర్‌హీరో అమితంగా ఇష్టపడే శక్తినిచ్చే పానీయం

GLL-2389

